# ప్రసార ప్రముఖులు



రచన :

డా॥ ఆర్. అనంతపద్మనాభరావు

M.A. Ph D.,

స్టేషన్ డైరక్టర్, ఆకాశవాణి

విజయవాడ

ప్రచురణ :

డిసెంబరు 1996

ప్రతులు : 1000



వెల : రు. 60.–

ముఖచిత్రం :

శ్రీ మారేమండ శ్రీనివాసరావు

గుంటూరు

ప్రతులకు :

న్యూ స్టూడెంట్ బుక్ సెంటర్

ఏలూరురోడ్డు

గవర్నరుపేట

విజయవాడ - 520002

ముద్రణ :

వాణీ ప్రెస్

విజయవాడ-2

# కైమోడ్పు

ప్రసార ప్రముఖులు ఎందరో మహనీయులు. వారిని గూర్చి యువతరానికి తెలియదు. ఆయా రంగాలలో లబ్ధ ప్రతిష్ఠులైన ఈ వ్యక్తులు ఆకాశవాణిలో పని చేయడం సంస్థకు గౌరవం తెచ్చి పెట్టింది. దిగ్దంతుల వంటి వారి పర్యవేక్షణలో ఎన్నో మంచి ప్రసారాలు వచ్చాయి. ఆయా వ్యక్తులకు సంబంధించిన జీవిత రేఖల్ని సేకరించాను. విజ్ఞాన సర్వస్వం సంపుటాలతోబాటు రేడియోలో పనిచేసిన వ్యక్తుల్ని ఎందరినో సంప్రదించాను . విషయ సేకరణ అయిన తర్వాత గురుతుల్యులు, ప్రసారమాధ్యమంలో భీష్ములు డా॥ బాలాంత్రపు రజనీకాంతరావుగారికి నా ప్రణాళిక వినిపించాను. తథాస్తు అన్నారు. వారే మున్నుడి వ్రాసినందుకు కృతజ్ఞతాంజలి.

Y's Men International వారి సభలో పాల్గొంటూ పుస్తకాలు ప్రచురించడం వ్యయ ప్రయాసలతో కూడిన పని అన్నాను. సభ చివరలో సహృదయులు శ్రీ దీవి కోదండ రామాచార్యులు స్వయంగా లేచి వచ్చి "మీ పుస్తకం నేను ప్రచురిస్తా" నని చెప్పారు. ఆయన ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యులు. మంచి మనస్సుతో వారామాట చెప్పగానే నే నీ గ్రంథం తయారు చేశాను. ప్రచురణ భారాన్ని స్వీకరించిన వారికే ఈ గ్రంథం ఆత్మీయతతో కానుకగా సమర్పిస్తున్నాను. వారి నిండు మనస్సుకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

వీలైనంత సమాచారం అందించగలిగాను. ఫోటోలు కూడా సేకరించి ప్రచురించాలనుకొంటే అధిక వ్యయమవుతుందని విరమించాను. ఇంకా ఎందరో మహానుభావుల వివరాలు ప్రచురించవచ్చు. ఇది తొలి ప్రయత్నమని మనవి చేస్తున్నాను. గ్రంథం అచ్చొత్తించడంలో వాణీ ప్రెస్ అధినేత శ్రీ అగ్నిహోత్రం రంగాచార్యులవారు ఎంతో శ్రద్ధ కనబరచి సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు.

ప్రఖ్యాత చిత్రకారులు, ఆత్మీయ మిత్రులు శ్రీ మారేమండ శ్రీనివాసరావు ముఖ చిత్రాన్ని చక్కగా తయారుచేసి అందించారు. మైత్రికి వారు మారుపేరు. ఇందులో "వారిని చేర్చలేదు, వీరిని చేర్చలేదు" అనే విమర్శకులకు ఒక్కటే సమాధానం. అందినంత మేరకు సమాచారం అందించగలిగాను. దయతో స్వీకరించండి.

1996 వైకుంఠ ఏకాదశి. డా॥ ఆర్. అనంతపద్మనాభరావు

# ముందుమాట

ప్రసార ప్రముఖులు అనే శీర్షిక చూడటం తోటే 'అరె, నేను వ్రాసి వుండ వలసిన శీర్షిక ఏమో' అనిపిస్తుంది. అయినా నా కిష్టుడు చాలా సమర్థుడు అయిన శ్రీ అనంత పద్మనాభరావు దానిని సిద్ధం చేసి నన్ను మున్నుడి వ్రాయమని ఒకసారి దానిలో ప్రవేశం కలిగించారు.

నిజానికి నేను ఆకాశవాణి చరిత్ర Chronology (చారిత్రక పౌర్వాపర్యం) సరిగ్గా తెలిసిన కొద్ది మందిలో ఒకణ్ని అయినప్పటికీ నామస్మరణంలోను, చర్విత చర్వణంలోను కొంచెం ముందు వెనుకలు తప్పనిసరిగా తారసిల్లడం సహజం !

ఇందులో దక్షిణ భారతంలో భారతీయ రేడియో (All India Radio) తొలి కేంద్రం నెలకొల్పడానికి Asbestos అట్టలను, స్టూడియో నిర్మాణానికై వెద్రపు కొయ్యలను, ఎగ్మూర్ మార్షల్స్ రోడ్డు, Eastnoox సౌధం పై డాబాల గదుల్లో వడ్రంగపుపనులు, తాపీ పనులు జరుగుతున్న సమయంలో ఆనాడు A I Rతో ఏ సంబంధం లేని నేను ఆంధ్ర విశ్వవిద్యాలయ ఏం. ఏ విద్యార్థిగా మదరాసు కేంద్ర ప్రారంభ సమయంలో కేవలం ప్రేక్షకుడుగా వుండటం ఈనాటికీ ఆశ్చర్యం కలిగిస్తుంది.

మదరాసు రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రివర్గంలో యువకుడు వర్ధిష్ణువు అయిన డా. బెజవాడ గోపాలరెడ్డిగారికి మే 8వతేదీ 1938న గురుదేవులుఠాగూరు జన్మదినాన తన వివాహం జరగాలనే కోరికపై ముహూర్తం పెట్టారు. నవ్యసాహిత్య పరిషత్ కవులను ఆ పెళ్ళికి ఆహ్వానించారు. పచ్చయప్ప కళాశాల విడిది. శివశంకరశాస్త్రి. కృష్ణశాస్త్రి వంటి కవులతో వారి శిష్యప్రాయుడుగా నేనూ ఒక కవిగా వెళ్ళాను.

జూన్ 1 వ తేదీన ప్రారంభింపవలసిన మదరాసు కేంద్రంలో మొదటి నాటకం ఆ డాబా మీద గుండ్రని దిండ్లని, హుక్కా గొట్టాలని (మొగల్ వాతావరణం కోసం) పెట్టుకొని కృష్ణశాస్త్రి సలీంగా, అయ్యగారి వీరభద్రరావు అక్బరుగా, వడ్డాది రామచంద్రమూర్తి అబుల్ ఫజుల్‌గా, S.N. మూర్తి ఫైజీగా నటిస్తు

స్నారు. ఆచంట జానకిరాం వలగురి నాటకాలు ఏర్చి కూర్చిన అనార్కలి నాటకం రేడియో స్క్రిప్టురిహార్సల్సు జరుగుతున్నాయి. కృష్ణశాస్త్రి మేనకోడళ్లు ఏ కారణం చేతనో రాకపోవడంవల్ల అనార్కలి నాటకం కోసం ఆయన వ్రాసిన పాటలు నాకు వచ్చి వుండటంతో పన్యాలరంగనాధరావు భార్య సరస్వతికి, లీలకు నేర్పాను. వసుమర్తి విశ్వేశ్వరమ్మ అనార్కలి తనకంటె చదవడానికి తన చెల్లెలు భానుమతి యోగ్యంగా వుంటుందంటే ఆమెను తీసుకొచ్చారు.

ఈ నాటకం నేను యూనివర్శిటీ కెళ్ళి జూన్ 1న హాస్టల్‌లో విన్నాను. ఇది రేడియోలో చేరడానికి రెండేళ్ళ ముందు, తర్వాత జ్ఞాపకానికి తెచ్చుకుంటే ఆశ్చర్యం వేస్తుంది.

అప్పుడు రేడియో తెలుగు త్రిమూర్తులు అనేవారు. ఆచంట జానకిరామ్, అయ్యగారి వీరభద్రరావు, సూరినారాయణ మూర్తి, ఇందులో ఆచంట మంచి కల్పనా శక్తి, క్రియాశీలత కలిగి బ్రహ్మ కింద పోల్చేవారు. పరిపాలనా దక్షుడైన మూర్తిగారు విష్ణువు. విమర్శ విహార పట్టభద్రుడైన వీరభద్రుడు శివుడు. నాకు ఈ ముగ్గురు దగ్గర పనిచేయడం విశేషం. ఒక్కొక్కరి ప్లానింగు ఒక్కోరకం. వాళ్ళ మనసులెరిగి పనిచేయడం నా విజయానికి దోవ తీసేది. వీళ్లు క్రమంగా మదరాసు కేంద్రం వదలి ఇతర కేంద్రాలకు ప్రమోషన్, బదలీల మీద వెళ్ళేవారు, వచ్చేవారు.

1948 డిసెంబరు 1న విజయవాడ కేంద్రానికి N.S. రామచంద్రన్, అయ్యగారి వీరభద్రరావుల నేతృత్వంలో ప్రారంభం జరిగింది. బాలగురుమూర్తి, యండమూరి సత్యనారాయణ సీనియర్ PEXలు. అప్పుడు సాయంత్రం 5-30గం॥కు ప్రసారం మొదలయ్యేది. ఒకవారం నా సహచర మిత్రులు నేను P. భానుమతి కలిసి పాడిన తెలుగుతల్లి పాటతో ప్రసారాలు ప్రసారం చేసేవారు. ఇది నేను ప్రత్యేకంగా యూనివరిటీలో కట్టమంచి రామలింగారెడ్డి కోరికపై వ్రాసిన పాట, 'పసిడిమెరుంగుల తళతళలు' అని పాట మొదలు.

అక్కడా ఇక్కడా కూడా ప్రథమశ్రేణి కవులు, సాహిత్య పరులు సర్వశ్రీ కృష్ణశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, కందుకూరి రామభద్రరావు, బందా కనకలింగేశ్వర రావు, తర్వాత హైదరాబాద్‌లో స్థానం నరసింహారావు. మునిమాణిక్యం, నాయని సుబ్బారావు, గోపీచంద్ సన్నిహితులుగా వుండేవారు.

ఇక ఈ పుస్తకం విషయాని కొద్దాం.

ప్రసార ప్రముఖులను గూర్చి తలపెట్టిన ఈ రచన మా మిత్రులు డా. ఆర్. అనంత పద్మనాభరావు మదరాసు, విజయవాడ, హైదరాబాదు కేంద్రాలు మాత్రమే గాక తదితర కేంద్రాలు, ఢిల్లీలోని వార్తా విభాగము, డైరక్టర్ జనరల్ కార్యాలయము, మిగిలిన కేంద్రాల ప్రముఖుల విశేషాలను అన్నిటినీ కొంత పరిశోధించి శ్రమపడి సేకరించి తయారుచేసిన ప్రణాళిక నాకెంతో మెచ్చుకోదగిందిగా కనిపిస్తోంది. లబ్ధ ప్రతిష్ఠు లెందరో చేరారిందులో. ఇప్పుడు సూచించిన కేంద్రాలతోను ఆయా విభాగాలలోను పనిచేసిన స్వానుభవపూర్వకమైన గ్రంథ రచయిత విషయానికి చక్కగా న్యాయం చేకూర్చారని మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను.

-డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు

మాజీ స్టేషన్ డైరక్టర్

# విషయసూచిక

# ధన్య జీవులు





వణుకూరు వాస్తవ్యులు భిషజ్మార్తాండ, వైద్యవిద్వాన్ అగదంకారాచార్య.

## డాక్టర్ దీవి శ్రీనివాసాచార్యులు,

ధర్మపత్ని

## శ్రీమతి అలమేలు మంగతాయారు

గార్ల స్మృత్యర్థం వారి కుమారులు గ్రంథప్రచురణ మొనర్చిరి.

# ప్రసార ప్రముఖులు

ఆకాశవాణి ప్రసారాలు ప్రారంభమై దాదాపు ఏడు దశాబ్దాలు కావస్తోంది. 27 జులై 23న అప్పటి బ్రిటీష్ వైస్రాయి లార్డ్ ఇర్విన్ తొలి ప్రసార ంద్రాన్ని ప్రారంభించడంతో ప్రసారా లారంభమయ్యాయి. ఆకాశవాణిగా 1936లో మకరణం చేశారు. గత ఆరు దశాబ్దాలుగా ఎందరో ప్రముఖులు ఆ యా కేంద్రా ో పేరు గడించారు. వారిని గూర్చి తెలియజేయడానికి చేస్తున్న చిరుప్రయత్న ది. ఇది సమగ్రం కాదని తెలుసు. అయినా ఆరంభం ఎక్కడో ఒకచోట ంగాలి. అందుకు నాంది పలుకుతున్నాను.

1938 జూన్ 1వ ఆకాశవాణి మదరాసు కేంద్రం రూపుదిద్దుకొంది. అప్పట్లో లుగుప్రసారాలు అక్కడనుండి జరిగేవి. తెలుగు అధికారులు అక్కడ చేరారు. ొలి తెలుగు అనౌన్సరు మల్లంపల్లి ఉమామహేశ్వరరావు. ఆయన సుప్రసిద్ధ చారి ిక పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖర శర్మ సోదరులు. మదరాసు కేంద్రం ప్పట్లో సాహితీ త్రివేణీ సంగమం. ఆంధ్ర తమిళ కర్ణాటక రాష్ట్రాలకు చెందిన పముఖులు మదరాసు కేంద్ర ప్రసారాలను తీర్చిదిద్దేవారు. అప్పట్లో 'LIVE' ప్రసారాలు యధాతధంగా జరిగేవి. తర్వాత తర్వాత టేప్‌రికార్డింగు సౌకర్యం చ్చింది. దానికి ముందు గ్రామఫోన్ రికార్డులు కట్ చేసేవారు. అది ఎంతో ామతో వ్యయప్రయాసలతో కూడిన పని.

దిగ్గంతులవంటి వ్యక్తులు ఆనాడు మదరాసు కేంద్రంలో కార్యక్రమ నిర్వ హకులు. సర్వశ్రీ యస్. యన్. మూర్తి, డా. అయ్యగారి వీరభద్రరావు, ఆచంట జానకిరామ్ డా. బాలాంత్రపు రజనీకాంతరావు, బుచ్చిబాబు, శ్రీవాత్సవ ఆనాటికార్య క్రమ నిర్వాహకులు. ప్రముఖకవి జాషువా కొంతకాలం మదరాసు కేంద్రంలో పని చేశారు. గత యాభై సంవత్సరాల కాలంలో ఎందరో ఆంధ్ర ప్రముఖులు అక్కడ పనిచేశారు. సర్వశ్రీ గొల్లపూడి మారుతిరావు, యస్. శంకరనారాయణ (బాపుసోద రులు), యస్. వేణుగోపాలరెడ్డి, శ్రీమతి దుర్గాభాస్కర్, వి. చంద్రమౌళి ఈ కేంద్ర కార్యక్రమాల నిర్వహణలో పేరు గడించారు.

# ప్రసార మంత్రిత్వశాఖ

సమాచార ప్రసార మంత్రిత్వ శాఖలో ఎందరో ప్రముఖులు నేతృత్వం నిర్వహించారు. మొట్టమొదటిగా పేర్కొనదగిన శాఖ ప్రాంశులైన వ్యక్తి డా. బెజవాడ గోపాలరెడ్డి. రవీంద్ర కవీంద్రుని అంతేవాసిగా, శాంతినికేతన్ సాహచర్యంతో ఎదిగిన వ్యక్తి గోపాలరెడ్డి. బహుభాషా పరిచయం వారి ప్రత్యేకత. రాజకీయభీష్ములుగ స్వాతంత్ర్యోద్యమ సమరంలో పనిచేసిన గోపాలరెడ్డి అతి చిన్న వయసులో అవిభక్త మదరాసు రాష్ట్రంలో మంత్రి అయ్యారు.

## డా. బెజవాడ గోపాలరెడ్డి

జవహర్‌లాల్ నెహ్రూ మంత్రి వర్గంలో 1962-64 మధ్య కాలంలో సమాచార ప్రసారమంత్రిగా వ్యవహరించారు. విశాఖపట్టణ కేంద్రం (ఆగస్టు 4, 1963), కడపకేంద్రం (1963 జూన్ 17న) ప్రారంభోత్సవాలు వారి చేతిమీదుగా జరిగాయి. కామరాజ్ ప్లాన్‌క్రింద గోపాలరెడ్డి 64లో మంత్రివర్గంనుండి రాజీనామా చేశారు. గోపాలరెడ్డి సాహితీవేత్త.

సాహితీ రాజకీయ రంగాలలో తనదైన విశిష్ట స్థానాన్ని నిలుపుకొని 90 సంవత్సరాలు నిండు జీవితాన్ని పరిపూర్ణారోగ్యంతో గడిపిన పూర్ణపురుషుడు బెజవాడ గోపాలరెడ్డి ఈ శతాబ్ది ప్రథమంలో జన్మించి చివరివరకు జరిగిన పరిణామాలు అన్నిటినీ దర్శించిన భవ్యపురుషుడు.

1907 ఆగస్టు 5న నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెంలో గోపాలరెడ్డి జన్మించారు. ప్రాథమిక విద్యాభ్యాసానంతరం బందరు జాతీయకళాశాలలో చేరారు, అక్కడనుండి శాంతినికేతన్‌లో 1924-27 సం॥లలో రవీంద్ర కవీంద్రుని అంతేవాసి అయ్యారు. ఒక వైపు జాతీయోద్యమం, మరోవైపు సాహిత్యపిపాస గోపాలరెడ్డి జీవనంలో పెనవేసుకొన్నాయి.

జాతీయోద్యమంలో పాల్గొని చెరసాలల్లో సంవత్సరాల తరబడి గడిపారు. ముప్పయి సంవత్సరాలు నిండకముందే రాజాజీ మంత్రివర్గంలో అవిభక్త మదరాసు రాష్ట్రంలో మంత్రి అయ్యారు. అప్పటికింకా ఆయన అవివాహితుడు. తిక్కవరపు రామిరెడ్డిగారి కుమార్తె లక్ష్మీకాంతమ్మను మంత్రిగా వివాహమాడారు. కర్నూలులో ఆంధ్రరాష్ట్రం ఏర్పడినపుడు 1955లో ముఖ్యమంత్రి అయ్యారు. 1956లో విశాలాంధ్ర ఏర్పడినపుడు హైదరాబాదు రాజధానిగా ఉపముఖ్యమంత్రి అయ్యారు. ఆ తర్వాత జవహర్‌లాల్‌నెహ్రూ కేంద్రంలో మంత్రిగా గోపాల

రెడ్డిని ఆహ్వానించి రెవిన్యూ మంత్రిని చేశారు. అనంతరం సమాచార ప్రసార మంత్రిత్వ శాఖను అప్పగించారు. ఐదేళ్ళపాటు ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా వ్యవహరించారు. 186 నెలలు వివిధ రాజకీయ పదవులు నిర్వహించారు.

సాహితీ రంగంలోను ఆయన సవ్యసాచి. 1946 నుండి తెలుగుభాషా సమితి అధ్యక్షులుగా వ్యవహరించారు. 1957 నుండి 82 వరకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అధ్యక్షులుగా 25 సం॥లు పనిచేశారు. 1978 నుండి కేంద్ర సాహిత్య అకాడమీ కార్యనిర్వాహక సభ్యులు. 1963 నుండి ఎనిమిదేళ్ళు జ్ఞానపీఠ అధ్యక్షులు. ఆయనకు పరిచితులుకాని సాహితీకారులులేరు. అనేక భాషలతో సన్నిహిత పరిచయం గల గోపాలరెడ్డి రవీంద్రుని గ్రంథాలను తెలుగులోకి అనువదించారు. తొలుత అనువాదాలతో ప్రారంభమై డెబ్బయివ ఏట స్వతంత్ర రచనలు మొదలుపెట్టారు, 1978లో తొలి స్వీయ కవితాసంపుటి వెలువరించారు. ఆమె, ఆమె జాడలు, ఆమె నీడలు, ఆమె తళుకులు, ఆమె చెళుకులు- ఇలా ఆమె పంచకం' వెలువడింది.

కవితారంగంలో తనకంటూ ఒక ప్రత్యేకతను నిలుపుకున్న డా. గోపాలరెడ్డి వార్థక్యాన్ని సాహితీ సుగంధాలతో నింపుకుని శేష జీవితాన్ని నెల్లూరులో గడుపుతున్నారు.

పర్వతనేని ఉపేంద్ర జనతా ప్రభుత్వంలో V. P. సింగ్ ప్రధానమంత్రిగా ఉండగా కేంద్ర సమాచార ప్రసార మంత్రిగా 1988లో బాధ్యతలు స్వీకరించారు. ఉపేంద్ర ఎం.ఏ. పట్టభద్రులై రైల్వే మంత్రిత్వ శాఖలో పబ్లిక్ రిలేషన్స్ విభాగంలో పనిచేశారు. కొంతకాలం మధు దండావతే రైల్వే మంత్రిగా పని చేస్తున్న కాలంలో వారి ప్రైవేట్ సెక్రటరీగా పనిచేశారు. తెలుగుదేశం పార్టీ 1983 లో ఏర్పడినపుడు దాని రూపురేఖలు తీర్చిదిద్దడంలో N. T. రామారావుకు తోడ్పడ్డారు. 1984లో రాజ్యసభ సభ్యులుగా ఎన్నికయ్యారు. ఉపేంద్ర మంత్రిగా ఉన్న కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో దూరదర్శన్ విస్తరణ బాగా జరిగింది. విజయవాడ దూరదర్శన్ కేంద్రం P.G.F. స్టూడియోల నిర్మాణానికి ఆయన శంఖుస్థాపన చేశారు. విజయవాడ నుండి 1996లో లోకసభకు ఎన్నికయ్యారు.

మల్లికార్జున్ కేంద్ర సమాచార ప్రసారాల శాఖ డిప్యూటీ మంత్రిగా వ్యవహరించారు. ఇందిరాగాంధీ ప్రధాన మంత్రిత్వంలో ఆయన కొంతకాలం 1983-84

మధ్య సమాచార శాఖను నిర్వహించారు. తెలంగాణా ఉద్యమ కాలంలో విద్యార్థి నాయకుడుగా, చెన్నారెడ్డి అనుచరుడుగా మల్లికార్జున్ రాజకీయాలలో పాల్గొన్నారు, తెలంగాణా పోరాట సమితి పక్షాన లోక్‌సభకు ఎన్నికయ్యారు. రక్షణశాఖ స్టేట్ మంత్రిగా పనిచేశారు. పార్లమెంటరీ వ్యవహారాలతో పాటు అనేక శాఖలు సమర్థవంతంగా నిర్వహించారు. మహబూబ్‌నగర్ నియోజక వర్గంనుండి వరుసగా లోక్‌సభకు ఎన్నికవుతూ 1996లో కూడా విజయం సాధించారు.

నెహ్రూగారి మంత్రిత్వంలో శ్రీ C R. పట్టాభిరామన్ సహాయమంత్రిగా ప్రసార మంత్రిత్వ శాఖను పటేల్‌గారి నాయకత్వంలో నిర్వహించారు. వీరు మేము తెలుగువారమని చెప్పుకొనేవారు. పట్టాభిరామన్ తిరువాన్కూర్ దివాన్‌గా పని చేసిన సర్ సి.పి. రామస్వామి అయ్యర్ కుమారులు.

ప్రసార మంత్రిత్వ శాఖలో ఉన్నతాధికారులు ఎందరో పదవీ బాధ్యతలు నిర్వహించారు. వారిలో ప్రధానులు శ్రీ ఏ. యు. శర్మ, శ్రీ కె. యస్. శర్మ, I A.S.కు చెందిన వీరిద్దరు Joint Secretary (Broadcasting)లుగా వ్యవహరించారు. ఏ. ఉమాకాంతశర్మ బీహారు క్యాడర్‌కు చెందిన సీనియర్ I.A.S. అధికారి. జనతా ప్రభుత్వ హయాంలో వీరు జాయింట్ సెక్రటరీగా ఒక సంవత్సరం పని చేశారు. ఢిల్లీలో డిప్యుటేషన్ పూర్తికాగానే పాట్నాకు బదలీ అయి బీహార్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా నియమితులయ్యారు. పదవీ విరమణానంతరం హైదరాబాదులో విశ్రాంత జీవితం గడుపుతున్నారు. శర్మగారికి సోషలిష్టు భావాలున్నాయి. వీరిది కడపజిల్లా నందలూరు స్వగ్రామం.

శ్రీ కె. సుబ్రహ్మణ్యశర్మ ఆంధ్రా క్యాడర్‌కు చెందిన 1968 బ్యాచ్ I A.S. అధికారి. M Sc. పట్టభద్రులైన శర్మ అనంతపురం, కరీంనగర్ జిల్లాల కలెక్టర్‌గా పనిచేశారు. ఢిల్లీలో నవోదయా విద్యా సంస్థల డైరక్టర్‌గా సమర్థవంతంగా పనిచేశారు. లండన్‌లో ఒక సంవత్సరకాలం శిక్షణ పూర్తి చేసుకొని వచ్చిన శర్మగారు 1996లో ప్రసార మంత్రిత్వశాఖ జాయింట్ సెక్రటరీ (Broad Casting)గా నియమితులయ్యారు. వీరిని పి.వి. ప్రభుత్వం 1996 లో దూరదర్శన్ డైరక్టర్ జనరల్‌గా నియమించింది. శర్మగారు గుంటూరు జిల్లా తెనాలి వాస్తవ్యులు. 1944 జూలైలో జన్మించారు. 1968 జూలైలో I.A.S.లో చేరారు. కొంతకాలం ఆంధ్రరాష్ట్ర ఆర్థికశాఖ కార్యదర్శిగా వ్యవహరించారు.

K.V.S. రావు, N.H.K. మూర్తి, D.J. Rao, D.S. దీక్షితులు, V.A. శాస్త్రి, G.N.L N. రావు వంటి అధికారులు మంత్రిత్వశాఖలో సీనియర్ పదవులు నిర్వహించారు. దీక్షితులు, V.A. శాస్త్రి ప్రసార మంత్రిత్వశాఖ కార్యదర్శి వ్యక్తిగత కార్యదర్శులుగా పనిచేశారు. G V L N. రావు ఆకాశవాణి డైరక్టర్ జనరల్ వ్యక్తిగత కార్యదర్శిగా రెండేళ్ళు పనిచేశారు. N H.K. మూర్తి హృద్రోగంతో హఠాత్తుగా మరణించారు. K.V.S. రావు ఆకాశవాణి డైరక్టరేట్ జనరల్ విజిలెన్స్ సెక్షన్ ఆఫీసర్‌గా వ్యవహరించారు. D J. రావు దూరదర్శన్, ఆకాశవాణిలలో పనిచేసి Ministry of Personnel లో డిప్యూటీ సెక్రటరీగా వెళ్ళారు.

## డైరక్టరేట్ జనరల్

ఆకాశవాణి డైరక్టరేట్ జనరల్ కార్యాలయం క్రొత్త ఢిల్లీలోని పార్లమెంటు వీధిలోని ఆకాశవాణి భవనంలో వుంది. ఈ కార్యాలయంలో ఎందరో ఆంధ్ర ప్రముఖులు పనిచేశారు. ఆకాశవాణి మాన్యువల్ రూపొందించిన ఘనత ఆంధ్రులకే దక్కింది. అకౌంటెంట్ జనరల్‌గా పనిచేసి డెప్యుటేషన్‌మీద ఆకాశవాణి డిప్యూటీ డైరక్టర్ జనరల్ (అడ్మినిస్ట్రేషన్)గా పనిచేసిన P. V. రాఘవరావు ప్రాతఃస్మరణీయులు. వీరు 1956 లో మనుస్మృతి వంటి మాన్యువల్ తయారుచేశారు. 1989 వరకు దానినే అనుసరించారు. 89లో మాన్యువల్‌కు క్రొత్త రూపం యిచ్చారు. రాఘవరావుగారు పదవీ విరమణానంతరం హైదరాబాదులో 1992లో పరమపదించారు. వీరి కుమారులు రాష్ట్రప్రభుత్వ కార్యదర్శిగా పనిచేస్తున్న P.V. రావ్.

మరొక ఉన్నతస్థానం అలంకరించిన వ్యక్తి భమిడిపాటి కుక్కుటేశ్వరరావు. వీరు I.A S.లో పనిచేస్తూ డెప్యుటేషన్‌మీద D.D.G. (అడ్మినిస్ట్రేషన్‌గా) ఆకాశవాణిలో ఢిల్లీలో పనిచేశారు. వీరు కేంద్రగనుల శాఖ కార్యదర్శిగా 1990 జూన్‌తో పదవీ విరమణ చేసి ప్రస్తుతం హైదరాబాదులో స్థిరపడ్డారు. బి.కె. రావుగా ప్రసిద్ధులైన వీరు జియాలజీలో M Sc. పట్టభద్రులు, సాహితీప్రియులు. రాష్ట్ర ప్రభుత్వంలో వివిధ సీనియర్ పదవులు అధిష్ఠించారు. చిత్తూరు కలెక్టరుగా వ్యవహరించారు.

ఇటీవలి కాలంలో D.D.G. సెక్యూరిటీగా వి. పురుషోత్తమరావు పని చేస్తున్నారు. వీరు డెప్యుటేషన్‌పై వచ్చారు. స్వతహాగా పోలీసు (C.R.P.F ) శాఖకు చెందినవారు. (1992-96) మధ్యకాలంలో వీరు ఢిల్లీలో పనిచేశారు. వీరి సతీమణి

వెదురుమూడి రాజేశ్వరి ఢిల్లీ కేంద్రం తెలుగు వార్తా విభాగంలో న్యూస్ రీడర్‌గా 1996లో చేరారు.

పుల్లెల వెంకటేశ్వర్లు డిప్యూటీ డైరక్టర్ జనరల్ (ప్రోగ్రాం)గా ఢిల్లీలో 1980-82 సం॥లలో వ్యవహరించారు. ఆ స్థాయికి ఎదిగిన స్టేషన్ డైరక్టర్లలో వెంకటేశ్వర్లుగారు అగ్రగణ్యులు. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా ఆకాశవాణిలో చేరిన కెప్టెన్ పుల్లెల విజయవాడ, హైదరాబాదు, పోర్ట్ బ్లెయిరు తదితర కేంద్రాలలో పని చేశారు. హైదరాబాదు కేంద్ర డైరక్టర్‌గా 1975 అక్టోబరు నుండి 78 జూన్‌వరకు పని చేశారు. అధికారిగా మంచిపేరు సంపాదించారు. డైరక్టర్ ఆఫ్ ప్రోగ్రాం (పాలసీ)గా చక్కటి పేరు గడించారు. పదవీ విరమణానంతరం పుల్లెల హైదరాబాదులో స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. ఆర్మీలో పనిచేసి రిటైరైన పుల్లెల విజయవాడలో ప్రథమంగా చేరారు. 1966 లో అసిస్టెంట్ డైరక్టర్‌గా డైరక్టరేట్‌కు బదలీ అయ్యారు.

సూరి నారాయణమూర్తి DDG ప్రోగ్రాంగా పనిచేసిన వారిలో సమర్థులు. వీరు ప్రోగ్రాం అసిస్టెంట్‌గా చేరి డిడిజి హోదాకు ఎదిగారు. 1971 ఆగస్టులో పదవీ విరమణ చేసి విజయవాడలో విశ్రాంత జీవనం గడుపుతూ 1981 జనవరిలో పరమపదించారు. మదరాసులో చేరి అహమ్మదాబాదు, పూనే, బొంబాయి, ఢిల్లీ కేంద్రాంలో డైరక్టరుగా పనిచేశారు.

ఇంజనీరింగు విభాగంలో కూడా ఎందరో చీఫ్ యింజనీర్ల స్థాయికి ఎదిగి డైరక్టరేట్‌లో పనిచేశారు. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో పని చేసిన ప్రముఖ చీఫ్ యింజనీర్లలో విశ్వనాథ సత్యనారాయణ గారి కుమారులు విశ్వనాథ అచ్యుత దేవరాయలు, R S, శాస్త్రి, M.L. శాస్త్రి, N.వెంకటేశ్వర్లు, వి.వి రావ్, టి.యస్.జి దాస్ (కలకత్తా) చెప్పుకోదగినవారు. ప్రాంతీయ కార్యాలయం మదరాసులో చీఫ్ యింజనీర్లుగా M I. సూర్యనారాయణ, ఆర్ శేషయ్య వ్యవహరించారు. వీరిద్దరి హయాంలో చాలామంది తెలుగు యువకులు ఇంజనీరింగ్ అసిస్టెంట్లుగా సెలక్టు కాబడి యిప్పుడు అసిస్టెంట్ ఇంజనీర్ల హోదాకు ఎదిగారు.

డైరక్టర్లుగా డైరక్టరేట్‌లో భిన్నకాలాలలో ఎందరో పనిచేశారు. సర్వశ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, పుల్లెల వెంకటేశ్వర్లు, గుంటూరు రఘురాం యిలా ఎందరో. రఘురాం జలంధర్‌లో స్టేషన్ డైరక్టరుగా పనిచేసి డైరక్టరేట్‌లో డైర

క్టర్ ఆఫ్ ప్రోగ్రాం (పెరసనల్‌గా) పనిచేశారు. ఉద్యోగుల సర్వీసులకు సంబంధి చిన ఈ శాఖను సర్వసమర్థంగా నిర్వహించారు వీరు 1993 ఫిబ్రవరిలో పదవీ విరమణ చేసి హైదరాబాదులో స్థిరపడ్డారు. ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరి విజయవాడ, హైదరాబాదు, గుల్బర్గా కేంద్రాలలో వివిధ హోదాలలో పనిచేశారు. హిందీలో చక్కటి ప్రవేశమున్న రఘురాం 14.2.35 న అనంతపురం జిల్లాలో జన్మించారు. సున్నిత హృదయులైన రఘురాం చక్కటి కార్యక్రమాల రూపకల్పన శిల్పి. 1981 లో స్టేషన్ డైరక్టర్‌గా పదోన్నతి పొందారు.

డైరక్టరేట్‌లో మంచి వ్యక్తిగా పేరు తెచ్చుకున్న మరో ప్రముఖులు B R చలపతిరావు. ఆకాశవాణిలో చేరడానికి ముందు కేంద్రప్రభుత్వంలో పని చేసిన చలపతిరావు ఆడియన్స్ రిసెర్చి ఆఫీసర్‌గా 1-4 69న చేరారు. 1985 డిసెంబరులో UPSC ద్వారా స్టేషన్ డైరక్టర్‌గా సెలక్ట్ అయి మంగుళూరు కేంద్ర డైరక్టరుగా చేరారు. 1987 ఏప్రిల్‌లో డైరక్టరేట్‌లో వాణిజ్య విభాగం డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు చేపట్టారు ఆ పదవిలో దాదాపు 8 సం॥లు జయప్రదంగా పనిచేసి 1994 జనవరిలో పదవీ విరమణ చేశారు. రచయితగా, వక్తగా, అధికారిగా చలపతి రావు సమర్థులు. చలపతిరావు విశాఖపట్టణంలో 12-12-36 న జన్మించారు. చలపతి రావు ఢిల్లీలో స్థిరపడ్డారు. 1994 నుండి 96 వరకు సలహాదారుగా వ్యవహరించారు.

డా. ప్రపంచం సీతారం ప్రముఖ వేణుగానలోలురు. చిన్నతనంలోనే సంగీత రసజ్ఞులనలరించారు. సీతారాం విజయవాడలో 21-9.42 లో జన్మించారు. ఆకాశ వాణిలో 1980లో చేరడానికి ముందు ఢిల్లీలోని అశోకా హోటల్లో వేణుగాన విద్వాం సులుగా పనిచేశారు. UPSC ద్వారా 1976లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా సెలక్ట్ అయి మదరాసులో పనిచేశారు. అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా 11.2.85 నుండి విజయవాడలో పనిచేశారు. డైరక్టరేట్‌లో సంగీత విభాగం చీఫ్ ప్రొడ్యూసర్‌గా నాలుగేళ్లపనిచేశారు. 1993లో స్వచ్ఛంద పదవీవిరమణానంతరం తిరుపతిలోని పద్మా వతీ మహిళా విశ్వవిద్యాలయంలో సంగీతం ప్రొఫెసర్‌గా చేరారు సంగీతంలో సీతారాం డాక్టరేట్ పొందారు. విద్వాంసులుగా సీతారాం లబ్ధ ప్రతిష్ఠులు.

డైరక్టరేట్‌లో సంగీత విభాగంలో చీఫ్ ప్రొడ్యూసర్‌గా పనిచేసిన మరో ప్రముఖులు ఈమని శంకరశాస్త్రి వైణికులుగా లబ్ధ ప్రతిష్ఠులైన శంకరశాస్త్రి ఢిల్లీలో సముచిత గౌరవాన్ని పొందారు.

మరో ప్రముఖ వ్యక్తి డా॥ ఆరెకపూడి రమేష్ చౌదరి. ఆయన హిందీ విభాగం డిప్యూటీ చీఫ్ ప్రొడ్యూసర్‌గా (ప్రవచన శాఖ) ఢిల్లీలో పని చేశారు. చివరి రోజుల్లో మద్రాసు కేంద్రంలో పనిచేసి పదవీ విరమణ చేశారు.

విదేశీ ప్రసార విభాగంలో చాలాకాలం పనిచేసి పదవీ విరమణ చేసిన కుమారి ఉషారావు మొసలికంటి తిరుమలరావు గారి పుత్రిక. ఆమె E S Dలో సబ్ ఎడిటర్‌గా పనిచేసి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా రిటైరయ్యారు.

P. R. రెడ్డి, శంకరమంచి సత్యం డిప్యూటీ డైరక్టర్లుగా (1988-90) E.S D. లో పనిచేశారు. E.S D.లో (విదేశీ ప్రసార విభాగం) పనిచేసిన మరో ప్రముఖుడు R.C. రాజశేఖర్, రాయప్రోలు సుబ్బారావు (ప్రముఖ కవి) కుమారులు. వివిధ హోదాలలో బెంగుళూరు తదితర కేంద్రాలలో పనిచేశారు. E S.D.లో డిప్యూటీ డైరక్టర్‌గా పనిచేసి డైరక్టరేట్‌లో వ్యవసాయ కార్యక్రమాల జాయింట్ డైరక్టర్‌గా పనిచేశారు. రాజశేఖర్ ఢిల్లీలో హఠాన్మరణం చెందారు. ఆకాశవాణిలో తొలినాళ్ళలో చేరి సమున్నత స్థానాన్ని పొందిన వ్యక్తులలో ఆయన ఒకరు. ఆయన బెంగుళూరు కేంద్ర డైరక్టరుగా పనిచేశారు.

డా. ఆర్. అనంత పద్మనాభరావు ప్రవచన శాఖ డైరక్టర్ ఆఫ్ ప్రొగ్రాంగా 1988 వ సంవత్సరంలో డైరక్టరేట్‌లో పనిచేశారు. డైరక్టరేట్ అనుబంధ సంస్థ అయిన శిక్షణా సంస్థలో 1987 90 మధ్యకాలంలో డిప్యూటీ డైరక్టర్‌గా వ్యవహరించారు.

శ్రీమతి వాణీజయరాం డైరక్టరేట్‌లో సంగీత విభాగం ప్రొడ్యూసర్‌గా పని చేశారు. వీరు ప్రసిద్ధ సంఘ సేవకురాలు మోహినీగిరి గారి తల్లి. వీరివలె ప్రస్తుతం శ్రీమతి G. వైదేహి సంగీత విభాగం ప్రొడ్యూసర్‌గా పనిచేస్తున్నారు.

ఈమని శంకరశాస్త్రి :

శంకరశాస్త్రి పేరు వినగానే వీణాతంత్రులు మీటుతూ గంధర్వరాగాలను సంగీత రసజ్ఞుల కందించిన ఒక విరాట్‌మూర్తి మన కళ్ళ ఎదుట ప్రత్యక్షమవుతారు. ఆయన ప్రపంచ ప్రఖ్యాతి వహించిన వైణికులు. 1923 ప్రాంతాలలో తూర్పుగోదావరి జిల్లా ద్రాక్షారామంలో ఒక విద్వత్ కుటుంబంలో శంకరశాస్త్రి జన్మించారు. తండ్రి అచ్యుతరామశాస్త్రి సుప్రసిద్ధ వైణికులు.

శంకరశాస్త్రి కాకినాడ మహారాజా కళాశాలలో పట్టా పొందారు. చిన్నతనం లోనే వీణావాదనలో ప్రావీణ్యంసంపాదించారు. 15వ ఏట ఆయన కాకినాడ సరస్వతీ గానసభలో తొలి కచేరి చేసి పండితుల ప్రశంసలందుకొన్నారు. ఆనాటినుండి ఆయన దినదిన ప్రవర్థమానవుతూ సంగీతవేత్తల ప్రశంసలను యావత్ భారతంలో అందుకొన్నారు.

ఆయన కొంతకాలం సినీరంగంలో పనిచేశారు. 1940 ప్రాంతంలో సంగీత దర్శకుడుగా చేరారు. తెలుగు తమిళ, హిందీ చిత్రాలకు సంగీతాన్ని సమకూర్చి తమ ప్రతిభను చాటుకొన్నారు.

ఆకాశవాణిలో శంకరశాస్త్రి 1959లో సంగీత విభాగం ప్రొడ్యూసర్ గా మదరాసు కేంద్రంలో చేరారు. హిందూస్తానీ పాశ్చాత్య సంగీతంలో ప్రవేశం సంపాదించి వాటి చక్కటి మేళవింపుతో తనదైన వినూత్న శైలిని ఏర్పరచుకొన్నారు. ఆకాశవాణి వాద్యబృంద నిర్దేశకులుగా ఆయన ఎన్నో ప్రయోగాలు చేశారు. ఆదర్శ శిఖరారోహణం, భ్రమరగీతం వంటి సంగీత రూపకాలు రూపొందించి శ్రోతల ప్రశంసలందుకొన్నారు. వీణపై వేదమంత్రాలు అలవోకగా పలికించి రసజ్ఞులమన్న అందారు. "ఆసియన్ రోస్ట్రం అవార్డు" అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చిపెట్టింది. భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదంతో సత్కరించింది. ఆకాశవాణిలో సంగీత విభాగం చీఫ్ ప్రొడ్యుసర్ గా ఆయన రిటైరయ్యారు. కేవలం వీణావాదన మాత్రమేగాక వీణకచేరీతోపాటు సోదాహరణ ప్రసంగాలు చేసి వివిధ ప్రాంతాలలో బహుళ జనామోదం పొందారు. గమకములు, అనుస్వరాలు లోకానికి విశదపరచిన మేధావి శంకరశాస్త్రి. ఆయనది గాత్రధర్మశైలి. వీణపై ఒక స్త్రీ కంఠ స్వరాన్ని పలికించి శ్రోతల్ని పులకింప జేసేవారు. రాగ హృదయాన్ని ఆవిష్కరింపజేయగల ప్రతిభాశాలి. గుంటూరు వెంకటేశ్వర విజ్ఞాన కేంద్రంలో ఆయనకు కనకాభిషేకం 1987లో జరిగింది. శంకరాభరణ రాగాలాపన ఆయన ప్రత్యేకత.

సుప్రసిద్ధ వైణికులు చిట్టిబాబు, శంకరశాస్త్రి శిష్యులు. యాహూదీ మొయిన్ హీన్ వంటి విదేశీ సంగీత ప్రముఖుల ప్రశంసలందుకొన్నారు. Prix Itatia International అవార్డు ఆయన పొందారు.

గుంటూరులో కనకాభిషేకం అంది ఆ రాత్రి రైలులో ప్రయాణం చేస్తూ 1987 డిసెంబరు 8న నిద్రలోనే సునాయాస మరణాన్ని పొందారు.

... ఆకాశవాణికి ఆయన ఎనలేని సేవచేశారు. కర్ణాట సంగీత విభాగం చీఫ్ ప్రొడ్యూసర్‌గా ఢిల్లీలోని డైరక్టర్ జనరల్ కార్యాయంలో పనిచేసి 19... లో పదవీ విరమణ చేశారు. సంగీత లోకం ఆయనకు రుణపడి వుంది. వాగ్గేయ... డైరక్టర్ కామశాస్త్రి, M. S. శ్రీరాం వీరి సన్నిహిత బంధువులు

**డా॥ ఆరెకపూడి రమేష్‌చౌదరి :**

ఆంధ్రులు హిందీ సాహిత్యానికి ఎనలేని కృషి చేశారు. వారిలో ఆరెకపూ ప్రముఖులు. ఆయన హిందీ, ఆంగ్లభాషలలో సమ ప్రతిభ గలవారు. ఆకాశవాణిలో ఆయన డిప్యూటీ చీఫ్ ప్రొడ్యూసర్‌గా పనిచేశారు.

1922 సెప్టెంబరు ...న కృష్ణాజిల్లా ఉయ్యూరులో రమేష్ చౌదరి జన్మించారు పత్రికా రచయితగా ఆయన జీవితాన్ని ప్రారంభించారు. హిందూ, Free Press Journal, ఇండియన్ రిపబ్లిక్ పత్రికలలో ఆయన పనిచేశారు. హిందూస్తాన్ టైమ్స్, ఫోరమ్ పత్రి... కరస్పాండెంట్‌గా వ్యవహరించారు.

హిందీలో ... పాతిక చక్కటి నవలలు వ్రాశారు. తెలుగు మాతృభాష అయినా తలస్పర్శిగా హిందీ భాషాభిమానుల ప్రశంసలు అందుకొన్నారు. ఆయన నవలలకు ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ఏడు బహుమతులిచ్చింది. అది ఒక విశిష్ట గౌరవం 'సాక్‌గాంక్' నవల భారత ప్రభుత్వం బహుమతినందుకొంది. ఆయన రచనలు విశ్వవిద్యాలయాల పాఠ్యాంశాలుగా ఎంపిక చేయబడ్డాయి.

సాహసంసార్ మేరా, నిర్లజ్జ, ధన్యభక్ష, ఉధార్‌కే పంఖ్, అప్నేపరాయే, నదికాశోర్ వీరి నవలల్లో ప్రముఖాలు. వీరి నవల రష్యన్ భాషలోకి అనువదించబడటం మరో విశేషం. అడవి బాపిరాజు 'నారాయణరావు' నవలను వీరు హిందీలో అనువదించారు.

చందమామ, దక్షిణ భారత్ పత్రికలకు ఆయన కొంతకాలం సంపాదకులుగా వ్యవహరించారు. ఆయన స్వాతంత్ర సమరయోధులు కూడా. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని తామ్రపత్రం ప్రభుత్వం నుండి పొందారు. 1980లో ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కూడా గౌరవ ప్రొఫెసర్‌గా పనిచేశారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ... కళాప్రపూర్ణ బిరుదంతో సత్కరించింది.

రమేష్ చౌదరి ఆకాశవాణిలో హిందీ ప్రసంగశాఖ ప్రొడ్యూసర్‌గా చేరారు. ంతకాలానికి డిప్యూటీచీఫ్ ప్రొడ్యూసర్‌గా ప్రమోట్ అయి ఢిల్లీ బదలీ య్యారు. 1979లో ఆయన ఆపదవితోపాటు మదరాసు బదలీ అయ్యారు. 980 సం॥ నవంబరులో మదరాసులో ఆయన పదవీ విరమణ చేశారు. ఆకాశవాణి రక్టరేటు జనరల్ కార్యాలయంలో రెండేళ్ళు పనిచేసి మంచి పేరు తెచ్చుకొన్నారు.

1983 ఏప్రిల్ 30న రమేష్ చౌదరి కాలధర్మం చెందారు.

హిందీ సాహిత్యాకాశంలో ఆయన వినీల ధ్రువతార !

## హైదరాబాదు కేంద్రం

ప్రసారాలు ప్రైవేటు రేడియో కేంద్రం ద్వారా హైదరాబాదు నుండి 933లో ప్రారంభమయ్యాయి. 1935లో నిజాం తన అధీనంలోకి రేడియో ంద్రాన్ని తీసుకొని ప్రసారాలు చేయసాగారు. ఆయన 'డెక్కన్ రేడియో' అని మకరణం చేశారు. తెలుగు ఉర్దూ ప్రసారాలు జరిగేవి. హైదరాబాదు సంస్థానం 950 ఏప్రిల్‌లో భారతదేశంలో విలీనమైన తర్వాత డెక్కన్ రేడియో కేంద్రాన్ని రత ప్రభుత్వం తీసుకొంది. 1950 ఏప్రిల్ 1 నుండి ఆకాశవాణి ప్రసారాలు మొదలయ్యాయి.

తెలుగుభాషా ప్రసారాలతోబాటు హైదరాబాదు కేంద్రం నుండి ఇతర భాషా ప్రసారాలు కూడా జరుగుతున్నాయి. ఉర్దూ, హిందీ, మరాఠీ, కన్నడ, ఆంగ్ల భాష ంలో వారం వారం ప్రసారాలు చేస్తున్నారు. దాదాపు యాభై సంవత్సరాల చరిత్ర కల ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం అసెంబ్లీ భవనాలకు ఎదురుగా గల 'రాక్ గార్డెన్స్' ఏరియాలో సుందరమైన భవనాలలో నెలకొల్పబడింది. 1988 నుండి ప్రస్తుత నూతన భవనాలలోకి ఆఫీసు బ్లాకు మార్చబడింది. 1995లో నూతన స్టూడియో కాంప్లెక్సును ప్రారంభించారు.

హైదరాబాదు 'ఏ' కేంద్రంపై ప్రధాన ప్రసారాలు మీడియం వేవ్, షార్ట్‌వేవ్ ంపై ప్రసారమవుతాయి. 'బి' కేంద్రం నుండి యువవాణి కార్యక్రమాలు 1970 సెంబరు 20 నుండి ప్రసార మవుతున్నాయి. 'సి' కేంద్రం కేవలం వాణిజ్య ప్రసారాలకు పరిమితమైంది. వాణిజ్య ప్రసార కేంద్రం 1971 [illegible] 21న ప్రారంభించారు. దీనికి స్టేషన్ డైరక్టరు హోదా గల అధికారి ఉన్నారు.

హైదరాబాదు కేంద్రం స్టేషన్ డైరక్టర్లుగా పని చేసిన ఆంధ్రులలో ప్రముఖులు వీరు : శ్రీ యం. వి. రాజగోపాల్. వీరు విజయవాడ కేంద్ర డైరక్టరుగా 1949-50 సం॥లో పని చేశారు. హైదరాబాదు కేంద్ర డైరక్టరుగా 19-8-55 నుండి 20-4-57 వరకు పని చేశారు. ఆ తర్వాత I.A.S.లో చేరి నెల్లూరు జిల్లా కలెక్టరుగా, ఆంధ్ర విశ్వ విద్యాలయ రిజిష్ట్రారుగా, రాష్ట్ర ఉన్నత విద్యాశాఖ డైరక్టరుగా, జవహర్‌లాల్ సాంకేతిక విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్‌గా వ్యవహరించారు. చక్కటి భాషా సాంకేతిక పరిజ్ఞానం గల మేధావి రాజగోపాల్. వీరు హైదరాబాదులో పరమపదించారు. డా॥ అయ్యగారి వీరభద్రరావు కూడా విజయవాడలో పనిచేసి తర్వాత హైదరాబాదు కేంద్రానికి 15-3-65 నుండి 28-10-66 వరకు డైరక్టరుగా వ్యవహరించారు. నెల్లూరుజిల్లాకు చెందిన వసల బాలగురుమూర్తి 3-6-74 నుండి 15-10-75 వరకు డైరక్టరుగా పని చేశారు. అలానే పుల్లెల వెంకటేశ్వర్లు 15-10-75 నుండి 22-6-78 వరకు డైరక్టరుగా చేశారు. 78 నుండి ఆకాశవాణి డైరక్టరేట్‌లో డిప్యూటీ డైరక్టర్ జనరల్‌గా వ్యవహరించారు. హైదరాబాదులో విశ్రాంత జీవితం గడుపుతున్నారు. మైసూరు వాసుదేవాచారి మనుమలైన S. రాజారాం ఈ కేంద్ర డైరక్టరుగా 25-9-81 నుండి 31-1-83 వరకు పనిచేసి రిటైరయ్యారు. శ్రీV.V శాస్త్రి 6-1-92 నుండి 31-10-96 వరకు డైరక్టరుగా పని చేసి రిటైరయ్యారు.

హైదరాబాదు కేంద్రంలో పని చేసిన ఇతర కార్యక్రమ నిర్వాహకులలో ఎందరో మహానుభావులున్నారు. ఆయా రంగాలలో నిష్ణాతులై లబ్ధ ప్రతిష్ఠులైన ఎందరో ప్రసార ప్రముఖులు శ్రోతల అభినందన లందుకొన్నారు. సర్వశ్రీ త్రిపురనేని గోపీచంద్ (గ్రామీణ కార్యక్రమాలు) స్థానం నరసింహారావు (నాటక విభాగం)దేవులపల్లి కృష్ణశాస్త్రి, దాశరధి, రావూరి భరద్వాజ(ప్రసంగశాఖ)వింజమూరి వరదరాజయ్యంగార్, మంచాళ జగన్నాధరావు, పాలగుమ్మి విశ్వనాథం, N. S. శ్రీనివాసన్ (సంగీత విభాగం) శ్రీమతి వింజమూరి సీతాదేవి (జానపద విభాగం) రామమూర్తిరేణు, వేలూరి సహజానంద, తురగా జానకీరాణి, కేశవపంతుల నరసింహశాస్త్రి, గొల్లపూడి మారుతీరావు, నండూరి విఠల్, జనమంచి రామకృష్ణ, అజర్ అఫ్సర్ (ఉర్దూ), ఎల్లా వెంకటేశ్వరరావు, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, భాస్కరభట్ల కృష్ణారావు, N.V S. ప్రసాదరావు హైదరాబాద్ కేంద్ర కార్యక్రమ

రూపకల్పనకు కృషి చేశారు. ఈ కేంద్రం జాతీయ స్థాయిలో ఎన్నో బహుమతు లందుకొంది.

హాస్యబ్రహ్మ మునిమాణిక్యం నరసింహారావు, నాయని సుబ్బారావు, న్యాపతి రాఘవరావు, కామేశ్వరి (రేడియో అన్నయ్య, అక్కయ్యగా ప్రసిద్ధులు) ఈ హైదరాబాదు కేంద్రం ప్రశస్తికి తోడ్పడ్డారు.

దూరదర్శన్ హైదరాబాదు నుండి ప్రసారాలు మొదలుపెట్టిన తర్వాత ఈ కేంద్రం నుండి చాలామంది ప్రసార ప్రముఖులు అందులోకి బదిలీ అయ్యారు. రామంతపురంలో సువిశాలమైన స్టూడియోలతో దూరదర్శన్ తన ప్రసారాలను ఆంధ్ర ప్రేక్షకులకు అందిస్తోంది. భద్రవ్రత, బాలకృష్ణ, నండూరి విఠల్, G. మరార్ ఈ కేంద్రంలో పనిచేసి పదవీ విరమణ చేశారు.

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం శ్రోతల విభాగం పరిశోధనాధికారులుగా వ్యవహరించిన శ్రీ B. S. S. రావు, H. హనుమంతరావు ప్రసారాల నాణ్యతకు కృషి చేశారు. B.S.S. రావు SITE కార్యక్రమాల తొలి రోజుల్లో విశేషంగా కృషి చేశారు. తర్వాత వారు జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థలో Information Director గా పనిచేసి తర్వాత UGC వారి హైదరాబాదు విద్యా ప్రసార కేంద్రం డైరక్టర్ అయ్యారు. హనుమంతరావుగారు హైదరాబాదులో Audience Rerearch గా పనిచేసి పదోన్నతిపై డిప్యూటీ డైరక్టరుగా బొంబాయి వివిధ భారతిలో పని చేశారు. మలేషియాలోని Asian Institute of Broadcast Development సంస్థలో మూడు సంవత్సరాలు డిప్యూటీ డైరక్టరుగా వ్యవహరించారు. హైదరాబాదులోని జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థలో Information డైరెక్టరుగా 1995 లో చేరడానికి ముందు వారు ఆకాశవాణి ఆడియన్స్ రీసర్చ్ డిప్యూటీ డైరక్టరుగా అలహాబాదులో పని చేశారు. కార్యక్రమాల రూపకల్పనపట్ల చక్కటి అవగాహన, విశ్లేషణ గల వారిలో హనుమంతరావుగారు ఒకరు.

## త్రిపురనేని గోపీచంద్ (1910-62):

గోపీచంద్ కథకుడు, నవలా రచయిత, సాహితీవేత్త.

1910 సెప్టెంబరు 8న కృష్ణాజిల్లా అంగలూరులో జన్మించారు. గుంటూరులో బి.ఏ. పూర్తిచేసి, మదరాసులో బి.యల్. చదివారు. ఆంధ్రదేశంలో రాడికల్ ప్రజాస్వామ్య పార్టీ కార్యదర్శిగా పనిచేశారు,

1953లో ఆంధ్ర రాష్ట్రావతరణ తరువాత రాష్ట్ర సమాచార శాఖ డైరక్టరుగా వ్యవహరించారు. 1957 లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో గ్రామస్థుల కార్యక్రమాల ప్రయోక్తగా పనిచేశారు. వీరి హయాంలో చక్కటి ప్రయోజనాత్మక కార్యక్రమాలు ప్రసారమయ్యాయి. అనేక రేడియో నాటికలు వ్రాశారు. రేడియో ప్రసంగాలన్నీ ఉభయకుశలోపరి' పేర ప్రచురించారు గోపీచంద్ సినీ జీవితం పేర్కొనదగింది. 1939లో గృహలక్ష్మి చిత్రంతో ఆరంభమైంది వీరి సినీ జీవితం. చదువుకున్న అమ్మాయిలు, రైతుబిడ్డ చిత్రాలకు మాటలు వ్రాశారు. లక్ష్మమ్మ, పేరంటాలు, ప్రియురాలు చిత్ర దర్శకత్వం చేపట్టారు.

దేవుని జీవితం, తండ్రులు-కొడుకులు, పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా, ధర్మాసుపత్రి, అసమర్థుని జీవయాత్ర, పరివర్తన, శిథిలాలయం — వీరి నవలలో ప్రధానాలు. భార్యల్లోనే వుంది, దేశం ఏమయ్యేట్టు, గీతా పారాయణం, నరే కానివ్వండి వీరి యితర రచనలు. పట్టాభిగారి సోషలిజం, మార్క్సిజం అంటే ఏమిటి ? సోషలిస్టు ఉద్యమం చరిత్ర– వీరి విమర్శనా పటిమకు నిదర్శన గ్రంథాలు. తత్వశాస్త్రం, తత్వ వేత్తలు, పోస్టు చెయ్యని ఉత్తరాలు- తత్వ పరిశోధనా గ్రంథాలు.

గోపీచంద్ గుండెపోటుతో 1962 నవంబరు 22న మరణించారు. గోపీచంద్ కుమారులు సాయిచంద్ టీవీ నటుడిగా ప్రసిద్ధి పొందారు. గోపీచంద్ తండ్రి త్రిపురనేని రామస్వామిచౌదరి గొప్ప కవి, సంఘసంస్కర్త. కుమారునిపై తండ్రి ప్రభావం ఎంతో వుంది.

పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా అనే నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. మెరుపుల మరకలు, చీకటి నవలలు యితర నవలలు. మాంచాల, పశ్చిమవాహిని, గుడ్డి సంఘం, అభాగిని, తత్వమసి వీరి నాటక రచనలు. మాలపల్లి నవలకు నాటకీకరణ చేశారు.

## నాయని సుబ్బారావు (1899-1978):

1899 అక్టోబరు 29న 'నాయనివారు (అప్పటి నెల్లూరుజిల్లా పొదిలెలో) జన్మించారు. నవ్యాంధ్ర కవులలో ఆయన అగ్రగణ్యుడు. ఈ శతాబ్ది ఆరంభంలో రెండు, మూడు దశాబ్దులలో ప్రణయ కవిత్వానికి పట్టం కట్టినవారిలో నాయని ఒకరు. రాయప్రోలు, విశ్వనాథ, దేవులపల్లివలె వీరు కూడా ప్రేమగీతాలు ఆలపించారు,

వీరి సౌభద్రుని ప్రణయయాత్ర సుప్రసిద్ధం. తానే అర్జునుడు. తాను ప్రేమించిన మేనకోడలు సుభద్ర. సరస మధుర కావ్యమిది.

ఫలశ్రుతి, నిత్యక్రీడ మొదలైన ఖండికలు విశిష్టాలు. నాయనివారి మాతృ గీతాలు బాగా ప్రచారం పొందాయి. సుబ్బారావుగారు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ఐదు సంవత్సరాలు విద్యాప్రసారాల విభాగం ప్రొడ్యూసర్‌గా వ్యవహ రించారు. 1924లో సహాయ నిరాకరణోద్యమంలో చదువు మానివేశారు. బి.ఏ. బి.ఇడి. పూర్తిచేసి నరసారావు పేట పురపాలక ఉన్నత పాఠశాలలో టీచర్‌గా పనిచేశారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులుగా తొలినాళ్ళలో పనిచేశారు. భాగ్యనగర కోకిల, వేదనా వాసుదేవం, విషాద మోహనం, ఫలశ్రుతి, మాతృగీతాలు వీరి రచనలు. 1961 లో అఖిలాంధ్ర రచయితల సంఘం వీరిని ఘనంగా సత్కరిం చింది.

నాయని సుబ్బారావు 9-7-78 న గతించారు. వీరి కుమార్తెలు ఆచార్య నాయని కృష్ణకుమారి, కోటీశ్వరి. కృష్ణకుమారిగారు తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో మూడు దశాబ్దాలు అధ్యాపకులుగా వ్యవహరించారు జన్మభూమి, వేదనా వాసుదేవము, విషాద మోహనము వీరి రచనలు. భాగ్యనగర కోకిల సుబ్బారావు 1958-64 సం॥ల మధ్య వ్రాసిన రచన ఆయన ఉదాత్తతకది. ప్రాపంచిక కామ్యాల పట్ల తగులం పెట్టుకోలేదు నాయనివారు. కులపాలికా ప్రణయాన్ని సాహిత్యంలో ప్రవేశపెట్టిన కవితా మార్గదర్శి నాయని. జన్మభూమి వంటి కావ్యాన్ని ఒక భక్తుడు, జ్ఞాని యోగి మాత్రమే రచించగలరని చెప్పవచ్చు. అందుకే నాయని వ్రాసినదంతా సువర్ణమే నన్నాడు దేవులపల్లి కృష్ణశాస్త్రి.

## స్థానం నరసింహారావు (1902-71) :

ఆంధ్ర నాటకరంగ చరిత్రలో నరసింహారావు స్థానం చిరస్థాయిగా నిలిచి పోతుంది. ఆయన స్త్రీ పాత్రధారణలో అసాధారణ ప్రజ్ఞ చూపించారు. స్త్రీ పాత్ర అత్యంత సహజంగా, సొగసుగా నటించి ప్రేక్షకుల ఆదరాభిమానాలు చూరగొన్నారు. 1902 సం॥ సెప్టెంబరు 23న గుంటూరు జిల్లా బాపట్లలో నరసింహారావు జన్మిం

వారు. 1920వ సంవత్సరంలో నాటకరంగ ప్రవేశం చేశారు. దాదాపు నాలుగు దశాబ్దాలు స్త్రీ పాత్రలు ధరించారు.

సత్యభామ శృంగార రసాధి దేవత. స్వాభిమానానికి ప్రతీక. ఆ పాత్రను సహజంగా పోషించడంలో స్థానానికి విశిష్ట స్థానం. అలానే సారంగధర నాటకంలో చిత్రాంగి, విప్రనారాయణలో దేవదేవి, కన్యాశుల్కంలో మధురవాణి, హరిశ్చంద్రలో చంద్రమతి, నలదమయంతిలో దమయంతి పాత్రలను విశేష ప్రతిభతో ప్రదర్శించేవారు. నటన ఆయనకొక తపస్సు. రోషనార, చింతామణి పాత్రలు విశేషం.

వేషధారణలో, వస్త్రధారణలో ఆయనది ప్రత్యేక స్థానం చీరకట్టులో ఆయన చూపే నైపుణ్యం స్త్రీలకే ఆశ్చర్యం గొలిపేది. పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలలో పాత్ర పోషణలో ఆయన ప్రతిభ అనన్య సామాన్యం. రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్, ప్రముఖ రచయిత హరీంద్రనాథ ఛటోపాధ్యాయ నరసింహారావును ప్రశంసించారు. భారత ప్రభుత్వం 1970లో పద్మశ్రీ సత్కారం చేసింది. 1971 ఫిబ్రవరి 21న స్థానం కాలధర్మం చెందారు

1956 నుంచి ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో నాటక విభాగ ప్రయోక్తగా స్థానంవారు చక్కటి నాటకాలు ప్రసారం చేశారు బళ్ళారి రాఘవ సరసన నటించారు. నటశేఖర, ఆంధ్ర గంధర్వ, నటకావతంస బిరుదులు పొందారు. తెనాలిలో రామవిలాస సభ స్థాపించి దేశవిదేశాలలో ప్రదర్శన లిచ్చారు

## మునిమాణిక్యం నరసింహారావు 1898-1973

కాంతం కథలతో ఆంధ్ర పాఠకులకు చిరపరిచితులైన మునిమాణిక్యం నరసింహారావు 1898 మార్చి 15నగుంటూరుజిల్లా సంగంజాగర్లమూడిలో జన్మించారు పూర్వాచార సనాతన కుటుంబం వారిది. తండ్రి ఉపాధ్యాయులు.

తెనాలి, విజయనగరం, రాజమండ్రిలలో చదువుకొని బి.ఏ ,ఎల్.టి. పూర్తి చేశారు. ఆ తర్వాత గుంటూరు, భీమవరం, బందరు, కళాశాలల్లో 30 ఏళ్ళు పని చేశారు. ఆదర్శ ఉపాధ్యాయులుగా పేరు తెచ్చుకొన్నారు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో విద్యా ప్రసారాలు అసిస్టెంట్ ప్రొడ్యూసర్‌గా పనిచేశారు. ఆంధ్ర సారస్వత పరిషత్, తెలుగు పండిత శిక్షణా పాఠశాల హెడ్మాష్టర్‌గా హైదరాబాదులో

5 ఏళ్ళు పనిచేశారు. నవలలు, కథలు ఏది వ్రాసినా ఆయన సునిశితహాస్యం కొట్ట వచ్చినట్లు కనబడేది. పాత్రాలు చెప్పడంలో ఆయన కొత్త తరహా సృష్టించారు. ఆయన వ్రాసిన కథలలో తెలుగు యింటి ఆడపడచు దర్శనమిచ్చేది. ఆయన కాంతం కథలు హైలైట్. కాంతం పాత్రకు జీవం పోసిన మహారచయిత ముని మాణిక్యం.

మన హాస్యం పేరుతో ఆయన చక్కని గ్రంథం వెలువరించారు. వక్రరేఖ, తిరుమాళిగ, దీక్షితులు కాంతం, నేను-మా కాంతం (1933), కాంతం కైఫీయత్, కాంతం కాపురం, మునిమాణిక్యం కథలు, రుక్కుతల్లి. శరద్రాత్రులు, అన్నయ మంత్రి, మరపు, స్తుతి-ఆత్మస్తుతి, ఇల్లు-ఇల్లాలు, మంచివాళ్ళ మాట తీరులు, గాజుల సెట్టి, తల్లిప్రేమ- వీరి రచనలలో ప్రసిద్ధం. తిరుమాళిగ, రుక్కుతల్లి, దీక్షితులు నవలికలు-కరుణరసభరితాలు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వీరిని విశిష్ట సభ్యులుగా సత్కరించింది. కాంతం కథలు, 1927 లో కథాసంకలనంగా వెలువడింది. మునిమాణిక్యం గారి భార్య 1938లో కాలధర్మం చెందింది. ఆ తర్వాత కాంతం, కాంతం వృద్ధాప్యం రచించారు.

పిల్లలకు, విద్యార్థులకు సరిపడేలా అన్నయమంత్రి, వక్రరేఖనవలలను రచించారు. తిరుగుబాటు అనే నాటకం వ్రాశారు. ఇంటావిడతో పోట్లాట, ప్రణయ కలహం, భార్యను లొంగదీసుకోవడం ఎలా- వంటి రచనలు హాస్యస్ఫోరకాలు. మధ్యతరగతి సంసారాల దాంపత్య జీవిత రహస్యాలను ఆయన సజీవ పాత్రలుగా సృష్టించారు. 1973 ఫిబ్రవరి 4న మునిమాణిక్యం కాంతాన్ని కలవడానికి స్వర్గలోకం వెళ్ళారు. ఆయన కుమారులు మునిమాణిక్యం రఘునాథ యాజ్ఞవల్క్య,' మురయా' సమాచార ప్రసార మంత్రిత్వ శాఖలో ఫిల్మ్‌పబ్లిసిటీ ఆఫీసరుగాచేసి పదవీ విరమణ చేశారు.

# న్యాపతి రాఘవరావు దంపతులు

## న్యాపతి రాఘవరావు (1905-1984)

రేడియో అన్నమయ్యగా ప్రసిద్ధి కెక్కిన రాఘవరావు 1905 వ సం.లో బరంపురంలో జన్మించారు. అక్కడే 1921లో మెట్రిక్యులేషన్ చదువుతుండగా జాతీయోద్యమంలో ప్రవేశించారు. ఫలితంగా చదువుకు స్వస్తి ప కా ు. కొంత

కాలం 'ఆంధ్రవాణి' తెలుగు వారపత్రిక నిర్వహించారు. చదువు మీద పట్టుదలతో బి.ఏ. డిగ్రీ సంపాదించారు, వీరి ధర్మపత్ని కామేశ్వరి. వివాహం 1931లో జరిగింది.

ఆకాశవాణిలో రాఘవరావు దంపతులు కార్యక్రమాల నిర్వహణలో రేడియో అన్నయ్య, అక్కయ్యగా ప్రసిద్ధికెక్కారు. 1939లో రాఘవరావు కార్యక్రమ నిర్వాహకుడుగా ఆకాశవాణి మదరాసు కేంద్రంలో చేరారు. బాలల పట్ల ఆయన కపారమైన ప్రేమ. వారి విద్యాసాంస్కృతిక వికాసానికి ఎంతగానో తోడ్పడ్డారు. బాలానంద సంఘం పేర 1940లో ఒక సంస్థను స్థాపించారు జీవితాంతం ఆ సంస్థ కోసం అహరహం కృషి చేశారు, 'బాల' పత్రిక ద్వారా బాలల సర్వతోముఖాభి వృద్ధికి కృషి చేశారు.

ఆకాశవాణిలో బాలబాలికల కోసం దాదాపు వెయ్యి రచనలు చేశారు. నాటి కలు, రూపకాలు ఒకటేమిటి ఎన్నో రకాలుగా ప్రసారాలు నిర్వహించారు. రంగ స్థలం పైన బాలబాలికలచే ఎన్నో కార్యక్రమాలు రూపొందించారు. పొట్టిబావ, చిట్టి మరదలు, కొంటికృష్ణయ్య, తాతయ్య, మొద్దబ్బాయి, దొడ్డమ్మ పాత్రల ద్వారా బాలానంద కార్యక్రమాలు రక్తికట్టేలా చూశారు. రాఘవరావు రచించిన 'బడి గంట' రూపకం జాతీయ స్థాయిలో బహుమతి పొందింది. ఆయన కొంత కాలం సెంట్రల్ సోషల్ వెల్ ఫేర్ అడ్వయిజరీ కమిటీ మెంబరుగా పనిచేశారు. బాలల కోసం ఒక సినిమా తీశారు. ఎన్నో గ్రామఫోను రికార్డులు రూపొం దించారు.

చివరిదశలో రాఘవరావు హైదరాబాదులోని నారాయణ గూడలోని బాలా నంద సంఘ కార్యాలయంలో ఎంతో ఉత్సాహంగా పని చేశారు. 1984 ఫిబ్రవరి 24న ఆయన హైదరాబాదులో కాలధర్మం చెందారు. కామేశ్వరితో ఆయనది అన్యోన్య దాంపత్యం. ఇద్దరూ బాలల కార్యక్రమాలు తీర్చిదిద్దడంలో అహరహం కృషిచేశారు. బాలానంద సంఘ సభ్యులు ఎందరో ప్రసిద్ధ కళాకారులయ్యారు. బాలానందంలో పాల్గొనడం ఒక విశిష్టతగా భావించేవారు. బాపు, ఘంటసాల వెంకట రమణ, మోహనకందా వంటి ప్రముఖులు యిందులో సభ్యులు కావడం విశేషం పిల్లల మనస్తత్వాన్ని కనిపెట్టి వారి బుద్ధి వికాసానికి కార్యక్రమాలు వినోదాత్మ కంగా, విజ్ఞానదాయకంగా తయారుచేసినారు. కళాతృష్ణను పెంపొందించి వారి మనోవికాసనానికి దోహదం చేశారు. ఆయన చిరంజీవి.

## న్యాపతి కామేశ్వరి (1908-80) :

రాఘవరావుగారి ధర్మపత్ని కామేశ్వరి 1908 వ సంవత్సరంలో విజయ నగరంలో జన్మించారు. 1932లో విజయనగరం మహారాజా కళాశాలలో పట్టభద్రు లయ్యారు. 1937లో ట్రెయినింగ్‌లో యల్. టి. ప్యాసయ్యారు. ఉపాధ్యాయ వృత్తిపై ఆమెకు ఎనలేని గౌరవం. మదరాసు నేషనల్ గరల్స్ హైస్కూలులో అధ్యాపక వృత్తిలో చేరారు. బాలలంటే ఆమెకు వల్లమాలిన ప్రేమ.

రేడియో అన్నయ్యగారితో కలసి బాలానంద సంఘం స్థాపించారు. అవిభక్త మదరాసు రాష్ట్రంలో ఈ సంస్థ బాగా కృషి చేసింది. ఆంధ్ర రాష్ట్రావతరణ తర్వాత 1956 లో హైదరాబాదుకు ఈ సంఘం తరలించబడింది. మహిళాభ్యు దయానికి, బాలల విజ్ఞానాభివృద్ధికి బాలానందం ఎనలేని కృషి చేసింది.

1939–56 మధ్యకాలంలో ఆకాశవాణి మదరాసు కేంద్రంలో బాలల కార్య క్రమ రూపకల్పనలో ఆమె అవిరళ కృషి చేశారు. బాలల కార్యక్రమాలు, మహిళా కార్యక్రమాలు, విద్యా ప్రసారాలు తీర్చిదిద్దడంలో ఆమె కృషి అనన్య సాధ్యం. 1956లో హైదరాబాదు కేంద్రానికి బదిలీ అయివచ్చారు రాఘవరావు దంపతులు. రేడియో అక్కయ్యగా కామేశ్వరి శ్రోతలకు పరిచితురాలు. జంట నగరాలలో రేడియో మహిళా మండలులు స్థాపించడంలో ఆమె కృషి ఎంతైనా ఉంది. తెలంగాణాలోని పల్లెలకు కూడా ఈ ఉద్యమం వ్యాపించింది. రేడియో మహిళామండలుల సమాఖ్యను రూపొందించడంలో ఆమె విశేష కృషి చేశారు. సాంఘిక సంక్షేమ సలహా మండలి సమావేశకర్తగా ఆమె చక్కటి పరిశ్రమ చేశారు.

ఆంధ్ర బాలానంద సంఘం పక్షాన బాలలు పాడుకోవటానికి అనువుగా ఎన్నో పాటలు రచించారు. ప్రముఖ సినీ నటుడు నాగయ్యగారి చిత్రం 'నా ఇల్లు' లో ఆమె ఒక పాత్రను పోషించారు. 1974 ఆమె సేవలకు గుర్తింపుగా రాష్ట్ర ప్రభుత్వం ఆమెను సత్కరించింది. 1969 వరకు మూడు దశాబ్దాలు ఆమె రేడియోలో పని చేశారు. ప్రపంచ తెలుగు మహాసభలలో 1975లో కామేశ్వరి సన్మానం పొందారు. 1980 అక్టోబరు 23న కామేశ్వరి దివంగతులయ్యారు.

రేడియో అన్నయ్య, అక్కయ్య ఆదర్శ దాంపత్యానికి మారుపేరు.
బాలానంద సంఘం సభ్యులు వారిని విస్మరించలేరు.
బాలలు నిత్య విజ్ఞాన సందీప్తులని వెల్లడించింది ఈ దంపతులే.

హైదరాబాదులో బాలానంద సంఘం కార్యకలాపాలు కొనసాగినంత కాలం రాఘవరావు దంపతులు చిరంజీవులు. సినీ రంగంలోని కాంచన, షావుకారు జానకి, కృష్ణకుమారి, నేపథ్య గాయని సుశీల, వింజమూరి లక్ష్మి, వైణికులు చిట్టిబాబు బాలానంద సంఘ సభ్యులు.

1948లో ఆకాశవాణి విజయవాడ కేంద్రం ప్రారంభమైనపుడు 'పాలవెల్లి' బాలల కార్యక్రమం ఈ బాలానంద సంఘ సభ్యులు ప్రథమంగా ప్రసారం చేశారు. రేడియో అక్కయ్య స్మారకార్థం 'కామేశ్వరి స్మారక శిశులాలన కేంద్రం' రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా మండలి ఆర్థిక సహాయంతో ఏర్పాటు చేశారు. మురికి వాడలలో తల్లులు మధ్యతరగతి తల్లులు ఈ కేంద్రాన్ని వినియోగించుకొంటున్నారు. ఆంధ్ర బాలానంద సంఘ ట్రస్టు బోర్డు కూడా ఏర్పాటు చేశారు. ప్రముఖ ఐంద్రజాలికులు శ్రీ బి. వి. పట్టాభిరాం ఏటా నిర్వహిస్తున్నారు.

## దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897-1980) :

పిఠాపురాస్థాన కవులైన తండ్రిగారి సాహితీ వారసత్వం కృష్ణశాస్త్రికి లభించింది. వీరి స్వస్థలం పిఠాపురానికి సమీపంలోని చంద్రంపాలెం. 1897 నవంబరు 15 న శాస్త్రి జన్మించారు. వీరు పట్టభద్రులు. కాకినాడ P. R. కళాశాలలో 1931-41 మధ్యట్యూటర్ గా పనిచేశారు. హైదరాబాదు ఆకాశవాణి కేంద్రంలో వీరు తెలుగు ప్రసంగాలశాఖ ప్రొడ్యూసర్ గా 1957-64 మధ్య పని చేశారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం వీరిని కళా ప్రపూర్ణ బిరుదంతో సత్కరించింది. కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, పల్లకి-వీరి ఖండకావ్య సంపుటాలు. అప్పుడు పుట్టి వుంటే, పుష్పలాలికలు, బహుకాల దర్శనం - వచన రచనా సంపుటాలు. వెండి తెర పాటలు మేఘమాలగా ప్రచురితమయ్యాయి. వందలాది చలనచిత్ర గీతాలను రచించారు. ప్రేక్షకుల ఆదరణ లభించింది.

నవ్య సాహిత్యోద్యమానికి 'దేవులపల్లి' ఆద్యులు. ఆత్మాశ్రయ కవిత్వం వచ్చిన తొలి రోజుల్లో తన దుఃఖాన్ని సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచిపోయేలా చేశారు. అనేక రేడియో నాటికలు, ప్రసంగాలు శ్రోతల మన్నన అందుకొన్నాయి. జీవిత చరమ దశలో 'గొంతు క్యాన్సర్' వచ్చింది. మదరాసులో చివరి రోజులు గడిపారు. వీరి కుమారుడు 'బుజ్జాయి'. వీరి మేనకోడళ్లు వింజమూరి సీతాదేవి,

అనసూయ జానపద సంగీతం ద్వారా ఆకాశవాణికి పరిచితులు. సీత రేడియోలో జానపద సంగీత ప్రయోక్తగా పనిచేసి పదవీ విరమణ చేసింది.

సహస్ర చంద్ర దర్శనోత్సవం చేసుకొని కృష్ణశాస్త్రిగారు 24-2-80 న పరమపదించారు.

భావ కవిత్వోద్యమానికి ఆయన పెట్టింది పేరు. గిరజాల జుట్టు, మెరుగు కళ్ళజోడు, తెల్లని లాల్చీ, పంచె వల్లెవాటుతో ఆయన భావకవికి మారుపేరై నిలిచాడు. దుస్తులలో ఆయన నెందరో అనుకరించారు 1975లో దేవులపల్లి కవితా స్వర్ణోత్సవం మదరాసులో ఘనంగా జరిగింది.

కళాప్రపూర్ణ బిరుదంతో (1975) ఆంధ్ర విశ్వవిద్యాలయం, పద్మభూషణతో (1976) భారత ప్రభుత్వం సత్కరించాయి. 1978లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి విశిష్ట సభ్యత్వంతో సత్కరించింది.

శాస్త్రిగారి మరణానంతరం వీరి గ్రంథాలు ఆరు సంపుటాలుగా వెలువరించారు. అమృతవీణ, మంగళకాహళి, కవి పరంపర, కవితా ప్రశస్తి, మహావ్యక్తి, అమూల్యాభిప్రాయాలు, ఇంకా 11 సంపుటాల అముద్రిత రచనలున్నాయి.

## భాస్కరభట్ల కృష్ణారావు (1918-63) :

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసిన సుప్రసిద్ధ కథారచయిత భాస్కరభట్ల కృష్ణారావు. కథా రచయితగా, నవలా రచయితగా భాస్కరభట్ల లబ్ధ ప్రతిష్ఠులు. 1918 డిసెంబరు 19న హైదరాబాదు నగరానికి సమీపంలో ప్రేమాజీపేటలో జన్మించారు. బి.యస్‌సీ. పూర్తిచేసి L.L B. పట్టా పుచ్చుకొన్నారు. 1951 ప్రాంతాలలో ఆకాశవాణిలో చేరారు. దాదాపు 15 సంవత్సరాలు పనిచేశారు.

కథా రచయితగా ఆయన రెండు దశాబ్దాలు (1939–57) పేరు తెచ్చుకొన్నారు. కథా సంపుటులు మూడింటిని ప్రచురించారు. కృష్ణారావు కథల పేరుతో 1955లో పది కథలుసంపుటిగా ప్రచురించారు. రెండోసంపుటి 'చంద్రలోకానికి ప్రయాణం' అనే పేర 9 కథలు ప్రచురించారు. మూడో సంపుటి వెన్నెలరాత్రిలో 17 కథలు ప్రచురించారు. కథా రచనలేగాక నాలుగు నవలలు కూడా ప్రచురించారు,

వింత ప్రణయం, యుగసంధి 1957లో, వెల్లువలో పూచిక పుల్లలు 60లో, భవిష్యద్దర్శనం 66లో వెలువరించారు. ఈ నవలల్లో పాశ్చాత్య ప్రభావంలోని అస్తిత్వవాదం ప్రస్ఫుటమవుతుంది. భాస్కరభట్ల 1966 నవంబరు 11న కాల ధర్మం చెందారు.

కార్యక్రమ నిర్వాహకుడుగా చక్కటి పేరు సంపాదించారు. ప్రసారాలను విశేషంగా రూపొందించారు.

## బుచ్చిబాబు 1916-67 :

శివరాజు వెంకటసుబ్బారావు బుచ్చిబాబుగా ప్రసిద్ధులు. ఈయన 1916 జూన్ 14న ఏలూరులో జన్మించారు. ఎం. ఏ పట్టభద్రులయ్యారు. రచయితగా ఆయన సుప్రసిద్ధులు. పాలకొల్లు, గుంటూరు, మదరాసు, నాగపూర్‌లలో విద్యాభ్యాసం చేశారు. 1945 నుండి ఆకాశవాణి మదరాసు, విజయవాడ, హైదరాబాదు కేంద్రాలలో కార్యక్రమ నిర్వాహకులుగా పనిచేశారు. హైదరాబాదు కేంద్రంలో వీరి స్థానం సముచితం. అనంతపురం, విశాఖపట్టణాలలో కాలేజీల్లో ఇంగ్లీషు లెక్చరర్‌గా చేశారు. వీరి రచనలలో 1946లో వ్రాసిన 'చివరకు మిగిలేది' నవల సుప్రసిద్ధం. మేడమెట్లు, అడవికాచిన వెన్నెల, కథాసంపుటాలు. ఆత్మ వంచన, దారినపోయే దానయ్య, తెరపడని నాటకం, కార్యదర్శి కళ్యాణి, ఉమర్ ఖయ్యాం నాటికలు వ్రాశారు. ప్రాక్ పశ్చిమ సాహిత్యాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు.

తండ్రి ఓవర్‌సీర్‌గా ఉద్యోగం చేస్తుండటంతో బుచ్చిబాబు ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలు సందర్శించి, నివసించే అవకాశం కలిగింది. ఆ నేపథ్యంలో ఆయన రచనలు గ్రామీణ వాతావరణం ప్రతిబింబిస్తాయి. 1936-67 మధ్యకాలంలో ఆయన ఎన్నో తెలుగు ఇంగ్లీషు రచనలు చేశారు. ఇంగ్లీషు రచనలను 'సంతోష్ కుమార్' అనే కలం పేరుతో వెలువరించారు. షేక్స్పియర్ సాహిత్య పరామర్శ చక్కటి విమర్శనాగ్రంథం. 40 వ్యాసాల సంపుటిని, 40 నాటికా, నాటకాలను, అజ్ఞానమనే వచన కావ్యాన్ని వ్రాశారు. అనుభూతిని కథలలో జొప్పించిన వారిలో బుచ్చిబాబు ప్రథముడు. ఆయని గాయకుడు, నటుడు, చిత్రకారుడు, సాహిత్య కారుడు, సౌందర్యారాధన, మనస్తత్వ చిత్రణ ఆయన కథలలో ప్రస్ఫుటమవు తుంది.

1967 సెప్టెంబరు 20న బుచ్చిబాబు పరమపదించారు,

వీరి ధర్మపత్ని శివరాజు సుబ్బలక్ష్మి రచయిత్రిగా పేరు పొందారు. బుచ్చిబాబు కవి, రచయిత, గల చిత్రకారుడు. చిత్రకళా కోవిదుడైన కవి. అంతరంగ కథనం పేరుతో ఆయన తన బాల్య జీవితానుభవాలను అద్భుతంగా వ్రాసుకొన్నారు. 'శిల్ప మంత్రం నీ చేతిలోవుంది బుచ్చిబాబూ, అని విశ్వనాథ సత్యనారాయణ, 'ఆంగ్లంలో నిధివి', అని పింగళిలక్ష్మీకాంతం బుచ్చిబాబుని ప్రశంసించేవారు. ప్రముఖ సినీనటుడు పృథ్వీరాజ్ కపూర్ వీరిని బహుధా ప్రశంసించారు. రేడియో నాటకాలకు ఆయన మార్గదర్శి. వందకిపైగా రేడియో నాటికల్ని ప్రొడ్యూస్ చేశారు రేడియోకు అయన వ్రాసిన 'రాయలు కరుణకృత్యం' నాటకం ఆధారంగా 'మల్లేశ్వరి' సినిమాతీశారు. పేజి నాటకాలను వ్రాసి ప్రదర్శనలిప్పించారు.

చివరకు మిగిలేది నవల 'నవోదయ' పత్రికలో ధారావాహికంగా వెలువడింది. ఆ నవల దాదాపు పాతిక ముద్రణలు పొందింది. ఎంకి పాటలంటే ఆయన కిష్టం. ఆ పాటల ప్రేరణతో 'ఉత్తమ ఇల్లాలు' అనే రేడియో నాటకం వ్రాశారు. ఎంకి పాటలకు ఆయన బొమ్మలు వేసుకొని దాచుకొన్నారు. అంతటి ప్రజ్ఞాశాలి ఉద్యోగం చేస్తూ 51వ ఏట కన్నుమూశారు.

## దాశరథి (1926-87) :

'నా తెలంగాణ కోటిరతనాల వీణ' అని సగర్వంగా పలికిన దాశరథి కృష్ణమాచార్యులు తెలంగాణాలోని 'చిన గూడూరు'లో జన్మించారు. తెలంగాణ సూర్యచంద్రులుగా నారాయణరెడ్డి, దాశరథి పేరు గడించారు. నవాబు పరిపాలనను ఎదిరించి జైలుకెళ్ళారు. వీరికి జైలులో మాజీ ముఖ్యమంత్రి జలగం వెంగళరావు పరిచితులయ్యారు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషలలో సమానంగా ఉర్దూలో పాండిత్యం సంపాదించారు. ఆయన మలేషియా అమెరికా మొదలైన దేశాలలో విస్తృతంగా పర్యటించారు. 1947-48లో కారాగారవాసం చేశారు.

హైదరాబాదు, మదరాసు ఆకాశవాణి కేంద్రాలలో అసిస్టెంట్ ప్రొడ్యూసర్ ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. ఎన్నో సినిమాలకు పాటలు, మాటలు వ్రాశారు. సినిమా కోసం రేడియోకు రాజీనామా చేశారు. వీరిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆస్థానకవిగా నియమించింది. కేంద్ర ప్రసార మంత్రిత్వ శాఖవారు గౌరవ సహాయకుగా (Producer Emiretus) నియమించారు. 1975లో ఆంధ్ర

విశ్వవిద్యాలయం కళా ప్రపూర్ణతో సత్కరించింది ఆగ్రా విశ్వవిద్యాలయం డాక్టరేట్ ప్రదానం చేసింది. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం డాక్టరేట్ నిచ్చింది.

అమృతాభిషేకం, అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, మహాబోధి, పునర్నవం, కవితాపుష్పకం, తిమిరంతో సమరం, ఆలోచనాలోచనాలు కవితా సంపుటాలు. గాలిబ్ గీతాలు అనువాద గ్రంథం. తిమిరంతో సమరానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 5-11-87న దాశరథి పరమపదించారు.

వీరి సోదరులు దాశరథి రంగాచార్య మంచి నవలా రచయిత. మునిసిపల్ శాఖలో ఉద్యోగం చేసి పదవీ విరమణ చేశారు.

దాశరథి రుబాయిలను, గజళ్ళను వ్రాయడంలో అందెవేసిన చేయి. ఆయన మంచి సాహిత్య విమర్శకుడు.సాహిత్య సభలు, కవిసమ్మేళనాలు ఆయన అధ్యక్షత వహించిన తీరు ఎంతోవిలక్షణం. ఆయన బహుముఖ ప్రజ్ఞావంతుడు పద్యం వ్రాసినా వచన కవిత్వం వ్రాసినా, గేయం వ్రాసినా అందచందాలు చూపగలిగేవాడు. దాశరథి సింహగర్జనకవితోద్యమమై తెలంగాణా అంతటా ఆవరించింది. అభినవ దాశరథీ శతకంలోఆయన సామాజిక స్పృహ స్పష్టమవుతుంది. జయదేవుని గీతా గోవిందానికి భావవ్యాఖ్యానం చేశారు. ప్రతిభాపూర్వకమైన ఉపోద్ఘాతం వ్రాశారు. వ్యాసపీఠం పేరుతో ఆయన సాహిత్యవ్యాస సంపుటి ప్రచురించారు. అందుకే కవితాశరధి దాశరథి.

డా. రావూరి భరద్వాజ :

కథా రచయిత, నవలా రచయిత, బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన భరద్వాజ గుంటూరుజిల్లాలో జన్మించారు.నాలుగోతరగతి మించి చదువుకోలేదు ఆకాశవాణిలో చేరడానికి ముందు సేవాలు అమ్మడం మొదలు పత్రికలలో పనిచేయడం వంటి పాదాసీదా పనులు చేశారు. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో script writerగా చేరారు.

1975లో తెలుగు ప్రసంగశాఖ ప్రొడ్యూసర్‌గా హైదరాబాదులో చేరారు. 1984లో రిటైరయ్యేంత వరకు ఆయన ప్రసంగశాఖను సమర్థవంతంగా నిర్వహించారు.

పాకుడురాళ్ళు నవల ద్వారా భరద్వాజ లోకానికి సుపరిచితులు. అనేక నవలలు, కథలు, వ్యాసాలు, బాలసాహిత్యం భరద్వాజ కలంనుండి వెలువడ్డాయి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కేంద్ర సాహిత్య అకాడమీ 'సోవియట్ లాండ్ నెహ్రూ బహుమతులు అందుకొన్నారు. జీవన సమరం పేర సామాన్యుని స్వగతాలు ఈనాడు పత్రికలో ధారావాహికగా ప్రచురితమై గ్రంథరూపంలో వచ్చాయి జమీన్ రైతు, దీనబంధు, రేరాణి పత్రికలలో పనిచేశారు.

ఆయన సతీమణి కాంతమ్మ మరణానంతరం స్మృతి కావ్యాలను ప్రచురించి ఆ రంగంలో విశిష్ట స్థానాన్ని సంపాదించారు. జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం డాక్టరేట్‌తో, కళాప్రపూర్ణ బిరుదంతో ఆంధ్ర విశ్వకళాపరిషత్ సత్కరించింది.

1987లో ఆకాశవాణిలో పదవీ విరమణానంతరం తెలుగు విశ్వవిద్యాలయములో ప్రొడ్యూసర్‌గా కొంతకాలం పనిచేశారు.

**అజల్ అఫ్సర్ :**

"నయీరంగ్ "కార్యక్రమాల నిర్వహణ ద్వారా ఉర్దూ కార్యక్రమాల రూపకల్పనకు అహరహం కృషిచేసి రెండు దశాబ్దాలపాటు ఖ్యాతి గడించిన వ్యక్తి అజర్ అఫ్సర్. 1975లో ఉర్దూ విభాగం ప్రొడ్యూసర్‌గా చేరి ఒక దశాబ్దిపాటు ఈ కార్యక్రమాలకు వన్నె తెచ్చిన వ్యక్తి అఫ్సర్ స్వయంగా ఉర్దూలో చక్కటి కవి. 1984లో అజల్ అఫ్సర్ పదవీ విరమణ చేశారు

**వసీం అక్తర్ :**

ఉర్దూ వార్తా విభాగంలో రెండు దశాబ్దాలు అవిచ్ఛిన్నంగా వార్తలు చదివిన వ్యక్తి వసీం అక్తర్. ఆయన ప్రత్యేక బాణీని ఎందరో మిమిక్రీ కళాకారులు అనుకరించేవారు. ఆయన 84 పదవీ విరమణానంతరం 1994 ప్రాంతంలో పరమపదించారు.

**డా. వడ్లమూడి గోపాలకృష్ణయ్య :**

వాఙ్మయమహాధ్యక్ష, కళాప్రపూర్ణ వడ్లమూడి గోపాలకృష్ణయ్య కొద్దికాలం ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో (1964-66) ప్రొడ్యూసర్‌గా పనిచేశారు. ఆ తర్వాత వారు హైదరాబాదులోని ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారాధిపతిగా పనిచేసి పదవీ విరమణ చేశారు. వ్యాకరణ శాస్త్రవేత్త, బహుగ్రంథరచయిత అయిన గోపాలకృష్ణయ్య బహుభాషా వేత్త.

నండూరి విఠల్ :

తన కమ్మని కంఠ స్వరంతో శ్రోతలనాకట్టుకొన్న నండూరి విఠల్ విజయవాడ కేంద్రంలో అనౌన్సర్‌గా జీవితం ప్రారంభించారు. విజయవాడ, హైదరాబాదుల్లో ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. దూరదర్శన్ హైదరాబాదు కేంద్రడైరక్టర్‌గా పని చేశారు. వీరి విషకన్య నవల ప్రసిద్ధం. చిన్నారి ప్రచురణలపేర విజయవాడలో పుస్తకాలు ప్రచురించారు. అనారోగ్యరీత్యా స్వచ్ఛంద పదవీ విరమణ చేసి 1994లో హైదరాబాదులో మరణించారు.

వేలూరి సహజనంద

వేలూరి వంశంలో జన్మించిన సహజానంద హైదరాబాదు కేంద్రంలో ఒక దశాబ్ది పంచవర్ష ప్రణాళిక ప్రొడ్యూసర్‌గా పనిచేశారు. పంచవర్ష ప్రణాళికల ద్వారా దేశాభివృద్ధిని గూర్చి ప్రసారాలు రూపొందించడంలో ఆయన కృతకృత్యులయ్యారు. 1979 ప్రాంతంలో ఆయన అకాల మరణం చెందారు. రచయితగా సహజానంద ప్రసిద్ధులు.

డా. రామమూర్తి రేణు :

హిందీలో సుప్రసిద్ధవిద్వాంసులైన వారణాసి రామమూర్తిగారు, రామమూర్తి రేణుగా ప్రసిద్ధులు. హిందీ ప్రసంగాల విభాగాన్ని హైదరాబాదు కేంద్రంలో రెండు దశాబ్దాలు నిర్వహించారు. వీరు వ్యాఖ్యాతగా కూడా పరిచితులు. వీరు హైదరాబాదులో విశ్రాంతి జీవనం గడిపారు.

N.V.S ప్రసాదరావు :

తెనాలి వాస్తవ్యులయిన N.V.S. ప్రసాదరావు ఆకాశవాణిలో 64 ప్రాంతాల్లో హైదరాబాదు కేంద్రంలో గ్రామీణ కార్యక్రమాల ప్రొడ్యూసర్‌గా చేరారు. రాజకీయనాయకులతో సన్నిహిత సంబంధాలుగల ప్రసాదరావు గ్రామీణకార్యక్రమాల రూపకల్పనలో సిద్ధహస్తులు. 1980లో రిటైరయిన తర్వాత కొంతకాలం రాష్ట్ర వ్యవసాయశాఖ నడిపే మాసపత్రిక ఎడిటర్‌గా పనిచేశారు. ఆ తర్వాత రవీంద్రభారతి డైరక్టర్‌గా వ్యవహరించారు. హైదరాబాదులోని వివిధ సాంస్కృతిక సంస్థలతో ఆయనకు సన్నిహిత సంబంధం. వీరి కుమార్తె సుశీల హైదరాబాదు కేంద్రంలో అనౌన్సర్‌గా పనిచేస్తున్నారు.

**కేశవ పంతుల నరసింహశాస్త్రి :**

**K V.N.** శాస్త్రిగా ప్రసిద్ధులైన కేశవపంతుల సంస్కృత పరిచయం ద్వారా ఆంధ్ర శ్రోతలకు సుపరిచితులు పీరు హైదరాబాదు కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా ఒక దశాబ్దిపైగా పనిచేసి పదవీ విరమణ చేశారు. హైదరాబాదులో 91లో కాలధర్మం చెందారు.

**గొల్లపూడి మారుతీరావు :**

G.V.S.M L. నారాయణరావు విశాఖపట్టణంలో 1939 ఏప్రిల్ 14న జన్మించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయములో M.Sc., (Mathematical Physics) చేశారు 1961-63 మధ్య కాలంలో ఆంధ్రప్రభ (చిత్తూరు)లో సబ్‌ఎడిటర్‌గా పని చేశారు. మారుతీరావు రచయితగా పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. నాటక రచయితగా, నటుడుగా పేరుపొందారు.

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా 1963లో చేరారు. ఎందరో మహామహులు అప్పుడు ఆకాశవాణిలో పనిచేస్తున్నారు. దాశరథి, దేవులపల్లి, స్థానం, మునిమాణిక్యం యిలా ఎందరో వారితో కలిసి పని చేశారు. అప్పుడే చక్రభ్రమణం నవలను "డా. చక్రవర్తి" పేర సినీ కథకు మాటలు వ్రాసి సినీ రచయితగా స్థానం సంపాదించారు. వందలాది సినిమాలకు కథ, మాటలు సమకూర్చారు.

1981 లో ఇంట్లో రామయ్య, వీధిలో కృష్ణయ్య సినిమా ద్వారా నటుడుగా సినీరంగ ప్రవేశం చేసి 81-96 మధ్యకాలంలో మూడువందల పైగా సినిమాలలో విభిన్న పాత్రలలో నటించి బహుమతులందుకున్నారు.

ఆకాశవాణి సంబల్‌పూర్, మదరాసు, కడప కేంద్రాలలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా రెండు దశాబ్దాలు పనిచేశారు. 1980 లో ASDగా పదోన్నతి పొంది 82లో స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. 1970-80 మధ్యకాలములో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. కథారచయిత, వ్యాసరచయిత, నటుడు, నాటక రచయిత సినీరచయితగా మారుతీరావు బహుముఖ ప్రజ్ఞాశాలి. మారుతీరావు మదరాసులో స్థిరపడ్డారు.

మారుతీరావు రచనలపై వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి డా. యం. రజని పిహెచ్ డి పట్టా పొందారు పీరు రచించిన 'కళ్ళు' నాటిక ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీచే 1975 ఉత్తమ నాటక రచయిత బహుమతి పొందింది. 'కళ్ళు' సినిమాగా రూపొందించబడి 1989లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నంది అవార్డు పొందింది.

ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'జీవనకాలమ్' 16 సం॥లుగా నిర్వహిస్తూ సామాజిక జీవన సమస్యలను విశ్లేషిస్తున్నారు. 10 కి పైగా నాటకాలు, 20నాటికలు, 10 నవలలు వ్రాసి సాహితీలోకంలో విశిష్ట స్థానం సంపాదించారు. వంద దాకా చిత్రాలకు సంభాషణలు, కథలు సమకూర్చారు. 1982 నుండి ఎన్నో సంస్థలచే ఉత్తమ నటులుగా బహుమతులు పొందారు. ఇటీవల కాలములో ఈ టీ వీ, జెమినీ టీవీలకు వివిధ కార్యక్రమాలు రూపొందిస్తూ తమ విలక్షణతను చాటుకొంటున్నారు గొల్లపూడి. మంచి మిత్రులు మారుతీరావు.

## దండమూడి మహీధర్

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో హిందీస్క్రిప్ట్ రైటర్‌గా రెండున్నర దశాబ్దాలు పనిచేసిన మహీధర్ హిందీలో మంచిరచయిత. అనువాదకుడుగా మంచి పేరు సంపాదించారు.

## తె. చిరంజీవి.

మూడు దశాబ్దాలు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో నాటక విభాగంలో డ్రామా Voice గా పనిచేసి చిరంజీవి పదవీ విరమణ చేశారు. చక్కటి కంఠస్వరంగల చిరంజీవి మంచి రచయిత కూడా. నాటకాలు శ్రవ్యమాధ్యమానికి సరిపడేలా రూపొందించడంలో సిద్ధహస్తుడు. ఆయన 'స్వతంత్ర భారత్‌కీ జై' నవల వ్రాశారు రేడియో నాటికలు ఒక సంకలనంగా ప్రచురించారు. 1994 లో పదవీ విరమణచేసి హైదరాబాదులో స్థిరపడ్డారు. శారదా శ్రీనివాసన్‌తో కలిసి అనేక రేడియో నాటకాలలో పాల్గొన్నారు.

## మల్లాది నరసింహశాస్త్రి :

మల్లాది వంశంలో జన్మించిన నరసింహశాస్త్రి అసిస్టెంట్ ఎడిటర్ Scriptగా హైదరాబాదు కేంద్రంలో మూడు దశాబ్దాలు పనిచేశారు. మల్లాదిరామకృష్ణశాస్త్రి కుమారులు వ్యవసాయ విభాగములో శాస్త్రి చక్కటి పేరు తెచ్చుకున్నారు.

విజయవాడలో అనౌన్సర్‌గాచేరి Script Writerగా వ్యవసాయ విభాగంలో చేరారు.

1984 లో పదవీ విరమణ చేసి హైదరాబాదులో స్థిరపడ్డారు.

దూరదర్శన్‌లో అసిస్టెంట్ డైరక్టర్‌గా పనిచేస్తున్న శైలజా సుమన్ వీరి కోడలు.

## డా. వింజమూరి సీతాదేవి :

జానపద విభాగంలో ప్రొడ్యూసర్‌గా ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో రెండు దశాబ్దాలు పనిచేసిన సీతాదేవి ప్రసిద్ధ కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి మేన కోడలు. వింజమూరి సీత, అనసూయ అక్కాచెల్లెండ్రు. ఇద్దరూ జానపద గాయకులుగా మంచిపేరు తెచ్చుకున్నారు. తెలంగాణాలో అనేక ప్రాంతాలలో పర్యటించి జానపద గేయాలకు ప్రాణం పోశారు. సీతాదేవి స్వయంగా గానం చేస్తారు. జానపద గేయాలు సంకలన రూపంలో వెలువరించారు. 1984 లో సీతాదేవి పదవీ విరమణ చేసి హైదారాబాదులో స్థిరపడ్డారు. భక్తి-ముక్తి, లాలి- తాలి పేర జానపద గేయాలు ప్రచురించారు. కొంత కాలం మదరాసు కేంద్రంలో పనిచేశారు. వీరికి కళాప్రపూర్ణ బిరుదాన్ని ఆంధ్ర విశ్వ కళా పరిషత్ యిచ్చి సత్కరించింది.

## శ్రీమతి సునందినీ ఐప్ :

అనంతపురంలో 1926 నవంబరులో జన్మించారు. బి ఏ.బి.యిడి పూర్తిచేసి కొంతకాలం అధ్యాపకులుగా పనిచేశారు. 1972లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో విద్యాప్రసార విభాగంలో ప్రొడ్యూసర్‌గా చేరారు. విద్యాప్రసారాలను పటిష్ఠం చేసి బహుళజనామోదం చేయడంలో కృతకృత్యులయ్యారు విద్యాశాఖతో సన్నిహిత సంబంధం ఏర్పరుచుకొని విద్యాప్రసారాల రూపకల్పనలో క్రొత్త ఒరవడి సృష్టించారు. N V S రామారావు (అనౌన్సర్)గా వీరి శాఖకు సహాకారం అందించారు. ఆయన 95 లో హృద్రోగంతో హఠాన్మరణం చెందారు. రామారావు చక్కటి నటుడు. ఈలపాట రఘురామయ్య సన్నిహిత బంధువు. సునందిని 1984 నవంబరులో స్టేషన్ డైరక్టర్‌గా మైసూరులో పదవీబాధ్యతలు స్వీకరించి అదే నెలాఖరులో పదవీ విరమణ చేశారు. ఆమె యిప్పుడు హైదరాబాదులో స్థిరపడ్డారు. చక్కటి వాచకం గల వ్యక్తి సునందిని.

## పండు ధర్మజ్ఞాని :

కృష్ణాజిల్లావాసి అయిన ధర్మజ్ఞాని తొలినాళ్ళలో పనిచేసిన వారిలో ప్రథములు. ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్‌గా చేరి విజయవాడ, హైదారాబాదు, ఢిల్లీ, జమ్మూ, జైపూర్‌లలో పనిచేశారు. బెంగుళూరు కేంద్రం డైరక్టర్‌గా కొంతకాలం పనిచేసి పదవీ విరమణ చేశారు.

### శ్రీ వింజమూరి వరదరాజఅయ్యంగార్ :

సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు వింజమూరి వరదరాజయ్యంగార్ ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో కర్ణాటక సంగీత విభాగం అసిస్టెంట్ ప్రొడ్యూసర్‌గా 1965 నుండి ఒక దశాబ్ది కాలం పని చేశారు. వీరిది గుంటూరుజిల్లా. గాత్ర సంగీతంలో ప్రావీణ్యం సంపాదించిన వీరి నేతృత్వంలో చక్కటి కార్యక్రమాలు రూపొందాయి వీరు 1994 ప్రాంతంలో కాలధర్మం చెందారు. వీరి కుమారులు శ్రీ వి. గోవిందరాజన్ I.A.S ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శిగా వ్యవహారించారు. కేంద్ర ఆర్థిక శాఖలో జాయింట్ సెక్రటరీగా పనిచేస్తున్నారు

### డా. మంచాళ జగన్నాథరావు :

వైణికులుగా జగన్నాథరావు సుప్రసిద్ధులు. వీరి సోదరులు వాగ్దేవ పురుషోత్తం ఆకాశవాణి హైదరాబాదులో కలసి పని చేశారు. జగన్నాథరావు హైదరాబాదు కేంద్రంలో వీణ ఆర్టిస్టుగా చేరి ఆ తర్వాత సంగీత విభాగం ప్రొడ్యూసర్‌గా రెండున్నర దశాబ్దాలు పనిచేశారు. 1984లో రిటైరయ్యారు. జగన్నాథరావు హైదరాబాదులో పరమపదించారు. నేత్రవ్యాధితో వారు బాధపడినా చక్కటి వీణావాదన చేసి శ్రోతల్ని మంత్రముగ్ధుల్ని చేసేవారు. అలహాబాదు పాట్నా కేంద్రాలలో హిందూస్థానీ ప్రొడ్యూసర్‌గా చేశారు. వయొలిన్ విద్వాంసులు మారెళ్ళ కేశవరావు "హైదరాబాదు కేంద్రం గొప్పగా చెప్పుకొనేవారిలో ఒకరు".

### N.S. శ్రీనివాసన్ :

T.S మహాలింగం శిష్యులుగా వేణువాదంలో ప్రసిద్ధులు. శ్రీ N.S శ్రీనివాసన్ ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో వేణుగానం ఆర్టిస్టుగా మూడు దశాబ్దాలు పని చేశారు. సంగీత శాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన శ్రీనివాసన్ అనేక రూపకాలను ఆకాశవాణిలో సమర్పించారు. సంగీత విభాగం ప్రొడ్యూసర్‌గా పని చేసి పదవి విరమణ చేశారు.

వీరి సతీమణి శారదా శ్రీనివాసన్ అద్భుతగాత్ర సౌందర్యంగల వ్యక్తి. ఆమె హైదరాబాదు కేంద్రంలో డ్రామా వాయిస్‌గా మూడు దశాబ్దాలు పైగా పనిచేసి 1996లో రిటైరయ్యారు.

పాలగుమ్మి విశ్వనాథం :

పాలగుమ్మి విశ్వనాథంగారు లలిత సంగీత విభాగం ప్రొడ్యూసర్‌గా హైదరాబాదు కేంద్రంలో రెండు దశాబ్దాలు పనిచేసి 1982లో పదవీ విరమణ చేశారు. కర్ణాటక లలిత సంగీత కచేరీలు నిర్వహించటంలో విశ్వనాథం ప్రవీణులు. వీరు లలిత సంగీతానికి చక్కని ఒరవడి పెట్టారు వీరి సంగీత నిర్వహణలో అనేక కార్యక్రమాలు ప్రసారమయ్యాయి. వీరి తర్వాత M చిత్తరంజన్ ఆ బాధ్యతలు స్వీకరించారు. చిత్తరంజన్ ఈ రంగంలో విశేష కృషి చేస్తున్నారు. వీణ ఆర్టిస్టుగా మొదట చేరారు.

S. రాజారాం :

ప్రముఖ మృదంగ సంగీత విద్వాంసులు రాజారాం. వీరు మైసూరు వాసుదేవాచారి మనుమలు. ఆర్టిస్టుగా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా వివిధ కేంద్రాలలో పని చేశారు. ఢిల్లీలో సంగీత విభాగంలో అసిస్టెంట్ డైరక్టర్‌గా పనిచేశారు. 1981లో హైదరాబాదు కేంద్ర డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించి 1983 జనవరిలో రిటైరయ్యారు. ప్రస్తుతం వీరు మదరాసు కళాక్షేత్రంలో ప్రిన్సిపాల్‌గా ఒక దశాబ్దిగా పనిచేస్తున్నారు. వీరి సోదరులు యస్ కృష్ణమూర్తి మైసూరు కేంద్రం డైరక్టర్‌గా రిటైరయ్యారు.

చెరుకుమిల్లి భాస్కరరావు :

హైదరాబాదు కేంద్రంలో అసిస్టెంట్ ఎడిటర్ (scripts)గా పని చేశారు. రచయిత, కళాకారుడు అయిన భాస్కరరావు దూరదర్శన్ కేంద్రంలో కూడా పని చేశారు.

మొదలి అరుణాచలం :

రాష్ట్ర ప్రభుత్వంలో పనిచేసి హైదరాబాదు ఆకాశవాణి కేంద్రంలో ఫామిలీ వెల్ఫేర్ ఆఫీసరుగా రెండు దశాబ్దాలు పనిచేసి 93లో పదవీ విరమణ చేశారు. కథా రచయిత, రూపక రచయిత అరుణాచలం కుటుంబ సంక్షేమ కార్యక్రమాలు బహుళ జనామోదం పొందడానికి విశేష కృషి చేశారు వీరొక కథల సంపుటి ప్రకటించారు. వీరి కుమార్తె ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా హైదరాబాదులో పని చేస్తున్నారు.

శ్రీమతి తురగా జానకీరాణి :

తురగా కృష్ణమోహన్ హైదరాబాదు వార్తా విభాగాధిపతిగా పనిచేసి అకాల మరణం చెందారు. వారి సతీమణి జానకీరాణి. 1975లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో women & children ప్రొడ్యూసర్‌గా చేరారు. అంతకుముందు రాష్ట్ర

ప్రభుత్వ మహిళా సంక్షేమశాఖలో ఒక దశాబ్దిపైగా పని చేశారు. 75 నుండి 91 వరకు జానకీరాణి ప్రొడ్యూసర్‌గా పని చేశారు. 91 92లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా పదోన్నతి పొందారు. జానకీరాణి రూపొందించిన రూపకం 89లో జాతీయస్థాయిలో బహుమతి పొందింది. నవలా రచయిత, కథా రచయిత రూపక రచయిత అయిన జానకీరాణి గృహలక్ష్మి 'స్వర్ణ' కంకణ బహూకృతిగా పొందారు. అనేక విశిష్ట సన్మానాలు స్వీకరించారు.

## డైరెక్టర్లుగా పని చేసిన కొందరి జీవిత రేఖలు

### సి. రాజగోపాల్ :

1941 జూన్ 3వ జన్మించారు. M A;B.L; పట్టా పొందారు. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా హైదరాబాదులో చేరారు. ASDగా 1982లో UPSCద్వారా నియుక్తులై అదిలాబాద్, విశాఖపట్టణాలలో పనిచేశారు. 1987లో డైరక్టర్‌గా మంగుళూరు కేంద్రంలో పని చేసి అక్కడ నుండి నాగర్కోయిల్ ధార్వాడ్‌లో డైరక్టర్‌గా వ్యవహరించారు. 1992లో బొంబాయిలోని Central Sales Unit డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించారు.

### M.N. రావు :

విశ్వనంధరావుగారు ఏలూరు వాస్తవ్యులు. 1936 జూన్ 18న జన్మించారు. ఎం. ఏ. ఎకనామిక్స్‌లో పట్టా పొంది ప్రభుత్వకళాశాలల్లో 10 సంవత్సరాలు లెక్చరర్‌గా పనిచేశారు. 1983లో UPSC ద్వారా అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా నేరుగా త్రివేంద్రంలో చేరారు అక్కడ నుండి 1984లో హైదరాబాద్ కేంద్రానికి బదిలీ అయ్యారు డైరక్టర్‌గా నిజామాబాద్ కేంద్రంలోపనిచేసి 1994 జూన్‌లో పదవీ విరమణ చేశారు.

### కబీర్ అహమ్మద్ :

కబీర్ అహమ్మద్ హైదరాబాదులో 1940 జులై 30వ జన్మించారు. ఎం.ఏ. పట్టభద్రులు. 1967లో జాతీయస్థాయిలో జరిగిన పోటీలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్ లిస్టులో దేశంలో మొట్టమొదటి స్థానం సంపాదించారు ఆ తర్వాత ప్రొడ్యూసర్‌గా దూరదర్శన్‌లో పనిచేశారు. 1982లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించారు. కొత్తగూడెం, CBS హైదరాబాదు తదితర

రాంతాలలో పనిచేశారు. శ్రీనగర్ రేడియో కేంద్ర డైరక్టర్‌గా 1994లో యుక్తులయ్యారు. ఉర్దూలోను, ఆంగ్లంలోను చక్కటి ప్రవేశం ఉంది. వీరు 1996 నవంబరులో హైదరాబాదు కేంద్రం డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించారు.

.P. గోవర్ధన్ :

1940 మార్చి 9న జన్మించారు. ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా 1963లో ఆకాశవాణిలో చేరారు. 1986లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్ అయ్యారు. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా మదరాసు, హైదరాబాదు, గ్యాంగ్‌టాక్‌లలో పనిచేశారు. కొత్తగూడెం కేంద్రంలో, కర్నూలు కేంద్రంలో ASDగా పనిచేశారు. 1998లో డైరక్టర్‌గా ప్రమోట్ అయి కర్నూలులోనే పనిచేశారు. 1995లో హైదరాబాద్ వివిధ భారతి కేంద్ర డైరక్టర్‌గా పదవీబాధ్యతలు స్వీకరించారు.

శంకరమంచి సత్యం :

S. సత్యనారాయణరావు గుంటూరు జిల్లా - అమరావతిలో జన్మించారు. బి.ఏ.బి.యల్. పట్టాపుచ్చుకొన్నారు. ఆకాశవాణిలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా విజయవాడలో పనిచేశారు. అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా 1978లో బొంబాయి వెళ్ళారు. అక్కడ నుండి డైరక్టర్‌గా రాజస్థాన్‌లోని ఉదయపూర్‌లో నాలుగేళ్ళు పనిచేశారు. 1988లో ఢిల్లీలోని విదేశీ ప్రసార విభాగంలో చేరారు. అదే సంవత్సరం అనారోగ్యంతో ఆయన ఢిల్లీలో మరణించారు. సత్యం శంకరమంచి "అమరావతి కథలు" కథాసంపుటి బహుళ జనామోదం పొందింది. ఆంధ్రజ్యోతి వారపత్రికలో ధారావాహికగా వెలువడి కేంద్రసాహిత్య అకాడమీ బహుమతిపొందింది. ఢిల్లీ దూరదర్శన్ నేషనల్ ఛానల్‌లో ఆ కథలు ప్రసారమయ్యాయి. అమరావతి పరిసరాల వాతావరణాన్ని ఆయన చక్కగా శబ్దచిత్రంలో చూపారు. ఆయన విజయవాడ నుండి ప్రసారం చేసిన హాస్యంహాస్యం ఇతర నాటకాలు శ్రోతల మన్ననలు పొందాయి.

**అహమ్మద్ జలీస్ :**

జలీస్ 1939 అక్టోబరు 21న హైదరాబాదు నగరంలో జన్మించారు. 1975లో UPSC ద్వారా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా చేరి మంచి కార్యక్రమ రూపకల్పనలో పేరుతెచ్చుకొన్నారు. హైదరాబాదు 'నయీరంగ్' ఉర్దూ కార్యక్రమంలో వెయ్యికార్యక్రమాలు ధారావాహిక ప్రసారం చేసి శ్రోతల మెప్పుపొందారు. రేడియో కాశ్మీర్‌లో పనిచేశారు. 89-91 లో బెంగుళూరు CBSలో ASDగా చేశారు. కడప కేంద్రంలో 91-93 మధ్యకాలంలో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా చేశారు. 1993 మార్చిలో డిప్యూటీ డైరక్టర్‌గా బెంగుళూరు దూరదర్శన్ కేంద్రంలో చేరారు. దుర దృష్టవశాత్తు హృద్రోగంతో 1996 మే 10న బెంగుళూరులో కన్నుమూశారు.

**డా. కె.వి. గోపాలం :**

గోపాలాచార్యులు 1956 జూన్ 15న తెలంగాణాలో జన్మించారు. యం.యస్.సి. పట్టభద్రులై, పి.హెచ్.డి. పట్టా ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి పొందారు. ప్రైవేట్ కళాశాలల్లో కొంతకాలం సైన్స్ లెక్చరర్‌గా పనిచేశారు. 1986 జనవరిలో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో సైన్స్ ఆఫీసర్‌గా చేరారు. శాస్త్రీయ కార్యక్రమాల రూపకల్పనలో తనదైన ప్రత్యేకతను చాటుకున్నారు. హైదరాబాదులో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పనిచేశారు. 1993 జూన్ 15న స్టేషన్ డైరక్టర్‌గా అదిలాబాద్ కేంద్రానికి బదలీ అయ్యారు. సైన్సు వింతలు - విశేషాలు తెలియజేస్తూ అనేక వ్యాసాలు వివిధ పత్రికలలో వ్రాశారు. అనేక గ్రంథాలు ప్రచురించారు. సులభంగా పాఠకులకు సైన్సు విశేషాలు తెలియచేయడం ఆయన ప్రత్యేకత.

**డి. ప్రసాదరావు :**

ప్రసాదరావు 1951 ఆగస్టు 14న విజయవాడలో జన్మించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. పట్టభద్రులయ్యారు. 1978లో ఆకాశవాణి కడప కేంద్రంలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరారు. UPSC ద్వారా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అయి జగదల్‌పూర్, హైదరాబాదు కేంద్రాలలో పనిచేశారు. 1991లో UPSC ద్వారా స్టేషన్ డైరక్టర్‌గా సెలక్టుఅయి జగదల్‌పూర్ కేంద్రం అధిపతి అయ్యారు. అక్కడినుండి 1993 లో విశాఖపట్టణ కేంద్రానికి బదలీఅయ్యారు. బహుళజనామోదం పొందే కార్యక్రమాల రూపకల్పనలో ప్రసాదరావు సిద్ధహస్తులు.

# ప్రసార రథం లాగుతున్న యువత

హైదరాబాదు కేంద్రంలో కార్యక్రమ నిర్వాహకులుగా పనిచేస్తూ సాహిత్య ...ృతిక రంగాలలో నిష్ణాతులైన వ్యక్తులు ఎందరో కీర్తి ప్రతిష్ఠలు గడించారు. ...వాణిలో పనిచేసే సదవకాశం వారి ప్రతిభను చాటుకొనేందుకు అవకాశాలు ...చింది.

**పి. మధుసూదనరావు :**

1950 డిసెంబర్ 10న మధుసూదనరావు తెలంగాణాలోని వరంగల్ జిల్లాలో ...చారు. కాకతీయ విశ్వవిద్యాలయం నుండి తెలుగులో ఎం.ఏ. చేశారు. కొమ ...లక్ష్మణరావు రచనలపై పరిశోధన చేసి పి.హెచ్‌డి. పట్టా పొందారు. ట్రాన్స్... ...ఎగ్జిక్యూటివ్‌గా చేరి, ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా హైదరాబాదు, మదరాసు ...లలో పనిచేశారు. 1992లో వరంగల్ కేంద్రానికి అసిస్టెంట్ స్టేషన్ డైర... ...వెళ్లారు. రాష్ట్రప్రభుత్వ నంది అవార్డుల కమిటీలో మధుసూదనరావు 94 ...గా సభ్యులుగా వ్యవహరించారు.

**P. S. గోపాలకృష్ణ :**

పాతాళభేది గోపాలకృష్ణ 1949 జులై 1న తిరుపతిలో జన్మించారు. M.A. ...ద్రులై మదరాసులో పత్రికలలో పనిచేసి ఆకాశవాణిలో 1977లో ప్రోగ్రాం ...క్యూటివ్‌గా మదరాసులో చేరారు. మదరాసు, హైదరాబాదు కేంద్రాలలో పని... ...ను. మైసూరు విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్‌డి. పొందారు. కేంద్ర ...హిత్య అకాడమీ ప్రాంతీయ కార్యదర్శిగా మదరాసు, ఢిల్లీలలో 1983 85 మధ్య ...లో పనిచేశారు. A.S.D.గా విజయవాడ, మదరాసు, హైదరాబాదు కేంద్రాలలో ...2 నుండి అనుభవం గడించారు. గోపాలకృష్ణ మంచి విమర్శకుడు, రచయిత.

**...V. రమణ :**

వెంకటరమణ గుంటూరుజిల్లా నరసారావుపేటలో 1941 జూన్ 21న జన్మిం... ...ు ఎం.ఏ పట్టభద్రులై ఆకాశవాణిలో 1968 జూలైలో చేరారు. విజయవాడ ...ద్రంలో పనిచేసి మదరాసు బదలీ అయ్యారు. 1977లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్... ...యువవాణి కార్యక్రమాలను విజయవాడ కేంద్రంలో రసవత్తరంగా నిర్వ... ...ంచారు. హైదరాబాద్ బదలీ అయి 1993లో అసిస్టెంట్ డైరక్టర్ అయ్యారు. ...95లో బెంగుళూరు దూరదర్శన్‌కు బదలీ అయ్యారు.

S. రమామోహనరావు :

రమామోహనరావు 1941 నవంబరు 10న జన్మించారు. 1967 నుండి ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా బెంగుళూరు, విజయవాడ, మదరాసు కేంద్రాలలో పనిచేసి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ (1976) అయ్యారు. ఆయన స్వయంగా మృదంగ విద్వాంసులు. అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పదోన్నతి పొంది తిరువనంతపురం, బెంగుళూరు కేంద్రాలలో పనిచేశారు.

N. C. నరసింహాచార్యులు :

నల్లాన్ చక్రవర్తుల వంశంలో 1947 జనవరి 2న కృష్ణాజిల్లాలో జన్మించారు. ఎం.ఏ. తెలుగు పట్టభద్రులయ్యారు. 1967 నవంబర్‌లో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా విజయవాడలో చేరారు. 1979లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పదోన్నతి పొంది కడప, హైదరాబాద్ కేంద్రాలలో పనిచేశారు 1993లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పదోన్నతి పొంది మహారాష్ట్రలోని కొల్హాపూర్‌లో పనిచేశారు. 1996లో కొత్తఢిల్లీలోని ఆకాశవాణి కేంద్రానికి బదలీ అయ్యారు. కోఆర్డినేషన్‌లో నరసింహాచార్యులు సిద్ధహస్తులు.

బి.జి.యస్. రావ్ :

బంధకవి గిరిజా శంకరరావు గోదావరి జిల్లాలో 1945 జూన్ 23న జన్మించారు. ఎం.ఎ. పట్టభద్రులై ఆకాశవాణిలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా 1967 సెప్టెంబరులో చేరారు. కడప, లే, జమ్ము, హైదరాబాదు కేంద్రాలలో 1976 నుండి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. 1993లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా హైదరాబాద్ కేంద్రంలో పదోన్నతి పొందారు ఆంగ్లంలో డెక్కన్ క్రానికల్‌లో చాలా వ్యాసాలు వ్రాశారు. డైరక్టరేట్‌లో పనిచేస్తున్న బి. ఆర్. పంతులు వీరికి సన్నిహిత బంధువులు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో సీనియర్ ఐ.ఏ.యస్. అధికారి బి.వి. రామారావు వీరి అగ్రజులు.

చల్లా ప్రసాదరావు :

ప్రసాదరావు కృష్ణాజిల్లాలో 1937 ఆగష్టు 19న జన్మించారు. విజయవాడ కేంద్రంలో ప్రోగ్రాం సెక్రటరీగా 1957లో చేరారు. క్రమంగా ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్ అయి 1976లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అయ్యారు. హైదరాబాదు కేంద్రంలో A.S.D గా రెండేళ్ళు పనిచేసి 1995 ఆగష్టులో పదవీ విరమణచేశారు.

E. L. నారాయణ :

లక్ష్మీనారాయణ కృష్ణాజిల్లాలో జన్మించారు. వ్యవసాయ పట్టభద్రులై రాష్ట్రప్రభుత్వ వ్యవసాయశాఖలో డిమాన్‌స్ట్రేటర్‌గా పనిచేశారు. 1975లో ఆకాశవాణి కడప కేంద్రంలో వ్యవసాయ విభాగంలో రిపోర్టర్‌గా చేరారు. 1980లో ఫారమ్‌రేడియో ఆఫీసర్ అయ్యారు. 1984లో హైదరాబాద్ బదిలీ అయ్యారు. వ్యవసాయ కార్యక్రమ రూపకల్పనలో నేర్పరి. 1993లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా హైదరాబాదులో పదోన్నతి పొందారు. మరో అసిస్టెంట్ డైరక్టర్ K. మల్లికార్జునశర్మ చక్కని రచయిత.

Y. రాఘవులు :

రాఘవులు చక్కటి గాత్రం గల నటుడు. పౌరాణిక పాత్రలలో నటించారు. కొంతకాలం రాష్ట్ర మంత్రి శ్రీ టి. వి. రాఘవులు వద్ద పి. ఏ. గా పనిచేశారు. ప్రొడక్షన్ అసిస్టెంట్‌గా ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో చేరారు. 1983 లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో నాటక విభాగం ప్రొడ్యూసర్‌గా చేరారు. నిజామాబాదులో కొంతకాలం పని చేశారు. 1993లో కొత్తగూడెం కేంద్రానికి అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పదోన్నతిపై వెళ్ళారు.

యం. జనార్ధనరావు :

1945 అక్టోబరు 10న జనార్దనరావు కాళహస్తిలో జన్మించారు. పట్టభద్రులై ఆకాశవాణిలో 1968 డిసెంబరులో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరారు. 1979లో పదోన్నతిపై ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా దూరదర్శన్ హైదరాబాదు కేంద్రంలో చేరారు. 1993లో పదోన్నతిపై అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా అక్కడే చేరారు.

శ్రీమతి ప్రయాగ వేదవతి :

ప్రయాగ నరసింహశాస్త్రిగారి కుమార్తె వేదవతి. వేదవతి 1951 మే 5న మదరాసులో జన్మించారు. ఎం. ఏ. తెలుగు, ఆంగ్లంలో పట్టభద్రులు. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ప్రొడ్యూసర్‌గా చేరారు (1971లో). U.P.S.C. ద్వారా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అయి విశాఖపట్టణం, విజయవాడ కేంద్రాలలో 1980 నుండి పని చేస్తున్నారు. 1993లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పదోన్నతి పొందారు. ఫిబ్రవరి 96 నుండి నిజామాబాదులో అసిస్టెంట్ డైరక్టర్‌గా వ్యవహరిస్తున్నారు.

M. S. S. ప్రసాద్ :

మంగళగిరి ఆదిత్య ప్రసాద్ గుంటూరు జిల్లా రేపల్లెలో 1954 ఆగస్టు 20న జన్మించారు. ఎం. ఏ. పట్టభద్రులయి 1975 ఆగస్టులో U.P.S.C. ద్వారా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అయి విశాఖపట్టణం, కడప కేంద్రాలలో పని చేశారు. వయొలిన్ వాద్యంలో శివప్రసాద్ ప్రావీణ్యం సంపాదించారు. 1993 లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పదోన్నతి పొంది విజయవాడ బదిలీ అయ్యారు.

K. V. హనుమంతరావు :

జానపద సంగీత ప్రయోక్తగా హనుమంతరావు కీర్తి గడించారు. హైదరాబాదు, విజయవాడ కేంద్రాలలో జానపద సంగీత ప్రయోక్తగా ఒక దశాబ్దిపైగా పని చేశారు. 1984లో వీరు రూపొందించిన 'లయ', కృష్ణవేణి రూపకం (85) జాతీయ స్థాయిలో బహుమతి పొందారు.

1984లో వీరి లయ హోసబ క ఫౌండేషన్ జర్మనీవారి అంతర్జాతీయ గుర్తింపు పొందింది. హనుమంతరావు మార్కాపురం కేంద్రం అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా 94–96 మధ్య పనిచేశారు. 96లో దూరదర్శన్ ఇంఫాల్ కేంద్రానికి బదిలీ అయ్యారు. కృష్ణవేణి, శ్రమఏవ జయతే రూపకాలు కూడా జాతీయ బహుమతులు పొందాయి.

ప్రహరాజు పాండురంగారావు :

పాండురంగారావు 1940 జూన్‌లో నరసాపురంలో జన్మించారు. ప్రోగ్రాం సెక్రటరీగా ఆకాశవాణిలోచేరి ట్రాన్స్మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా విజయవాడ కేంద్రంలో నాటక విభాగంలో పనిచేశారు. పాండుగారు నటుడుగా హాస్యవల్లరి కార్యక్రమాలు రూపొందించడంలో సిద్ధహస్తులు. పాండురంగారావు సమర్పించిన నీలినీడలు1980లో జాతీయ బహుమతి పొందింది. పాండురంగారావు 94 నుండి నిజామాబాద్ ఆకాశవాణిలో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పని చేస్తున్నారు.

Y. హనుమంతరావు :

హనుమంతరావు 1938 ఫిబ్రవరిలో కృష్ణాజిల్లాలో జన్మించారు. వ్యవసాయ శాస్త్రంలో బాపట్ల కళాశాలలో పట్టభద్రులై రాష్ట్ర వ్యవసాయశాఖలో పది సంవత్స రాలు డిమాన్‌స్ట్రేటర్‌గా పని చేశారు. 1970 ప్రాంతాలలో ఫారమ్ రేడియో రిపోర్టర్‌గా చేరి తర్వాత ఫారమ్ రేడియో ఆఫీసర్‌గా రెండు దశాబ్దాలు విజయవాడ కేంద్రంతో పని చేశారు. మధ్యలో ఆదిలాబాదు, మార్కాపురంలలో కొంతకాలం పనిచేశారు. 1992లో మార్కాపురం కేంద్రం ప్రారంభమయినపుడు తొలి అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా రెండేళ్ళు పనిచేశారు. అక్కడినుండి 94 నుండి 96 ఫిబ్రవరి వరకు విజయవాడలో పనిచేసి 96 ఫిబ్రవరిలో పదవీ విరమణ చేశారు. ఈనాడు టి. వి. అన్నదాత కార్యక్రమాల ప్రయోక్తగా హైదరాబాద్‌లో చేరారు. హను మంతరావు కౌలాలంపూర్ సందర్శించారు. వీరు రూపొందించిన మధుర క్షణాలు, కాంతి రేఖలు రూపకాలు జాతీయస్థాయి బహుమతి పొందాయి.

డా॥ పుట్టపర్తి నాగపద్మిని :

సుప్రసిద్ధ కవి డా॥ పుట్టపర్తి నారాయణాచార్యుల పుత్రిక నాగపద్మిని. కడపలో 1953 ఆగష్టు 2న జన్మించారు. ఆకాశవాణి కడపలో 1978 లో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరి వివాహానంతరం హైదారాబాదు కేంద్రానికి బదలీ అయి వెళ్ళారు. 1988లో UPSC ద్వారా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా హైదరాబాద్‌లో పనిచేస్తున్నారు. జానపద వాఙ్మయంపై పరిశోధన చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి Ph.D. పొందారు. అనేక వ్యాసాలు, కవితలు, రూపకాలు ప్రచురించారు. మూడు గ్రంథాలు ప్రచురించారు. నారాయణాచార్యుల శివతాండవ రూపకాన్ని ప్రసారం చేసి 1993లో జాతీయ స్థాయిలో బహుమతి పొందారు.

జీడిగుంట రామచంద్రమూర్తి :

కథకుడుగా, సినీ రచయితగా పేరుపొందిన జీడిగుంట రామచంద్రమూర్తి 1970లో హైదరాబాదు కేంద్రంలో రచయితగా చేరారు. చాలాకాలం కుటుంబ సంక్షేమ విభాగానికి అనుబంధంగా పనిచేశారు. 1988లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా కడపలో ఒక సంవత్సరంపైగా పనిచేసి 1989లో హైదరాబాదు బదలీ అయ్యారు. 1991 నుండి 6 సంవత్సరాలు నాటక విభాగాన్ని నిర్వహిస్తూ చక్కటి నాటకాలు రూపొందించారు. నవలా రచయితగా జీడిగుంట ప్రసిద్ధులు. చక్కటి వ్యాఖ్యాత.

సుధామ :

అల్లంరాజు వెంకటరావు 1951 నవంబరు 25న జన్మించారు. చిన్నతనం నుండి (1966 నుండి) బాలబంధులో రచనలు ప్రచురించారు. కార్టూన్ చిత్రకారుడుగా ప్రసిద్ధుడు. యువభారతి సాహితీ సంస్థద్వారా సేవలు చేశారు. 80-81 మధ్యకాలంలో తెలుగు అభ్యుదయ కవిత్వంలో భావచిత్రాలు M.Phil. పట్టాకోసం సమర్పించారు 1983లో ఆకాశవాణి జాతీయ కవి సమ్మేళనంలో తెలుగుకవిగా పాల్గొనడం విశేషం. 1978లో ఆకాశవాణిలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా హైదరాబాదు కేంద్రంలో చేరి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా 91లో విజయవాడ బదలీ అయ్యారు. తిరిగి 95 లో హైదరాబాద్ వెళ్ళారు. వీరి పతీమణి ఉషారాణి కూడా ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్. సుధామ కళాకారుడు, రచయిత, కార్టూనిస్టు. 1990 లో వీరు ప్రచురించిన అగ్నిసుధ గేయకావ్యం ప్రొద్దుటూరులో ఉమ్మిడిశెట్టి కవితా అవార్డు పొందింది. ఉషారాణి 1958 జూలైలో జన్మించారు. 1991 నుండి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా విజయవాడ, హైదరాబాద్‌లలో పనిచేస్తున్నారు.

ఇంకా మంత్రవాది మహేశ్వర్, వసుమతి దంపతులు, శేషం రామానుజాచార్యులు, కలగా కృష్ణమోహన్ కృష్ణమాచారి, రావు చౌదరి, విద్యాలంకార్, అన్నం ఫర్‌షోరి, డా॥ కె. విజయ, డా॥ ప్రసన్న, శైలజామూర్తి, డా॥ P.V. శారద, వినయమణి యింకా ఎందరెందరో ఆ యా రంగాలలో పనిచేసి ఖ్యాతి గడించారు.

అనౌన్సర్లలో డా॥ పండా శమంతకమణి సాహితీ రంగంలో కృషి చేశారు. వీరు రచించిన తెలుగులో రామకథకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి లభించింది. జ్యోత్స్న, ఇలియాస్ అహమ్మద్, రతన్‌ప్రసాద్, 'చిన్నక్క' వట్టం సత్యనారాయణ, (బాలయ్య) మట్టపల్లి రావు, ఇందిర, ఇందిరా బెనర్జీ, ఉమాపతి బాలాంజనేయశర్మ, రాజగోపాల్ రెండు దశాబ్దాలుగా చక్కటి కార్యక్రమాలు రూపొందించి శ్రోతల ప్రశంసలందుకొన్నారు.

# విజయవాడ కేంద్రం

1948 డిసెంబరు 1వ తేది ఆంధ్రుల సాంస్కృతిక కేంద్రమైన విజయవాడలో ఆకాశవాణి నెలకొంది రెవిన్యూమంత్రి శ్రీ కళావెంకట్రావు దాన్ని ప్రారంభించారు. IKW మీడియం వేవ్‌పై ప్రసారాలు సాగేవి ప్రసారశక్తి ఆరువేల చదరపు కిలోమీటర్లు. విజయవాడలో PWD ఎగ్జిక్యూటివ్ యింజనీర్ బంగళాలో ఆరెకరాల స్థలంలో దీన్ని స్థాపించారు. అప్పట్లో బెజవాడ క్లబ్ అక్కడ వుండేది. దాన్ని అద్దెకు తీసుకున్నారు 120 అడుగుల ఎత్తుగల రిలేటవర్ నెలకొల్పారు. N.S. రామచంద్రన్ తొలిస్టేషన్ డైరక్టరు. M. S. నారాయణస్వామి స్టేషన్ యింజనీరు. మదరాసు 'బి' కేంద్రం నుండి తెలుగు కార్యక్రమాలు రిలే చేసేవారు. తర్వాత కొంతకాలానికి 1950 లో డా॥ అయ్యగారి వీరభద్రరావు స్టేషన్ డైరక్టరుగా చేరారు. రెండేళ్ళ పరిపాలనలో ఆయన ప్రసారాలలో నూతనత్వాన్ని కలిగించారు.

సంగీతంలో ఉత్తమ ప్రసారాలు విజయవాడ కేంద్రం నుండి ప్రసారం కావాలని 1948లో లోనే నిలయ విద్వాంసుల్ని నియమించారు. వారిలో ప్రసిద్ధులు శ్రీయుతులు అన్నవరపు రామస్వామి, దండమూడి రామమోహనరావు, N.Ch. కృష్ణమాచార్యులు. కార్యక్రమ నిర్వాహకులుగా ఈ కేంద్రంలో ఎందరో ప్రముఖులు పనిచేశారు సర్వశ్రీ బుచ్చిబాబు, బందా కనకలింగేశ్వరరావు, డా॥ రజనీ కాంతరావు, పింగళి లక్ష్మీకాంతం, G.V. కృష్ణారావు, ఉషశ్రీ, డా॥ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ, సంధ్యావందనం శ్రీనివాసరావు, M.V. రమణమూర్తి, ఉషశ్రీ, ప్రయాగ నరసింహశాస్త్రి, శ్రీ గోపాల్, భక్తవ్రత, శంకరమంచి సత్యం, వోలేటి వెంకటేశ్వర్లు-ఇలా ఎందరో.

ఎన్నో జాతీయ, అంతర్జాతీయ బహుమతుల్ని ఈ కేంద్రం గెలుచుకొంది. గోదావరి నదిపై రూపొందించిన 'కొండనుంచి కడలిదాకా' రూపకానికి రజనికి విద్యా ప్రసారాలలో "హోనబంకా" అవార్డు లభించింది. వ్యవసాయ విభాగంలో Y. హనుమంతరావుకు 'మధురక్షణాలు' నాటకానికి బహుమతి వచ్చింది. శ్రీ గోపాల్ సమర్పించిన విక్రాంతగిరి శిఖరం, అరుణాచల జ్యోతి బహుమతులు పొందాయి. శ్రీ రామం సమర్పించిన నీలినీడలు, నిశ్శబ్దం గమ్యం, మెట్లు, మహా విశ్వ అవార్డులు పొందాయి ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సమర్పించిన అమరావాసం, నర్తనశాల,

నేనుకాని నేను జాతీయస్థాయిలో వన్నెకెక్కాయి. K.V. హనుమంతరావు రూపొందించిన శ్రమఏవజయతే, కృష్ణవేణి ప్రశంసలందుకొన్నాయి. పన్నాల సుబ్రహ్మణ్య భట్ సమర్పించిన నాదబంధం, మార్గబంధం బహుమతులందుకొన్నాయి. కలగాకృష్ణ మోహన్, M. వాసుదేవమూర్తి– ఇలా ఎందరో బహుమతులు పొందారు. 1988లో ఉత్తమస్థాయి సాంకేతిక కేంద్రంగా గుర్తింపు లభించింది.

20 కిలోవాట్ల ప్రసారశక్తికి విజయవాడ కేంద్రస్థాయిని 1957 జనవరి 20న పెంచారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. నీలం సంజీవరెడ్డి ప్రారంభించారు. తొలి నాళ్ళలో స్టేషన్ డైరక్టర్లుగా సర్వశ్రీ M.V. రాజగోపాల్, S.K. బోస్, GPS నాయర్ వ్యవహరించారు.

విజయవాడ కేంద్రం ప్రసారం చేసే భక్తిరంజని బహుళ జనామోదం పొందింది. కూచిపూడి సంప్రదాయానికి ప్రాచుర్యంతెచ్చింది విజయవాడ కేంద్రం. కర్ణాటక సంగీత, లలిత సంగీత కార్యక్రమాలు బాలమురళి, వోలేటి, మల్లిక్, రమణమూర్తి సారథ్యంలో నిర్వహించబడ్డాయి. శ్రీరంగం గోపాలరత్నం సుమధుర గాత్రం ఈ కార్యక్రమాలకు వన్నె తెచ్చింది. 1982 నుండి జానపద సంగీతానికి కూడా పట్టం కట్టి అణగారిపోతున్న జానపదకళలకు ఆదరణ కల్పించింది.

1962 ఆగస్టులో అప్పటి కేంద్ర ప్రసార సమాచార శాఖామాత్యులు డా. బెజవాడ గోపాలరెడ్డి వివిధ భారతి ప్రసారాల'బి' కేంద్రాన్ని ప్రారంభించాయి. 1971 మార్చినుండి వాణిజ్య ప్రసారాలు ఆరంభమయ్యాయి. వ్యవసాయ ప్రసారాలు 1966 జూన్ 7 నుండి ప్రారంభమయ్యాయి. నిడుదవోలులో జరిగిన సభలో నీటి పారుదల శాఖామాత్యులు T.V. రాఘవులు వ్యవసాయ ప్రసారాలు ప్రారంభించారు. గుమ్మలూరు సత్యనారాయణ, కె.వి. సుబ్బారావు, వై. హనుమంతరావు, వ్యవసాయ విభాగానికి అధిపతులుగా మూడు దశాబ్దాలు ఈ కార్యక్రమాలను తీర్చిదిద్దారు. 1995 జూన్‌లో మూడు దశాబ్దాల వార్షికోత్సవాన్ని వ్యవసాయ శాఖామాత్యులు శ్రీ కోటగిరి విద్యాధరరావు బాపట్ల వ్యవసాయ కళాశాలలో జరిగిన సభలో నిర్వహించారు. ఈ విభాగం జాతీయస్థాయిలో ఎన్నో బహుమతులు పొందింది.

రేడియో నాటకానికి విజయవాడ కేంద్రం ప్రాణం పోసింది. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన బందా కనకలింగేశ్వరరావు నాటక ప్రయోక్తగా ఎన్నో ఉత్తమ

'టకాలు ప్రసారం చేశారు. ఆకాశవాణి నుండి నటులెందరో సినీరంగానికి తరలిపోయారు. సర్వశ్రీ చిన్నకోట రామన్నపంతులు, రామచంద్రకాశ్యప, చ్చా పూర్ణానందం, గొల్లపూడి మారుతీరావు, నిర్మల, సుత్తి వీరభద్రరావు, 'టా శ్రీనివాసరావు, బ్రహ్మానందం, ఎ. వి. సుబ్రమణ్యం, గుండు హనుమంతరావు ఎనీనటులు కావడానికి ముందు ఆకాశవాణినటులు. జంధ్యాల ఆకాశవాణి నాటక రచయితగా పేరు పొందారు. ఉత్తమ నాటకాలు ఎన్నో ఈ కేంద్రం నుండి ప్రసారమయ్యాయి. శ్రీనండూరి సుబ్బారావు, సి. రామమోహనరావు, శంకరమంచి సత్యం మంచి నాటకాలు రూపొందించారు.

విజయవాడ ఆకాశవాణి కేంద్ర పరిధిలో గుంటూరుజిల్లా, కృష్ణా, నెల్లూరు, ప్రకాశం, ఉభయగోదావరి, ఖమ్మం జిల్లాలు వచ్చాయి. ఇటీవల తూర్పు గోదావరి విశాఖపట్టణం పరిధిలోకి వెళ్ళింది. కొత్తగూడెం FM కేంద్రం 1989లో ప్రారంభమైన తర్వాత ఖమ్మం జిల్లా ఆ కేంద్ర పరిధిలోకి వెళ్ళింది. మార్కాపురం కేంద్రం ఒంగోలు జిల్లా శ్రోతలకు పరిమితం. 1973వ సంవత్సరంలో రజనిగారి పర్యవేక్షణలో రజతోత్సవాలు వైభవంగా జరిపి రజతోత్సవ సంచికను వెలువరించారు.

విజయవాడ కేంద్రంలో ఎందరో హేమాహేమీలు గత అర్ధశతాబ్ది కాలంలో పనిచేసి ప్రఖ్యాతి గడించారు. సర్వశ్రీ పింగళి లక్ష్మీకాంతం, ఉషశ్రీ, కందుకూరి రామభద్రరావుశ్రీగోపాల్, ప్రయాగ నరసింహశాస్త్రి, N.C.V. జగన్నాధాచార్యులు వింజమూరి శివరామారావు, జపక్శాస్త్రి, G V. కృష్ణారావు, M.S. శ్రీరాం, రాచకొండ నరసింహమూర్తి, కేశవపంతుల నరసింహశాస్త్రి, వింజమూరి లక్ష్మి, డాక్టర్ లత, బుచ్చిబాబు. శ్రీవాత్సవ, నాగరత్నమ్మ, కూచిమంచి కుటుంబరావు ఎందరో మహానుభావులు ఈ కేంద్ర ప్రసారాలను సుసంపన్నం చేశారు.

పున్నమ్మ తోటలోని పాత భవనాల స్థానంలో బందరురోడ్డుపై నూతన కార్యాలయ భవనం, స్టూడియోలు వెలిశాయి. 1980లో ఈ భవనాలలోకి ఆకాశవాణి మారింది. ప్రాంతీయ వార్తా ప్రసార విభాగం 1981లో స్థాపించారు. ప్రతిరోజు దాదాపు 12గంటలు విజయవాడ 'ఎ' కేంద్రం, 12 గంటలు 'బి' కేంద్రంప్రసారాలతో శ్రోతల్ని అలరిస్తున్నాయి. నంబూరులోని ట్రాన్స్‌మిటర్ స్థాయిని 1989లో 20కి వాట్లనుండి 100 కిలోవాట్ల మీడియంవేవ్ శక్తికి పెంచారు. కోస్తా జిల్లాలు తుఫా

తాకిడికి గురిఅయినప్పుడు భారతీయ వాతావరణ కేంద్రం వారు హెచ్చరికలు అందిం చేందుకు అనువుగా యంత్ర పరికరాలను 1986లో అమర్చారు. అవి తుఫాను హెచ్చరికలు అందిస్తాయి. తుఫాను సమయంలో 24 గంటలపాటు-ఆకాశవాణి ప్రసా రాలు జరుపుతుంది.

1976-96 రెండు దశాబ్దాల కాలంలో స్టేషన్ డైరక్టర్లుగా వ్యవహరించిన సర్వశ్రీ పి. శ్రీనివాసన్, పి. ఆర్. రెడ్డి, అయూబ్, కులకర్ణి దుర్గా భాస్కర్, డా. ఆర్. అనంత పద్మనాభరావు, ఆకాశవాణి ప్రసారాలు బహుళజనామోదం పొంద డానికి కృషిచేశారు.

## శ్రీ వోలేటి వెంకటేశ్వర్లు [1928-1989]

ఆకాశవాణి శ్రోతలకూ, సంగీత రసికులకూ విస్తృత పరిచయమున్న మహో విద్వాంసులు శ్రీ వోలేటి. సంగీతాన్ని భక్తి శ్రద్ధలతో, శుద్ధమైన మనస్సుతో ఆస క్తితో పాడిన అరుదైన విద్వాంసుడు శ్రీవోలేటి. వీరి నేతృత్వంలో ప్రసారమైన ఎన్నో సంగీత రూపకాలు, యక్షగానాలు, విజయవాడ రేడియో కేంద్రానికి దేశ వ్యాప్తంగా కీర్తి నార్జించి పెట్టాయి.

వోలేటి గారి జననం 1928 ఆగస్టు 27. తల్లిదండ్రులు నరసింహారావు, అచ్చితామణి. తూర్పుగోదావరి జిల్లా ముమ్మిడివరం స్వగ్రామం. గుడివాడలో చతుర్వేదుల అచ్యుత రామశాస్త్రిగారి వద్ద షుమారు 20 వర్ణాలు నేర్చుకున్నారు. ఆ తర్వాత 1935 సం॥లో కాకినాడకు మకాం మారటంతో వీరి సంగీతాభ్యాసం సుగమమైంది కాకినాడలో శ్రీరామగాన సమాజంలో, ఆరోజుల్లో ఉచిత భోజన వసతి కల్పిస్తూ, సంగీతం నేర్పేవారు. ఆ సంస్థను ఉదారంగా నడిపిన మహనీయుడు కీ॥శే॥ మునుగంటి వేంకట్రావు పంతులుగారు. పది సంవత్సరాల పాటు పంతులు గారి వద్ద సంగీతాభ్యాసం చేశారు శ్రీవోలేటి.

1950 సంవత్సరంలో డా॥శ్రీపాద పినాకపాణి గారి పరిచయంతో వోలేటి గారు 3, 4 సం॥లు సంగీతంలోని మెళుకువల్ని, ముఖ్యంగా తంజావూర్ బాణీని పాణిగారి దగ్గర గ్రహించారు.

1956 సం॥ నుంచి విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో ప్రొడ్యూసర్ గా వుంటూ సంగీతశాఖను సమర్థవంతంగా నిర్వహించారు. వోలేటిగారు మనస్సు పెట్టి

నిర్వహించిన ముఖ్యకార్యక్రమం 'సంగీత శిక్షణ'. మూర్తిత్రయంతోపాటు, పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్, పూచి శ్రీనివాస్ అయ్యంగార్, పొన్నయ పిళ్ళైవంటి విద్వాంసుల కృతులతోనూ, అన్నమాచార్య కీర్తనలు, క్షేత్రయ్య పదాలు, నారాయణ తీర్థులవారి తరంగాలు, సంప్రదాయశైలిలో బోధించారు.

విజయవాడ కేంద్రానికి దేశవ్యాప్తంగా కీర్తి నార్జించి పెట్టిన కార్యక్రమాల్లో 'భక్తిరంజని' ఒకటి. G P.S. నాయర్ గారు డైరక్టర్‌గా వున్న రోజుల్లో, Dr. బాలాంత్రపు రజనీకాంతరావు గారి నేతృత్వంలో, వీరిరువురి ప్రేరణతో 'భక్తిరంజని' కార్యక్రమ రూపకల్పన జరిగింది. ఇందులో త్యాగరాజు దివ్యనామ కీర్తనలు, తూము నరసింహదాసు కీర్తనలు, రామదాసు కీర్తనలు, తరంగాలు, సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనలు, కర్ణాటక సంగీత బాణీలోని మాధుర్యం చెడకుండా, చక్కని సంప్రదాయ శైలిలో పాడించిన ఘనత వోలేటిగారిదే.

కాళహస్తి సంస్థానంలోవుండే మునిపల్లె సుబ్రహ్మణ్యకవి విరచితఆధ్యాత్మ, రామాయణ కీర్తనలు, జొన్నలగడ్డశివశంకరశాస్త్రిగారి ముఖతఃవిని స్వరం నిర్ధారించి ప్రముఖ విద్వాంసుల చేత పాడించటంలో వోలేటి గారు చేసిన కృషి శ్లాఘనీయం. కర్ణాటక సంగీత విద్వాంసుడు సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్, నాట్యాచారులు చింతాకృష్ణమూర్తిగారి లాంటి వారి సహకారంతో శశిరేఖా పరిణయం, రామనాటకం, ఉషాపరిణయం, రుక్మాంగద చరిత్రము, ప్రహ్లాద, హరిశ్చంద్ర, మార్కండేయ లాంటి యక్షగానాలెన్నో రూపకల్పన చెంది వోలేటి గారి కృషిని చాటాయి.

హిందూస్థానీ ఉస్తాదులకు తమ పాట కచేరీలలో, కర్ణాటక సంగీతపు బాణీలో ఒక్కపాటైనా పాడే సంప్రదాయం లేదు. కానీ, కర్ణాటక సంగీత కచేరీలలో చివరి భాగంలో హిందూస్తానీ బాణీలో టుమ్రీ, గజల్, భజన్ పాడే అలవాటు స్థిరంగా నిలిచింది. హిందూస్తానీ బాణీ పాడగలిగే గాయకులు, ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రదేశాలలో చాలామంది వున్నారు.

వోలేటి వారందరిలోనూ మేటి. మరెవ్వరికీ ఆపకడ్ స్వాధీనం కాలేదు. హిందూస్తానీ గాయకులలో అమీర్ ఖాన్, బడేగులాం అలీఖాన్, గులాం అలీ వంటి గాయకులనాదర్శంగా భావించి, చిన్ననాటి నుండి అలవాటైన స్వరజ్ఞానం, గాత్రసౌలభ్యం, తోడురాగా శ్రీవోలేటికి హిందూస్తానీ గాయకులను కూడా అలరింపజేయగలిగిన బాణీ అలవడింది.

వోలేటి గారి కంఠంలో త్రిస్థాయిలూ పలికేవి. పరమ శృతి శుద్ధం. అటూ యిటూ అసియాడని లయ.

ఎంత క్లిష్టమైన సంగతులైనా సునాయాసంగా పలికేవి. పాడుతున్నప్పుడు ముఖవర్చస్సు కొంచెం కూడా మారేదికాదు. గోముఖంలో నుంచి గంగ వెలువడి నట్లు, ఆయన సంగీతం ధారగా వచ్చేది. రాగాలాపనలో మధ్యమ, దురిత కాలపు సంచారాలు అవలీలగా పలికి ఆశ్చర్యం గొలిపేవి.

వోలేటిగారిది ప్రత్యేకమైన సొంత బాణీ.

## బందా కనకలింగేశ్వరరావు 1907-1968

బందా కనకలింగేశ్వరరావు 1907లో కృష్ణాజిల్లా ఆటపాకలో జన్మించారు. మద్రాసులో లా పట్టభద్రులై 1934 నుండి ఏలూరులో కొంతకాలం న్యాయవాద వృత్తి చేశారు. ఏలూరు తాలూకా బోర్డు సభ్యులయ్యారు. నాటకాలు ఆయనకు ఆరవ ప్రాణం. బందా కృష్ణుడు, సారంగధరుడు, బిల్వమంగళుడు పాత్రలలో పేరుతెచ్చుకొన్నారు. ఒకసారి బళ్ళారిలో చిత్రనళీయం నాటక ప్రదర్శనలో బాహుకుడి పాత్ర పోషించారు బందా. బళ్ళారి రాఘవ బందాని బహుధా ప్రదర్శించారు.

బందా పౌరాణిక, చారిత్రక నాటకాలు ఎన్నో ప్రదర్శించారు. వివిధ పాత్రలు పోషించారు. కర్ణుడు, కణ్వుడు, రాముడు, అభిమన్యుడు, సారంగధరుడు, ప్రతాప రుద్రుడు, గిరీశం, అల్లూరి సీతారామరాజు పాత్రలు సమర్థవంతంగా నిర్వహించే వారు. బందా వారి తండ్రి శ్రీశైలంగారు కొల్లేటిలంకలకు కరణం బందరులో బి.ఏ. పూర్తిచేసి, మదరాసు లా చదివారు. ఏలూరులో న్యాయవాదిగా ఉండగా తాలూకా బోర్డు సభ్యులుగా ఎంపికయ్యారు. అప్పుడే ప్రభాత్ థియేటర్స్ పేర ఒక నాటక సమాజం స్థాపించి 40 ఏళ్ళపాటు నాటకరంగ సేవ చేశారు.

1935లో చిత్రసీమ ప్రవేశం చిత్రంగా జరిగింది. ద్రౌపదీ మానసంరక్షణంలో బందా కృష్ణపాత్ర ధరించారు. తర్వాత తర్వాత సారంగధర, కాలచక్రం, పాదుక, బాలనాగమ్మ చిత్రాలలో నటించారు. అక్కడి అలవాట్లు వచ్చక 1942లో తిరిగి ఏలూరు రాక తప్పలేదు. నాటకరంగ పరిశీలన కోసం 1955లో రష్యా, ఫిన్లెండ్, చెకొస్లోవాకియా దేశాలు పర్యటించారు

ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో 1956లో నాటక ప్రయోక్తగా ప్రవేశం చేసి 12 సంవత్సరాల పాటు ఎన్నో నాటకాలు ప్రసారం చేశారు. కూచిపూడి నాట్య సంప్రదాయానికి ఊపిరిపోసింది బందా. కేంద్ర సంగీత నాటక అకాడమీ, ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ సభ్యత్వాలు లభించాయి. అభినవకృష్ణ, నటశేఖర బిరుదులతో సత్కరించారు. ఉత్తమనటుడుగా 1963లో రాష్ట్రపతి అవార్డు పొందారు. రేడియో నాటికలు సంపుటిగా ప్రచురించారు. కూచిపూడి నృత్యంపై వీరి రచన ప్రామాణికం

1968 డిసెంబరు 3న నాటకరంగంలో ధృవతార రాలిపోయింది. ఇప్పటికీ కూచిపూడిలో బందా వర్ధంతి ఏటా జరుగుతుంది. కూచిపూడిలో సిద్దేంద్ర కళాక్షేత్ర నిర్మాణానికి ఆయన కృషి అపారం.

వీరి తర్వాత జ్ఞప్తికి తెచ్చుకోవలసిన వ్యక్తి ఆమంచర్ల గోపాలరావుగారు. వీరు నాటక విభాగ ప్రయోక్తగా విజయవాడలో పనిచేసి పదవీ విరమణ చేశారు. చాలాకాలం మదరాసులో కూడా పనిచేశారు.

## యండమూరి సత్యనారాయణ (శ్రీవాత్సవ) 1913 :

శ్రీవాత్సవగా ప్రసిద్ధి చెందిన యండమూరి సత్యనారాయణ తూర్పుగోదావరి జిల్లా పసలపూడిలో 1913 మే 21న జన్మించారు ఉన్నత విద్యాభ్యాసం గావించిన సత్యనారాయణ ఆకాశవాణిలో విజయవాడ, మదరాసు కేంద్రాలలో కార్యక్రమ నిర్వాహకులుగా చాలాకాలం పని చేశారు. ఆపైన అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా ఢిల్లీ బదలీ అయి వెళ్ళారు.

శ్రీవాత్సవ విమర్శకులుగా పేరు తెచ్చుకొన్నారు. భారతి, జయంతి, ఆంధ్ర పత్రిక తదితర పత్రికలలో సాహిత్య సింహావలోకనాలు ఏటా ప్రచురించేవారు. ఉషఃకిరణాలు, శారదాధ్వజం గ్రంథాలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1966లో బహుమతి ప్రకటించింది తంజావూరు నాయకరాజుల సాహిత్య భాషను శారదా ధ్వజంలో వివరించారు ఆనాటి సాంఘిక సాంస్కృతిక రాజకీయ చారిత్రక స్థితిగతులు ఆయన ఆ గ్రంథంలో విశ్లేషించారు. జలతారు జాబిల్లి పేరుతో బాలలకు ఒక పుస్తకం వ్రాశారు. వయోజన విద్యావ్యాప్తిలో భాగంగా టెలివిజన్ క[illegible] రంగురంగుల పూలు అనే గ్రంథాలు వ్రాశారు. వీరి రచనలకు కేంద్ర [illegible]

పురస్కారం లభించింది. పెళ్లాడే బొమ్మ, తీరని కోరికలు నాటకాలు, నాగరిక, చెట్లు గేయ సంపుటిని రచించారు. వీరు 1968 మార్చిలో ఢిల్లీలో చనిపోయారు. వీరి కుమారులు రామచంద్రరావు జర్నలిస్టుగా విజయవాడలో స్థిరపడ్డారు.

## పింగళి లక్ష్మీకాంతం (1894-1972)

పింగళి లక్ష్మీకాంతంగారు 1894 జనవరి 10న కృష్ణాజిల్లాలో ఆర్తమూరులో జన్మించారు. రేపల్లె, మచిలీపట్నం, మదరాసులలో చదువు పూర్తి చేసుకొని ఎం.ఏ. పూర్తి చేశారు. మచిలీపట్నంలో చదువుకొంటుండగా చెళ్ళపిళ్ళవారి శిష్యరికం లభించింది. కవితాధార ఉవ్వెత్తున లేచింది. బందరులో తాను చదివిన కళాశాలలోనే ఆంధ్ర పండితులుగా చేరారు. కొంతకాలం తర్వాత ఆంధ్ర విశ్వకళా పరిషత్‌లో ఆచార్య పదవి నిర్వహించారు. అక్కడ రిటైరైన తర్వాత శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ అధ్యక్షులుగా వ్యవహరించి 1965 జూన్‌లో పదవీ విరమణ చేశారు.

'తొలకరి' రచనతో కాటూరి వెంకటేశ్వరరావుతో కలిసి జంట కవులుగా వ్యవహరించారు. సౌందరనందము జంటగా వ్రాసి గురువులైన తిరుపతి కవుల కంకితం చేశారు మధుర పండితరాజం, పండితరాయల కవితా మాధుర్యం, సాహిత్య శిల్ప సమీక్ష, ఆంధ్ర సాహిత్య చరిత్ర, గౌతమ వ్యాసములు వీరి రచనలు.

ఆకాశవాణిలో తెలుగు ప్రసంగశాఖ ప్రయోక్తగా వ్యవహరించిన సమయంలో సూక్తి రత్నావళి కార్యక్రమాన్ని తీర్చిదిద్దారు. సరళ వ్యావహారిక భాషలో పదాల మిగళింపు ఆయన సొత్తు. సంస్కృత నాటకాలు ఎన్నో ఆయన సమర్పించారు. ఉత్తమ పరిశోధకులుగా, అధ్యాపకులుగా ఎందరో గురువులను తీర్చి దిద్దిన ఆచార్యుడాయన.

గౌతమ వ్యాసాలు, సంస్కృత వ్యాకరణం తెలుగు సాహిత్య విద్యార్థులకు కరదీపికలు.

'మాబిడిక్' నవలను, 'ఆంగ్ల దేశపు చరిత్ర' అనే చారిత్రక గ్రంథాన్ని అనువదించారు. నటుడుగా ఆయన ప్రసిద్ధుడు. ధర్మరాజు, రాక్షసమంత్రి పాత్రలను సమర్థవంతంగా పోషించేవారు. ప్రాచ్య పాశ్చాత్య విమర్శనా ధోరణులను సమన్వయ పరచి తెలుగులో సాహిత్య విమర్శ చరిత్రకు నాంది ప్రవచనం చేశారు. కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యులుగా, ఆంధ్రప్రదేశ్ అకాడమీ విశిష్ట సభ్యులుగా పనిచేశారు. 1972 జనవరి 10న ఆయన పరమ పదించారు.

G. V. కృష్ణారావు :

గవిని వెంకట కృష్ణారావు గుంటూరు జిల్లా కూచిపూడిలో 1914 లో జన్మించారు. బక్కపలచటి శరీరం, ఆలోచనాత్మకమైన చూపులు, సునిశిత మేధ ఆయన లక్షణాలు. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో పట్టభద్రులై, బెనారస్ హిందూ విశ్వ విద్యాలయంలో ఎం. ఏ. పూర్తి చేశారు. కాశీలో వుండగా మార్క్సు సిద్ధాంతాల ప్రభావం ఆయనపై పడింది. మార్క్సు సిద్ధాంతాల జాడలో 'కావ్యజగత్తు' అనే సాహిత్య గ్రంథం వ్రాశారు.

కాలక్రమేణా యం. యన్. రాయ్ ఉద్యమ ప్రభావానికి లోనయ్యారు. 'విగ్రహవ్యావర్తని' అనే తాత్త్విక సంస్కృత గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు. నాగార్జునాచార్యుని శూన్యవాదాన్ని తెలుసుకోవడానికి ఈ గ్రంథం బాగా ఉపకరిస్తుంది. ప్రాచ్య పాశ్చాత్య తత్వవేత్తల సరణిని కృష్ణారావు ఆకళింపు చేసుకొన్నారు ప్లేటో ఆదర్శ రాజ్యాన్ని కేంద్ర సాహిత్య అకాడమీ వారికి తెలుగులోకి అనువదించారు.

జేగంటలు, కీలుబొమ్మలు, వరూధిని, శివరాత్రి, యుగసంధ్య ఈయన ఇతర కవితలు. బొమ్మ ఏడ్చింది, భిక్షా పాత్ర వంటి నాటికలు 'ఆదర్శ శిఖరాలు' అనే పేరుతో సంపుటిగా వెలువరించారు. కీలుబొమ్మలు నవల బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. దీనిని ఆంగ్లంలోకి అనువదించారు. పాపికొండలు, రాగరేఖలు, జఘనసుందరి వీరి నవలల్లో ప్రసిద్ధాలు. గ్రామీణ జన జీవనాన్ని అద్దంపట్టే కథలు 'చైత్రరథం' పేరుతో సంపుటిగా వేశారు. 'ఉదబిందువులు' యితర రచనల సంపుటి. 'వన్యతోరణం' పేర వ్యాస సంపుటి ప్రకటించారు.

"Studies in Kalapoornodayam" అనే సిద్ధాంత గ్రంథాన్ని పరిశోధనకు సమర్పించి Ph.D. పట్టా మదరాసు విశ్వ విద్యాలయం నుండి పొందారు. పింగళి సూరనపై యిది యిప్పటికీ అత్యుత్తమ పరిశోధనా గ్రంథం. తత్వవేత్త అయిన కొంట్ పరతత్వ వాదాన్ని ఆయన సునిశితంగా పరిశీలించారు.

పొన్నూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా కృష్ణారావు సాహితీసేవ చేశారు. ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో 1963 నుండి ఒక దశాబ్దిపాటు ప్రసంగ శాఖలో అసిస్టెంట్ ప్రొడ్యూసర్‌గా పని చేశారు. ఆంధ్ర విశ్వ విద్యాలయ పాలకవర్గ సభ్యుడుగా వ్యవహరించారు. 1978 ఆగస్టు 23 న కృష్ణారావు పరమపదించారు.

నవలా రచయితగా, కథా రచయితగా, వ్యాసకర్తగా, ప్రసార ప్రముఖునిగా సంస్కృతాధ్యాపకుడుగా, తత్వవేత్తగా బహుముఖ ప్రజ్ఞాశాలి కృష్ణారావు.

## డా. బాలాంత్రపు రజనీకాంతరావు (1920)

జంట కవులైన వెంకట పార్వతీశ్వర కవులలో ఒకరైన వెంకటరావుగారి కుమారులు రజనీకాంతారావు. 'రజని'గా పిలవబడే వీరు 1920 జనవరి 29న జన్మించారు. బాలాంత్రపు నళినీ కాంతారావు వీరి అగ్రజులు. రజని ఆంధ్ర విశ్వ కళాపరిషత్ నుండి1940లో ఎం.ఏ. తెలుగులో చేశారు. పింగళి లక్ష్మీకాంతంగారు వీరిగురువులు. దేవులపల్లివారు ఆత్మీయ మిత్రులు.

రజని 'శతపత్ర సుందరి' గీత సంపుటి. రెండు వందలపైగా గీతాలున్నాయి. ఈ గ్రంథానికి 1953లో తెలుగు భాషా సమితి పురస్కారం లభించింది. 'విశ్వవీణ' రేడియో నాటకాల సంకలనం. ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్ర ఉత్తమ పరిశోధనా గ్రంథం. 1958లో తెలుగుభాషా సమితి పోటీలలో ఈ గ్రంథం బహుమతి పొందింది. 1961 లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం వీరికి లభించింది.

ఎన్నో గేయ నాటకాలు, సంగీత రూపకాలు రజని రసమధురంగా రచించారు. చండీదాసు, మేఘసందేశం, మధురానగరిగాథ, సుభద్రార్జునీయం వీరి సంగీత రూపకాలలో ప్రసిద్ధాలు. రేడియోకోసం రజని వందలాది గీతాలను రచించారు. స్వరకర్తగా ఆయన ప్రసిద్ధులు. క్షీరసాగర మథనం, విప్రనారాయణ రూపకాలకు గీతాలు సంగీతం సమకూర్చారు. 'కొండనుండి కడలిదాకా' రూపకం సమర్పించి అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. జపాన్ దేశానికి చెందిన టోక్యో బహుమతి ఈ రూపకానికి 1972లో లభించింది, గేయకవిగా, సినీగాయకుడుగా రజని ప్రసిద్ధుడు. 1977లో మేఘసందేశరూపకానికి బెంగుళూరులో ఉండగా ఉత్తమ సంగీత రూపక బహుమతి లభించింది.

భానుమతి, రజని కలిసి పాడిన పాటలు చిత్రసీమలో గణన కెక్కాయి. ప్రోగ్రాం అసిస్టెంట్‌గా మదరాసులో 1944లో చేరి బెంగుళూరు కేంద్రంలో 1978 జనవరిలో స్టేషన్ డైరక్టరుగా పదవీ విరమణ చేశారు. 1988 నుండి 90 వరకు తెలుగు విశ్వ విద్యాలయం రాజమండ్రిలో గౌరవాచార్యులుగా పనిచేశారు. 1979 నుండి 82 వరకు తిరుమల తిరుపతి దేవస్థానం వారి వెంకటేశ్వర కళాపీఠం డైరక్టరుగా వ్యవహరించారు. అకాశవాణి, దూరదర్శన్‌లకు ఎమిరటస్ ప్రొడ్యూసర్‌గా 1982 నుండి 85 వరకు పనిచేశారు. ఏది చేసినా రజని ముద్ర ప్రత్యేకం స్వర్గసీమ, గృహప్రవేశం ఇత్యాదిచిత్రాలకు పాడారు.

1944 మేలో ఆకాశవాణి మదరాసు కేంద్రంలో కార్యక్రమ నిర్వాహకులుగ రారు. 1966లో అసిస్టెంట్ డైరక్టరుగా పదోన్నతిపై పశ్చిమ బెంగాలులోని ర్సియాంగ్ స్టేషన్‌కెళ్ళారు. కర్సియాంగ్ నుండి ఢిల్లీలోని ట్రాన్స్క్రిప్షన్ సర్వీ ఎలో చేరారు. 1970లో స్టేషన్ డైరక్టరై అహమ్మదాబాదు వెళ్ళారు. 1971 నుండి 5 వరకు విజయవాడ కేంద్రం డైరక్టరు. 76 నుండి 78 జనవరి వరకు బెంగుళూరు ంద్ర డైరక్టరుగా పని చేసి జనవరి 31న రిటైరయ్యారు.

వీరి రచనలు జేజిమామయ్య పాటలు చిన్న పిల్లలకు నర్సరీ గీతాలు. విశ్వ ులలో తాము రచించిన సంగీత రూపకాలు 1964లో ప్రచురించారు. త్యాగరాజు, ్యామశాస్త్రి జీవిత గ్రంథాలను ప్రచురించారు. తండ్రిగారి ఏకాంత సేవకు ఆంగ్లంలో lone with spouse divine అనువాదం చేశారు. కేంద్ర సాహిత్య అకాదమి రికి క్షేత్రయ్యపై ఆంగ్లంలో(Amourse of the Divine cowherd) గ్రంథం ాశారు. మువ్వగోపాల పదాలను ఆంగ్లంలోకి అనువదించారు. ఆంధ్రవిశ్వవిద్యా ులయం కళాప్రపూర్ణ బిరుదంతో(1980), నాదసుధార్ణవ బిరుదంతో మదరాసు మురళీ పశిఆర్ట్ అకాదమీ వీరిని సత్కరించాయి.

## డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ :

పారుపల్లి రామకృష్ణయ్య పంతులు శిష్యులలో అగ్రగణ్యులు మంగళంపల్లి ాలమురళీకృష్ణ. బాలమురళి 1930 జూలై 6న తూర్పుగోదావరి జిల్లా శంకర ప్తంలో పట్టాభిరామయ్యగారికి జన్మించారు తండ్రి ప్రసిద్ధ సంగీత విద్వాంసులు. వారివద్ద శిక్షణ పూర్తిచేసుకొని విజయవాడలో పారుపల్లి రామకృష్ణయ్య పంతులు వద్ద విద్యాభ్యాసానికి చేరారు ఆయన బాలగంధర్వుడు. చిన్నతనం నుండి సంగీతంలో ప్రావీణ్యం చూపారు. కర్ణాటక సంగీతంలో 8వ ఏట సంగీత కచేరీ నిర్వహించిన సిద్ధ.

వయొలిన్, వయోల, మృదంగ వాదనలలో ప్రావీణ్యం సంపాదించారు. 1965వ సంవత్సరం ఆకాశవాణి, మదరాసు, విజయవాడలలో సంగీతశాఖ ప్రొడ్యూ సర్‌గా పనిచేసి విశిష్ట సేవలు చేశారు ఆ తర్వాత రాజీనామా చేశారు. విజయవాడలో ప్రభుత్వ సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా కొంతకాలం పనిచేశారు.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులుగా వ్యవహరించారు. 1966 నుండి విదేశాలలో సంగీతసభలు దిగ్విజయంగా జరిపారు. 1943లో ఆయనకు 13వ ఏట ఆంధ్ర సారస్వత పరిషత్ గాన సుధాకర బిరుదు నిచ్చినది. 1971 లో భారత ప్రభుత్వం పద్మశ్రీ యిచ్చింది. ఆ తర్వాత పద్మభూషణ బిరుదంతో సత్కరించింది. ఎన్నో విశ్వవిద్యాలయాలు డాక్టరేట్ పట్ట సత్కారం చేశాయి, తెలుగు విశ్వవిద్యాలయానికి 1993 లో ప్రొ ఛాన్సలర్ గా వ్యవహరించారు. అకాడమీల రద్దుకు నిరసనగా బాలమురళి సంగీత కచేరీలు ఆంధ్రదేశంలో కొంతకాలం చేయ లేదు. ఆ తర్వాత మళ్ళీ కచేరీలు మొదలెట్టారు.

'సంగీత' కంపెనీవారికి నూరు క్యాసెట్లు రికార్డుచేసి ఒక రికార్డు సృష్టించారు. సినిమాలలో అనేక పాత్రలు ధరించారు. అనేక చిత్రాలకు నేపథ్య సంగీతమూ, సంగీత దర్శకత్వమూ నిర్వహించారు. తమిళ, తెలుగు, కన్నడ, మలయాళ, హిందీ చిత్రాలకు పనిచేశారు. రేడియో, టెలివిజన్ వారికోసం బెంగాలీలో రవీంద్ర సంగీతం పాడి రికార్డు చేశారు. భక్తప్రహ్లాద చిత్రంలో నారదపాత్ర ప్రముఖం.

గాయకశిఖామణి, వాగ్గేయకార వాచస్పతి, సంగీత మహోపాధ్యాయ, సం గీత సార్వభౌమ, సంగీత భూపతి, గాన సుధాకర, నాద సుధార్ణవ వంటి బిరుదులెన్నో వారి నలంకరించాయి. మదరాసులోని సంగీత అకాడమీ 1979లో 'సంగీత కళానిధి' బిరుదు ప్రదానం చేసింది, విజయవాడ పురపాలక సంఘం పౌర సన్మానంచేసి వీరి పేర ఒక వీధికి నామకరణం చేశారు. తమిళనాడు ప్రభుత్వానికి, తిరుమల తిరుపతి దేవస్థానానికి ఆయన ఆస్థాన విద్వాంసులు. అమెరికా, కెనడా, బ్రిటన్, ఇటలీ, ఫ్రాన్సు, రష్యా, మలేషియా, శ్రీలంక, సింగపూర్, మధ్య ప్రాచ్య దేశాలు విరివిగా పర్యటించి కచేరీలు యిచ్చారు ఎన్నో కొత్త రాగాలకు సృష్టికర్త అయ్యారు. 400 కృతులు రచించారు. మేళకర్త రాగాలు సృష్టించారు. సంగీతం ద్వారా రోగ నివారణకు కృషిచేస్తున్న బాలమురళి బహుముఖ ప్రజ్ఞాశాలి.

## ఉషశ్రీ (1928-1990)

'ఉషశ్రీ' అనబడే పురాణపండ సూర్యప్రకాశ దీక్షితులు 1928లో కాకరపర్రులో జన్మించారు. తండ్రి పురాణపండ రామమూర్తికి 'గురువు'గారని పశ్చిమ గోదావరి జిల్లాలో మంచిపేరు. గజారోహణం, స్వర్ణశతక సన్మానం పొందిన ప్రసిద్ధ పౌరాణికులు రామమూర్తిగారు. వారి కుమారులలో రాధాకృష్ణమూర్తి రాజమండ్రిలో ప్రవచనాలు చేస్తూ యశస్సు సంపాదించారు. రంగనాథ్ జర్నలిస్టుగా, నాటక రచయితగా పేరు తెచ్చుకొన్నారు.

ఉషశ్రీ అందరిలోకి పెద్ద కుమారుడు. ఆలమూరు, భీమవరం, కాకినాడలో విద్య గడించారు. విశ్వనాథకు ప్రియ శిష్యుడుగా పేరు తెచ్చుకొన్నారు. రచయితగా పేరు గడించారు. ఉద్యోగపర్వం 1961లో హైదరాబాదులో ఆంధ్రజ్యోతి దిన పత్రికలో సబ్ ఎడిటర్‌గా ఆరంభమైంది

1965లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో చేరారు ఆ తర్వాత సీనియర్ స్క్రిప్ట్ రచయితగా విజయవాడ బదలీ అయ్యారు. పురాణ ప్రవచనంలో తనకు తానే సాటిగా, గంభీర స్వరంతో 'ధర్మ సందేహాలు' కార్యక్రమం దశాబ్దిపైగా నిర్వహించారు. రామాయణ, భారత, భాగవతాలను అరటిపండు వొలిచినట్లు ఒక దశాబ్ది (1974-84) ప్రవచించి ప్రసంగాలకు కొత్త వొరవడి తెచ్చారు. వ్యావహారిక శైలికి భాష్యం చెప్పారు.

1975 లో తెలుగు ప్రసంగ శాఖ ప్రయోక్తగా విజయవాడలో పదోన్నతి పొంది 1986లో రిటైరయ్యేంతవరకు ఆ పదవిలో కొనసాగారు. జ్వలితజ్వాల, అమృతకలశం, మల్లిపందిరి, రాగహృదయం ఆయన రచనలు. రామాయణ, భారత, భాగవతాలను వచన రూపంలో తిరుపతి దేవస్థానం వారు ప్రచురించారు. వ్యాఖ్యాతగా ఆయనకాయనేసాటి. హేతువాద దృష్టితో పురాణాలకు భాష్యం చెప్పే తీరు ఆబాలగోపాలాన్ని మైమరపింప జేసేది.

రేడియో కళాకారులలో మిమిక్రీ చేయడంతో ఉషశ్రీని [illegible]గా ఎన్నుకొనేవారు. 1990 సెప్టెంబరులో ఆయన గళం మూగవోయింది.

## గుమ్మలూరి సత్యనారాయణ

వ్యవసాయ ప్రసారాలకు నాంది ప్రవచనం చేసిన ప్రముఖులలో శ్రీ గుమ్మలూరి సత్యనారాయణ ఆద్యులు. 1966 జూన్‌లో తొలకరినాడు విజయవాడ కేంద్రం నుండి వ్యవసాయ కార్యక్రమాలు 'పంటసీమలు' పేర ప్రారంభించబడ్డాయి. సత్యనారాయణ ఆ కార్యక్రమాల తొలి ప్రయోక్త. అప్పటికే ఆయన రాష్ట్ర ప్రభుత్వ వ్యవసాయ శాఖలో మూడు దశాబ్దాలు (1937–66) పనిచేశారు. పాడిపంటలు మాసపత్రికలో కొంతకాలం పనిచేశారు. రాష్ట్ర వ్యవసాయ సమాచార విభాగాధికారిగా, బాపట్ల వ్యవసాయ కళాశాలలో ఉపన్యాసకులుగా, మదరాసులో స్పెషల్ వెజిటబుల్ డెమాన్‌స్ట్రేటర్‌గా సామర్లకోట ఫారం మేనేజరుగా వ్యవహరించారు.

1911 జూన్ 3న శ్రీకాకుళంజిల్లా సంగం అగ్రహారంలో సత్యనారాయణ జన్మించారు. కోయంబత్తూరు వ్యవసాయ కళాశాల నుండి 1934లో వ్యవసాయ పట్టభద్రులై కొంతకాలం శాంతినికేతన్‌లో రవీంద్ర కవీంద్రుని అంతేవాసిగా చేరారు.

ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో 1966-69 మధ్యకాలంలో వ్యవసాయ కార్యక్రమాల ప్రయోక్తగా పనిచేశారు. 1955-59 మధ్యకాలంలో హైదరాబాదులో పంచవర్ష ప్రణాళిక ప్రాంతీయ ప్రచారాధికారిగా కార్యభారం నిర్వహించారు. 1970 నుండి సర్వారాయ షుగర్స్, చెల్లూరులో చెరకు ఆఫీసరుగా విశిష్ట కృషి చేశారు. 15 సం. పైగా యిక్కడ పనిచేశారు. 1979లో అమెరికా, ఇంగ్లాండు దేశాలు, 1981లో మలేషియా పర్యటించారు. 1980లో శాస్త్రీయ విజ్ఞాన సమితి కాకినాడలో స్థాపించారు.

సత్యనారాయణ గ్రంథకర్తకూడా. 1975లో 'డెల్టా శిల్పి-ఆర్థర్ కాటన్' అనే గ్రంథం వ్రాశారు. 'రామాయణ హితోపదేశం' పేర రామాయణ రహస్యాలను వెలువరించారు. 'నేటి రైతాంగం' పేర 1969నుండి ఆంధ్రప్రభ దినపత్రికలో ధారావాహిక వ్యాసాలు ప్రచురించారు. మాలి, చిన్నయ చెరువు, బ్రతుకు తెరువు, కళ్ళాపి నాటకములు వ్రాశారు. హాలిక సూక్తులు శతకం వెలువరించారు.

పశ్చిమ గోదావరి జిల్లా కృషిక్ సమాజ్ సంస్థవారు వ్యవసాయ కళోద్ధారక బిరుదంతో సత్కరించారు. కొత్తగూడెం ఆకాశవాణి కేంద్రంవారి కోరిక మేరకు వీరు రచించిన 'గోదావరికిన్నెర' రూపకానికి జాతీయస్థాయి పోటీలలో 1990 సం॥ బహుమతి లభించింది. సహస్రమాసోప జీవియైన గుమ్మలూరు చరమ జీవితాన్ని హైదరాబాదులో గడుపుతున్నారు.

**డా. లత**

'లత'గా సాహితీలోకానికి సుపరిచితురాలైన హేమలత విజయవాడ సమీపంలోని నిమ్మలూరులో జన్మించారు. నవలా, కథా రచయిత్రిగా ఆమె ప్రఖ్యాతి గడించారు. 116 నవలలు వ్రాసి ఆనాటి యువతరాన్ని స్వేచ్ఛాప్రణయ గాథలతో ఉర్రూత లూగించారు. 'వంశీ' కలం పేరుతో ఆమె కథలు, నవలలు వ్రాశారు. రేడియో నాటికలు, నాటకాలు, సాహిత్య వ్యాసాలు, కవితలు వ్రాశారు. 'లత సాహిత్యం' ఆనాటి మధ్యతరగతి యువకుల్ని బాగా ప్రభావితం చేసింది. ఆమె స్వతంత్ర భావాలు భవిష్యద్దర్శనానికి ప్రతీకలు. తాను నమ్మినది నిర్భయంగా నిష్కర్షగా చెప్పగల, వ్రాయగల రచయిత్రిగా ఆమెకు పేరు.

1977లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు ఆమెను గౌరవ డాక్టరేట్ పట్టాతో సత్కరించారు. తెలుగు విశ్వ విద్యాలయం 1996వ సంవత్సరంలో సాహితీ పురస్కారంతో సన్మానించింది. వంశీ విజ్ఞానపీఠం వారు అక్షరూపాయల విజ్ఞాన పురస్కారంతో ఆమెను గౌరవించారు.

చలాన్ని తలపించే ఆమె రచనలు ఒక్కొక్కసారి విశ్వనాథను కూడా ప్రశ్నించేవిగా వుండేవని జ్ఞానపీఠ బహుమతి గ్రహీత డా. సి. నారాయణరెడ్డి లత సాహిత్యం గురించి వ్యాఖ్యానించారు. ఆమె మోహన వంశీ నవలను చదివి ప్రభావితమై వంశీ సాంస్కృతిక సంస్థను 25 సం॥ల క్రితం స్థాపించారు. స్త్రీల సమస్యలను ఆధునిక భావాలతో పరిశీలనాదృష్టితో అధ్యయనం చేయటం లత సొత్తు అని డా. వాసిరెడ్డి సీతాదేవి ప్రశంసించారు. ఆకాశవాణిలో తనదంటూ ప్రత్యేకతను నిలుపుకున్న లత ఆధునికాంధ్ర సాహిత్యంలో మణిపూస.

తెన్నేటి హేమలత ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో 1955 నుండి ఒక దశాబ్దికాలం అనౌన్సరుగా పనిచేసి పదవీవిరమణ చేశారు. 58 వసంతాలు చూసిన లత విజయవాడలో స్థిరపడ్డారు. గోపీచంద్ అవార్డు, సుశీలా, నారాయణరెడ్డి అవార్డు, తిక్కన అవార్డు, గృహలక్ష్మి స్వర్ణ కంకణం (1963) ఆమె కీర్తి కిరీటంలో పొదిగిన మణులు. 1963లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి సభ్యురాలుగా నామినేట్ చేయబడి ఉపాధ్యక్షురాలుగా కొంతకాలం పనిచేశారు. బిలాస్‌పూర్ ఆంధ్ర సంఘంవారు గండపెండేరంతో 'లత'ను సత్కరించారు. స్వర్ణసీత, ప్రేమ రాహిత్యంలో స్త్రీ, రామాయణ విషవృక్ష ఖండనం 'లత' రచనల్లో విశిష్టాలు.

## శ్రీ గోపాల్ (1938-1986) :

కొంపెల్ల గోపాలకృష్ణమూర్తి 1938 సం॥ జనవరి 20వ తేదీన కాకినాడలో జన్మించారు. మదరాసు విశ్వవిద్యాలయం నుండి M.A. ఫిలాసఫీలో స్వర్ణపతకాన్ని పొందారు. ప్రతిభా వ్యుత్పత్తులు కలిగి 'శ్రీగోపాల్'గా ప్రసిద్ధులయ్యారు. 1963లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రములో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా సెలక్టు అయ్యారు. అంతకుముందు ఫ్రీలాన్స్ రాజకీయ కార్టూనిస్టుగా పనిచేశారు

తర్వాత వివిధ హోదాలలో ఆకాశవాణి మదరాసు, పోర్ట్‌బ్లెయర్, గోవా, విజయవాడ, కడప కేంద్రాలలో పనిచేశారు. శ్రవ్య మాధ్యమంలో శక్తిని గ్రహించి అనేక రూపకాలు, నాటకాలు రూపొందించి ప్రసారం చేశారు. యువవాణి విభాగం అధిపతిగా యువశక్తికి ప్రోత్సాహం కలిగించారు.

ఆకాశవాణి వార్షిక పోటీలలో నాలుగు బహుమతులు శ్రీ గోపాల్ పొందడం విశేషం. టెన్సింగ్ ఎవరెస్టు శిఖరారోహణను గూర్చి విద్యా ప్రసారాలలో 'ఆక్రాంత గిరిశిఖరం' అనే రూపకం ప్రసారం చేశారు. 1974వ సంవత్సరంలో ఆ రూపకానికి జాతీయస్థాయిలో ప్రథమ బహుమతి లభించింది. భగవాన్ రమణ మహర్షిపై యువవాణి విభాగంలో సమర్పించిన రూపకానికి బహుమతి లభించింది. 'కొండ నుండి కడలిదాకా' అనే రూపకాన్ని గోదావరి నదిపై రజనీ నిర్వహణలో శ్రీ గోపాల్ ఒక రూపకం ప్రసారం చేసి ప్రశంసా బహుమతులందారు. చలం నవల 'మార్తా' ఆధారంగా 'పూర్ణమానవుడు' అనే రేడియో నాటకాన్ని రూపొందించి వార్షిక పోటీలలో బహుమతి పొందారు. 1979వ సంవత్సరంలో ఢిల్లీలో జరిగిన ఇండో అమెరికన్ డ్రామా ప్రొడ్యూసర్ల సెమినార్‌కి ఆంధ్రరాష్ట్రం నుండి శ్రీ గోపాల్ ప్రతినిధిగా ఎంపికయ్యారు.

రేడియో కార్యక్రమాల రూపశిల్పిగానే గాక రచయితగా, కార్టూనిస్ట్‌గా, చలనచిత్ర నటుడుగా, ఫ్రీలాన్స్ జర్నలిస్టుగా శ్రీ గోపాల్ తన ప్రత్యేకతను నిల్పుకొన్నారు.

జాతీయస్థాయిలో గుర్తింపు పొందిన శంకరాభరణం చిత్రంలో సంగీతం మేష్టారు 'దాసు'గా శ్రీ గోపాల్ పాత్రపోషణ ప్రేక్షకులకు చిరకాలం గుర్తుంటుంది. ఇంకా మంచుపల్లకి, స్వాతిముత్యం, ఆలాపన, తాయారమ్మ-బంగారయ్య చిత్రాలలో కూడా ఆయన నటించారు.

1979 నుండి 82 వరకు హైదరాబాదు దూరదర్శన్ కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా ఎన్నో కార్యక్రమాలు రూపొందించారు. కడప ఆకాశవాణిలో పనిచేస్తూ అనారోగ్యంతో 1986 సం॥ మే 18న హైదరాబాద్‌లో శ్రీ గోపాల్ తనువు చాలించారు.

## ్లిక్ (1921-1996)

1921లో బందరులో జన్మించిన కందుల మల్లికార్జునరావు చక్కటి సంగీత ్యాంసులు. లలిత సంగీత విభాగంలో జానపద సంగీతంలో తన ప్రత్యేకతను ుకొన్నారు. మచిలీపట్నంలో క్రోవి సత్యనారాయణ వద్ద సంగీత విద్యాభ్యాసం ంచారు. 1942లో ఆకాశవాణి మదరాసు కేంద్రంలో లలితసంగీత గాయకులుగా ఆ తరువాత విజయవాడ కేంద్రానికి 1972లో బదిలీపై వచ్చారు లలిత సంగీత గంలో సీనియర్ గ్రేడ్ మ్యూజిక్ కంపోజర్‌గా పనిచేశారు. సినీరంగంలో కొంత ం పనిచేసి కీర్తి గడించారు. వెంపటి చినసత్యంగారితో కలిసి నృత్య నాటికలకు ంతం సమకూర్చారు. జానపద, శాస్త్రీయ సంగీతాలలో ఆయన తనదైన బాణీ ుకొన్నారు. భక్తిరంజని కార్యక్రమాలకు వీరు నాంది పెట్టారు.

ఆయన మదరాసు, హైదరాబాదు, విజయవాడ కేంద్రాలలో 38 సంవత్సరాలు ాంతంగా పనిచేసి, 1981లో పదవీ విరమణ చేశారు.

'అదిగో అల్లదిగో హరివాసము', 'తందనాన, భళా తందనాన' అన్నమా ్య కీర్తనలు వీరు పాడి శ్రోతలను మంత్రముగ్ధులను చేసేవారు. రజనీకాంత ుగారి పర్యవేక్షణలో మదరాసు కేంద్రంలో లలితసంగీత విభాగంలో పనిచేసి తర్వాత విజయవాడకు బదిలీ అయ్యారు. జానపద, లలిత సంగీత బాణీలలో తన ముద్ర వేసి పాడేవారు. స్వరపరచేవారు. ఎన్నో సంగీత, నృత్యరూపకాలకు ంతం సమకూర్చారు.

కలకత్తాలోని పంకజ్ మల్లిక్ చాలా ప్రసిద్ధుడు. ఆ పేరుతో 'మల్లిక్' ుతలోకానికి పరిచితులు. లలిత సంగీతం ఆడిషన్ బోర్డు మెంబరుగా ఆకాశ ికి సలహా సంప్రదింపులు అందించారు.

మల్లిక్ బంగారుపాప, భాగ్యరేఖ, వింధ్యరాణి, సంపూర్ణ రామాయణం, శబరి, జయభేరి, చరణదాసి చిత్రాలలో పాడారు. తమిళ చలనచిత్రరంగంలో ) నేపథ్యగాయకుడు మల్లిక్ అంటే ఆశ్చర్యం కలుగుతుంది. చంద్రలేఖ అనే ుచిత్రానికి తొలిసారిగా నేపథ్యగానం చేశారు.

1952 నుంచి 1993 వరకు తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన విద్వాం ుగా వ్యవహరించారు. ప్రతియేటా అన్నమాచార్య ఉత్సవాలలో పాల్గొన్నారు. ునకు వెంకటేశ్వరునిపై అపార భక్తిప్రపత్తులు. అందుకేనేమో 1996 ఏప్రిల్ ి శనివారం 76వ ఏట విజయవాడలో ఆయన సునాయాస మరణం ంచారు.

## వింజమూరి శివరామారావు (1908-82)

శివరామారావు పిఠాపురం తాలూకా చంద్రపాళెంలో 15-5-1908లో జన్మించారు. ప్రముఖ అభ్యుదయ కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి వీరి మేనమామ. శివరామారావు కలం పేరు 'గౌతమి'.

శివరామారావు ఆకాశవాణిలో రెండు దశాబ్దాలు (1949-68) స్క్రిప్ట్ రైటరుగా విజయవాడ కేంద్రంలో పనిచేశారు. ఆకాశవాణిలో చేరడానికి ముందు పత్రికలలో పనిచేశారు. 'జ్వాల' పత్రికలోను, నవోదయ పత్రికలోను సహాయ సంపాదకులుగా వ్యవహరించారు. పద్యాలను, గేయాలను, రూపకాలను సమప్రతిభతో వ్రాయగల నేర్పరి. ఆకాశవాణికి ఎన్నో లలిత గీతాలను, రూపకాలను వ్రాసి ప్రసారం చేశారు. 600 రేడియో నాటికలు వ్రాశారు. ఈయన అనువాద రచనలో కూడ సమర్థులు. అమరుకం, మొపాసా కథలు, గోర్కీ కథలు వీరి అనువాద సామర్థ్యాన్ని చాటిచెబుతాయి. కల్పవల్లి ఈయన ఖండ కావ్య సంపుటి. విజయపతాక, కళారాధన, రజకలక్ష్మి, కళోపాసన, కృష్ణదేవరాయలు, విశ్వామిత్ర నాటకాలుగా ప్రసిద్ధాలు. 1982లో వింజమూరి శివరామారావు విజయవాడలో కాలధర్మం చెందారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్ వింజమూరి వారిని కళాప్రపూర్ణ బిరుదంతో సత్కరించింది.

## ఏడిద కామేశ్వరరావు :

రేడియో అన్నయ్యగా పరిచితులైన ఏడిద కామేశ్వరరావు 1913 సెప్టెంబర్ 12వ తూర్పుగోదావరి జిల్లా ఏడిదలో జన్మించారు. మండపేట, రాజమండ్రిలో విద్యాభ్యాసం చేశారు. 1930లో శాసనోల్లంఘ నోద్యమంలో జైలు శిక్ష అనుభవించారు. 1935-40 మధ్యకాలంలో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి వ్యక్తిగత కార్యదర్శిగా పనిచేశారు.

1936లో మదరాసు ఆకాశవాణి కేంద్రంలో బాలల కార్యక్రమాలలో ప్రయోక్తగా చేరారు. అంతకుముందు గృహలక్ష్మి, ప్రజామిత్ర, మాతృభూమి పత్రికలలో ఉప సంపాదకులుగా పనిచేశారు 1949 నుండి ఆకాశవాణి విజయవాడలో పిల్లల కార్యక్రమాల ప్రొడ్యూసర్‌గా వ్యవహరించారు.

1952లో బాలబంధు బిరుదంతో కామేశ్వరరావు సత్కరింపబడ్డారు. సుమారు 500 పాటలు, 500 బాలల నాటికలను వ్రాసి ఆకాశవాణి ద్వారా ప్రసారం చేశారు. పదవీ విరమణ చేసి 1996 తొలిభాగంలో కామేశ్వరరావు పరమపదించారు.

## ప్రయాగ నరసింహశాస్త్రి :

తన ప్రత్యేక కంఠస్వరంతో ఖంగుమని పలుకుతూ, జానపద శైలిలో పాడుతూ శ్రోతల్ని వుర్రూతలూగించిన వ్యక్తి శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రి. మూడు దశాబ్దాలు ఆకాశవాణిలో పనిచేసి 'సెబాస్' అనిపించుకొన్నవ్యక్తి. 1936లో ఆకాశవాణి మదరాసు కేంద్రంలో నిలయ విద్వాంసుడుగా చేరారు. ప్రయాగ బావగారి కబుర్లు' ద్వారా వీరు శ్రోతలకి చేరువయ్యారు. వీరు, గాడేపల్లి సూర్యనారాయణగారు కలిసి బావగారి కబుర్లు నిర్వహించేవారు. అవి శ్రోతల జనజీవనంలో భాగమైపోయాయి. 'ఏమండోయ్ బావగారూ! రావాలి! రావాలి!' అనే పలకరింపులు సహజమయ్యాయి. స్క్రిప్టు లేకుండా యధాలాపంగా అనర్గళంగా తన సంభాషణలతో వినోదాన్ని అందించేవారు ప్రయాగ.

నరసింహశాస్త్రి 1909 నవంబరు 20 న విశాఖజిల్లా పెదగాడి గ్రామంలో సంప్రదాయ కుటుంబంలో జన్మించారు. బాల్యం నుండి సంగీతసాహిత్యాలపై అపారమైన ప్రీతి. విజయనగరం మహారాజా కళాశాలలో చదువుకొని పట్టభద్రులయ్యారు. శ్రీశ్రీ, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి వీరి సహాధ్యాయులు. ఆదిభట్ల నారాయణదాసు గారి వద్ద హరికథాగానంలో మెళుకువలు నేర్చుకొన్నారు. చక్కని గాత్రము రూపము ఉన్న ప్రయాగ 1935లో చలన చిత్రరంగ ప్రవేశం చేశారు. 'భీష్మ' చిత్రంలో విచిత్రవీర్యుని పాత్రను పోషించారు. నాగయ్యగారి త్యాగయ్య చిత్రంలో గణపతి పాత్రను పోషించారు. అనేక చిత్రాలకు పాటలు వ్రాశారు. 1969లో ఆకాశవాణిలో పదవీ విరమణ చేసిన తర్వాత మళ్ళీ చిత్రరంగంలో ప్రవేశించారు. చీకటి వెలుగులు, అందాలరాముడు, డబ్బుకు లోకం దాసోహం వంటి సినిమాలలో నటించారు.

ఆకాశవాణి మదరాసు కేంద్రంలో 1936 నుండి రెండు దశాబ్దాలు పనిచేశారు. అక్కడ వీరు ప్రసారం చేసిన 'మొద్దబ్బాయ్' HMV గ్రామఫోన్ రికార్డు కంపెనీ వారు రికార్డు చేసి విడుదల చేశారు 20కి పైగా HMV రికార్డులు ప్రయాగ రిలీజ్ చేశారు శ్రోతలలో వీరికంత ప్రశస్తి వుండేది. 1956లో ఆకాశవాణి విజయవాడ కేంద్రానికి బదలీ అయి వచ్చారు. అక్కడ సర్వశ్రీ పింగళి లక్ష్మీకాంతం, బందా కనకలింగేశ్వరరావు, బాలాంత్రపు రజనీకాంతారావు, జరుక్‌శాస్త్రి, బాలమురళి, ఓలేటి వంటి పండితుల సాహచర్యం లభించింది.

విజయవాడలో ప్రయోగ గ్రామీణ కార్యక్రమాల ప్రయోక్తగా పని చేశారు. ఎన్నో జానపద గేయాలను పాడి, పాడించి శ్రోతల మన్ననలందుకొన్నారు. హరి కథలు స్వయంగా రచించి గానం చేశారు. త్యాగరాజ చరిత్ర. కన్యాకుమారి, గాంధీజీ, శంకర విజయం హరికథలు ప్రముఖాలు. 1962లో భారత ప్రధాని శ్రీ నెహ్రూ సమక్షంలో గాంధీజీ బుర్రకథను వినిపించి బంగారు పతకంతో సన్మానించబడ్డారు. వీరి బుర్రకథలు HMV గ్రామఫోను రికార్డులుగా విడుదలైనాయి.

వినోదాల వీరయ్యగా విజయవాడ కేంద్రం నుండి ఎన్నో కార్యక్రమాలు సమర్పించారు. ఆకాశవాణి ప్రయోగకు ఆరోగ్రాణం 1969లో పదవీ విరమణ చేసేంతవరకు ఆయన ప్రయోక్తగా ఎన్నో కార్యక్రమాలు వెలువడ్డాయి. 1970 నుండి ఐదు సంవత్సరాలు కేంద్ర సంగీత నాటక అకాడమీవారి పక్షాన 'బాలాజీ ఆర్ట్ థియేటర్' పేరుతో ప్రభుత్వ పథకాలను ప్రచారం చేశారు. 1980 నుండి తిరుమల తిరుపతి దేవస్థానంవారి సంగీత కళా పీఠంలో యక్షగానాలు, హరికథల అధ్యాపకులుగా పనిచేశారు. హిందూ ధర్మ ప్రచార పరిషత్‌తో జానపదకళా ప్రచారకులుగా వ్యవహరించారు. 1983 సెప్టెంబరు 11న పరమపదించారు. మాట, పాట, ఆటలతో శ్రోతల్ని సంబర పెట్టిన ప్రయోగ నిత్యోత్సాహి. ప్రయాగ నరసింహశాస్త్రి కుమార్తె వేదవతి ఆకాశవాణిలో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా నిజామాబాద్‌లో పనిచేస్తున్నారు.

## జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి (1914)

'జరుక్‌శాస్త్రి'గా ప్రసిద్ధులైన వీరు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో ఉభయభాషా ప్రవీణులయ్యారు. ఆంధ్రపత్రిక ఉపసంపాదకులుగా కొంతకాలం పనిచేశారు. మదరాసు, విజయవాడ ఆకాశవాణి కేంద్రాలలో స్క్రిప్టురైటర్‌గా పని చేశారు. నవ్యాంధ్ర సాహిత్యోద్యమంలో ప్రధాన పాత్ర వహించారు. 'పేరడీ శాస్త్రి'గా మంచి పేరు. దేవయ్య స్వీయచరిత్ర (నవల) ప్రచురించారు. ఆనంద వాణిలో 'తనలో తాను' శీర్షిక నిర్వహించారు. సమకాలీన కవుల రచనలకు పేరడీలు వ్రాసి మెప్పు పొందారు. 1968లో పరమపదించారు. వీరి కుమారులు ప్రసాద్ ఆకాశవాణి కర్నూలు కేంద్రంలో ఎకౌంటెంటు.

## రాచకొండ నరసింహమూర్తి

సుప్రసిద్ధ రచయిత అయిన రాచకొండవారు విజయవాడ కేంద్రంలో హిందీ విభాగంలో రచయితగా పనిచేశారు. వీరి అధ్వర్యంలో హిందీలో అనేక కార్యక్రమాలు రూపొందాయి. హిందీ పాఠాలకు వొరవడి పెట్టిన రాచకొండవారు పదవీవిరమణ చేసి దివంగతులయ్యారు. రెండు దశాబ్దాలు పనిచేశారు.

## శ్రీ N. Ch కృష్ణమాచార్యులు

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు 1923 సెప్టెంబరు 15నకృష్ణాజిల్లా జగ్గయ్యపేటలో సంప్రదాయ వైష్ణవ కుటుంబంలో జన్మించారు. చిన్నతనంలోనే సంస్కృతాంధ్ర భాషలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. తర్క, వ్యాకరణ, అలంకార శాస్త్రాలను చదవటమేగాక సంగీతంలోనూ అందెవేసిన చేయి. 1948 డిశంబరులో ఆకాశవాణి విజయవాడ కేంద్రం స్థాపించారు. అప్పుడే వీరు వైలిన్ కళాకారులుగా ఉద్యోగంలో చేరారు. 35 సంవత్సరాలు విధి నిర్వహణ గావించి, 1983లో పదవీ విరమణ చేశారు వీరు ప్రస్తుతం వయోలిన్ A Top కళాకారులు. హరికథా గానంలోను స్వీయ రచనలలోనూ ప్రతిభావంతులు. విప్రనారాయణ చరిత్ర వంటి యక్షగాన రచనలు, అష్టావధాన ప్రదర్శనలు వీరి ప్రతిభకు నిదర్శనలు. సంస్కృతాంధ్రాలలో 25కు పైగా గ్రంథాలు వ్రాశారు.

ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ వారు 'గాన కళాప్రపూర్ణ' బిరుదుతో సత్కరించారు. 'సంగీత సాహిత్య కళానిధి', 'హరికథా చూడామణి' వీరి ఇతర బిరుదులు. సునిశిత హాస్యానికి ఆచార్యులవారు మారుపేరు. బిడాల మోక్షం పేరుతో వీరు వ్రాసిన కావ్య ప్రహసనం ఈ కోవకు చెందినది. గోదా గ్రంథమాల వారు వీరి త్యాగరాయ చరితము పరకాల విలాసము, శఠ గోప చరితము, శ్రీనృసింహ తాండవము ప్రచురించారు.

ఆచార్యులవారి సప్తతి పూర్తి మహోత్సవాలను అసంఖ్యాకమైన వారి శిష్య కోటి 1995 అక్టోబరులో విజయవాడలో ఘనంగా జరిపింది. కళాతపస్వి కృష్ణమాచార్యులని చినజియ్యర్ స్వామి ప్రశంసించారు. బాలమురళి, అన్నవరపు, N. Ch. త్రయం పారుపల్లి రామకృష్ణయ్యగారి శిష్య పరంపరకు చెందినవారు. కృష్ణమాచార్యుల తండ్రిగారు తిరువేంకటాచార్యులు గొప్ప పండితులు సంస్కృతంలోనూ కృష్ణమాచార్యులవారు నౌకా చరిత్రం, శఠ గోపచరితం, భూప్రశంస అనే గ్రంథాలు వ్రాశారు. నౌకా చరితము త్యాగరాజు తెనుగు గ్రంథానికి సంస్కృత అనువాదము. సంగీత సాహిత్యముల పరస్పరోపకారము ఈ రచనలో ప్రతిఫలించుచున్నదని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ప్రశంసించారు. బహుముఖ ప్రజ్ఞాశాలియైన ఆచార్యుల వారివద్ద ఎందరో గాత్ర సంగీతము వయోలిన్ వాదనము అభ్యసించారు. N.C.V. జగన్నాధాచార్యులు, N. Ch. నరసింహాచార్యులు వీరి బంధువర్గములోనివారు. వారుకూడా ఆకాశవాణిలో పనిచేయటం విశేషం.

**అన్నవరపు రామస్వామి :**

పారుపల్లి రామకృష్ణయ్య శిష్యులలో బాలమురళీకృష్ణ, అన్నవరపు రామస్వామి, వల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు ప్రసిద్ధులు. అన్నవరపు రామస్వామి 1926 ఆగష్టు 7న సోమవరప్పాడులో జన్మించారు. తండ్రి పెంటయ్య ప్రముఖ నాదస్వర విద్వాంసులు. అన్నయ్య అన్నవరపు గోపాలం మృదంగ విద్వాంసుడుగా చాలా కాలం ఆకాశవాణిలో కళాకారులుగా పనిచేసి పదవీ విరమణ చేసి మరణించారు.

ఐదు దశాబ్దాల కాలంలో రామస్వామి వాయులీనవిద్వాంసులుగా అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. ఆయన వయోలిన్‌పై సహకరించని ప్రముఖ కళాకారులు లేరు. సహకార వాద్యంగానే గాక స్వతంత్రంగా కచేరీలు చేసి రసజ్ఞుల మన్ననలు ఖండ ఖండాంతరాలలో పొందారు.

ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో 1948 నవంబరులో చేరారు. అప్పటి కింకా విజయవాడ కేంద్రం ప్రారంభం కాలేదు. N. S. రామచంద్రన్‌గారు వీరిని, కృష్ణమాచార్యులను, దండమూడిని సెలక్టుచేసి కేంద్రాన్ని ప్రారంభించారు. వీరు కళాకారులుగా 1986 వరకు పనిచేశారు. ఆయన యిప్పుడు ఆకాశవాణిలో టాప్ గ్రేడ్ వాద్యకారుడు.

అమెరికా, బ్రిటన్, కెనడా, ఫ్రాన్స్, శ్రీలంక, సింగపూరు, మలేషియా, బెహరిన్, దుబాయ్, మస్కట్ వంటి అనేక దేశాలలో పర్యటించి కచేరీలు నిర్వ హించారు. ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ ఫెలోగా ఎంపికయ్యారు. విజయవాడ, రాజమండ్రి, భీమవరాలలో కనకాభిషేకము, సువర్ణఘంటా కంకణం పొందారు. 1986 లో వీరి షష్టిపూర్తి మహోత్సవాలు వైభవంగా విజయవాడలో జరిపారు.

నాద సుధార్ణవ, వాయులీన కళాకౌముది, వాద్యరత్న, కళా సరస్వతి వంటి బిరుదులతో ఆంధ్రదేశం ఆయనను సత్కరించింది. గురుకుల పద్ధతిలో ఆయనవద్ద ఎందరో శిష్యులు విద్య నభ్యసించి ప్రసిద్ధులయ్యారు. గాత్రంలోను, వయొలిన్, వీణ, వేణువు, క్లారినెట్ వంటి కళలలో ఆయనవద్ద ఎందరో శిక్షణ పొందారు అందులో ప్రపంచం సీతారాం ప్రముఖులు. ఆకాశవాణి డైరక్టర్ జనరల్ కార్యా లయంలో సంగీత విభాగం డైరెక్టర్‌గా రెండేళ్ళు పనిచేసిన సీతారాం వేణుగానకళలో జగత్ప్రసిద్ధి పొందారు.

## దండమూడి రామమోహనరావు :

సుప్రసిద్ధ మార్దంగికులలో దండమూడి విశిష్ట వ్యక్తి రామస్వామిచౌదరి కుమారులుగా రామమోహనరావు 1933 మార్చి 18న విజయవాడలో జన్మించారు. పళని సుబ్రహ్మణ్యం పిళ్లై, కొండపాటూరి రంగనాయకుల వంటి గురువుల వద్ద మృదంగ విద్యను అభ్యసించారు తన ఆరవఏట శ్రీ యన్ దొరై సంగీత కచేరికి మృదంగం వాయించి పండితుల ప్రశంసలు అందుకొన్నారు.

కర్ణాటక సంగీతంలోని ప్రసిద్ధుల పారుపల్లి రామకృష్ణయ్య, ద్వారం వెంకట స్వామినాయుడు, దాలిపర్తి పిచ్చిహరి, వోలేటి, ఈమని, చిత్తూరు సుబ్రహ్మణ్య పిళ్లై, బాలచందర్, చెంబై వంటి ఆ తరం వారికి మృదంగ సహకారం అందించారు. నేటి సంగీత కళాకారులలో ఆయన సహకరించిన ప్రసిద్ధుల లేరనడం ఆశ్చర్యం కాదు. రామమోహనరావు ఆకాశవాణిలో టాప్‌గ్రేడ్ ఆర్టిస్టుగా ఎంపికయ్యారు. 1944 నుండి ఆకాశవాణి కళాకారునుగా పేరు పొందారు. 1949 లో ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో మృదంగ విద్వాంసులుగా చేరి 1993 లో పదవీ విరమణ చేశారు. కేంద్ర సంగీతనాటక అకాడమీ 1995 లో వీరిని సత్కరించింది వాద్య రత్న, నాద భగీరథ, కళా ప్రవీణ వంటి బిరుదులతోపాటు కనకాభిషిక్తులయ్యారు. ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ, ఇటలీ, నార్వే, డెన్మార్క్, స్విట్జర్లాండ్, ఇతర యూరప్ దేశాలు విస్తృతంగా పర్యటించి కచేరీలు చేశారు. పారిస్ విశ్వవిద్యాలయంలో పాఠాలు బోధించారు. ఎందరో సంగీత విద్వాంసుల్ని తయారుచేశారు. వీరి సతీమణి శ్రీమతిసుమతి విజయవాడ సంగీత ప్రభుత్వకళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తున్నారు.

## బలిజేపల్లి రామకృష్ణశాస్త్రి :

రామకృష్ణశాస్త్రి గుంటూరులో 1932 జనవరి 6న జన్మించారు. తండ్రి సీతారామశాస్త్రిగారి వద్ద సంగీత విద్యాభ్యాసం గావించారు. 1947 నుండి సంగీత కచేరీలు నిర్వహిస్తున్నారు. 1956 నుండి ఆకాశవాణి సంగీత కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో సంగీతవాద్యాల పరిరక్షకులుగా (Care taker, Musical Instruments) 1962 వ సంవత్సరంలో చేరారు. భక్తిరంజని, సంగీత శిక్షణ, సంగీత రూపకాలు, కచేరీల ద్వారా శ్రోతల మన్ననలు పొందారు. 1980 లో తంబురా కళాకారులుగా నియుక్తులయ్యారు. 1992లో పదవీ విరమణ చేసేంతవరకు రామకృష్ణశాస్త్రి తమ గాత్రమాధుర్యంతో శ్రోతల నలరించారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు శాస్త్రి ప్రతిభను గుర్తించారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం సంగీత విభాగానికి Visiting Professorగా కొంతకాలం వ్యవహరించారు. తెలుగు విశ్వవిద్యాలయం వారు వీరి సేవలను పరీక్షాధికారిగా వినియోగించుకొంటున్నారు శాస్త్రి విజయవాడలో స్థిరపడ్డారు.

**ఎల్లా వెంకటేశ్వరరావు :**

తనదైన ప్రత్యేక బాణీలో నవ మృదంగ సమ్మేళనం నిర్వహించి యీ ద్వారత ఖ్యాతిని గడించిన ఎల్లా వెంకటేశ్వరరావు విజయవాడలో జన్మించారు. వీరి తండ్రి ఎల్లా సోమన్న ప్రముఖ మృదంగ విద్వాంసులు. చిన్నతనంలోనే మృదంగ వాద్యాన్ని అభ్యసించారు ఎల్లా. ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో తొలుత నిలయ కళాకారులుగా చేరారు. ఆ తర్వాత హైదరాబాదు కేంద్రంలో మృదంగ విద్వాంసులుగా సుమారు రెండు దశాబ్దాలు పనిచేశారు. 1961 లో ఆకాశవాణి జాతీయ సంగీత పోటీల్లో ప్రథమ బహుమతిని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి వద్దనుండి పొందారు.

దేశ విదేశాలలో ప్రదర్శనల ద్వారా ఖ్యాతి గడించారు. విదేశాలలో సుదీర్ఘ కాలం పర్యటించి వారి ప్రశంస లందుకొన్నారు. ఎందరో శిష్యులను తయారు చేశారు. 24 గంటలపాటు అఖండ మృదంగ విన్యాసాన్ని ప్రదర్శించి ప్రేక్షకుల మన్నవలు పొందారు. జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయంవారు వీరిని గౌరవ డాక్టరేట్‌తో సత్కరించారు. యావద్భారత దేశంలో వివిధ సంస్థలు వీరిని గౌరవించాయి. సంగీత నాటక అకాడమీ ఫెలోషిప్ సంపాదించారు.

డా॥ ఎల్లా వెంకటేశ్వరరావు హైదరాబాదులోని తెలుగు విశ్వ విద్యాలయం వారి సంగీత విభాగంలో ఆచార్యులుగా గత 8 సం॥లుగా వ్యవహరిస్తున్నారు. సంగీత నృత్య విభాగానికి డీన్‌గా వ్యవహరిస్తున్నారు. అమెరికా, జపాన్, కెనడా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, ఇటలీ, ఆస్ట్రేలియా మొ॥ దేశాలు పర్యటించారు.

విజయవాడ కేంద్రంలో సంగీత విభాగంలో పనిచేసిన ఎందరో ప్రముఖులు స్మరించదగ్గ వారున్నారు. సర్వశ్రీ క్రొవ్విడి హనుమంతరావు, క్రొవ్విడి సీతారాం, దత్తు వెంకటేశ్వరరావు, జొన్నలగడ్డ సింహాచలశాస్త్రి, రామవరపు సుబ్బారావు వంటి ప్రముఖులు పనిచేశారు.

ఈ తరానికి చెందినవారిలో సర్వశ్రీ అరిపిరాల మురళీకృష్ణ (వయొలిన్), కె వి. కృష్ణ (వేణువు), నాగరాజ్ (ఫ్లూట్), సుబ్రహ్మణ్యేశ్వరరావు (క్లారినెట్), వి. వి. యస్. ప్రసాద్, సతీష్, సద్గురు చరణ్ (మృదంగం), మల్లాది శ్రీరాం ప్రసాద్, మోదుమూడి సుధాకర్, కుమారి శిష్లా శారద చెప్పుకోదగినవారు. M. S. బాబు, గోవాడ సుబ్బారావు హఠాన్మరణం పొందారు.

P. R. రెడ్డి :

పెనుమల్లి రామిరెడ్డి 1934 జూలై 5న కృష్ణాజిల్లాలో మోరంపూడిలో జన్మించారు. శాంతినికేతన్‌లో ఎం ఏ. పూర్తి చేశారు. 1957 లో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ పదోన్నతి పొందారు. 1978 లో A.S D. గా బొంబాయి వెళ్ళారు. 1981 లో స్టేషన్ డైరక్టర్‌గా పదోన్నతి పొంది బొంబాయి వివిధభారతి కార్యకలాపాలు చూశారు. అక్కడనుండి విజయవాడ కేంద్రంలో 83 మార్చి - 86 ఫిబ్రవరి మధ్య కాలంలో పనిచేశారు. విజయవాడ నుండి కడప బదలీ అయి రెండేళ్ళు పనిచేశారు. విదేశీ ప్రసార విభాగం ఢిల్లీలో డిప్యూటీ డైరక్టర్‌గా పనిచేశారు. అక్కడ నుండి సెలక్షన్ గ్రేడ్ పొంది 1989 లో వరంగల్ కేంద్రం డైరక్టర్‌గా వెళ్ళారు. రెడ్డి '90 లో హృద్రోగంతో వరంగల్‌లో హఠాన్మరణం చెందారు.

ముక్కుసూటిగా వెళ్ళే అధికారిగా రెడ్డి పేరు పొందారు.

కలకత్తా, రాజ్‌కోట్, గౌహతి కేంద్రాలలో పనిచేశారు.

వీరు ఆకాశవాణిలో చేరడానికి ముందు ఢిల్లీ ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో సబ్-ఎడిటర్‌గా పనిచేశారు.

వీరి కుమారులు శంకర్‌రెడ్డి విజయవాడ కేంద్రంలో పనిచేస్తున్నారు.

P. శ్రీనివాసన్ :

శ్రీనివాసన్ 1924 నవంబరులో జన్మించారు. మదరాసులో 1950 దశకంలో వీరు ఆకాశవాణిలో చేరారు.

శ్రీనివాసన్, సుభద్రా శ్రీనివాసన్ దంపతులు ఆకాశవాణిలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌లుగా సుప్రసిద్ధులు. కొహిమావంటి క్లిష్టమైన కేంద్రాలలో వీరు పనిచేశారు విజయవాడ కేంద్రం డైరక్టర్‌గా రెండేళ్ళు పనిచేశారు. వీరి కాలంలో వివిధ కార్యక్రమాలు శ్రోతలను ఆకట్టుకొన్నాయి. కొంతకాలం హైదరాబాదులోని ప్రాంతీయ శిక్షణా కేంద్రం అసిస్టెంట్ డైరక్టర్‌గా పనిచేశారు 1982 నవంబరులో పదవీ విరమణానంతరం విశాఖపట్టణంలో స్థిరపడ్డారు.

డా॥ ఆర్. అనంతపద్మనాభరావు

రేవూరు అనంత పద్మనాభరావు 1947 జనవరి 29న నెల్లూరుజిల్లా వెమ్మూరులో జన్మించారు. నెల్లూరు వి. ఆర్. కళాశాల నుండి బి. ఏ. పట్టభద్రులైనారు. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం నుండి ఎం. ఏ. లో సర్వ ప్రథములుగా స్వర్ణ పతకాన్ని 1967లో పొందారు. 1967 నుండి 75 వరకు కందుకూరు ప్రభుత్వ కళాశాలలో తెలుగు అధ్యాపకులుగా పని చేశారు. ఈ కాలంలో 50కి పైగా అష్టావధానాలు చేశారు. కవిగా, రచయితగా పద్మనాభరావు 35 గ్రంథాలు ప్రచురించారు. కందుకూరి రుద్రకవిపై పరిశోధన చేసి పి.హెచ్‌డి. పట్టా పొందారు.

1975 ఆగష్టు 16 న ఆకాశవాణి కడప కేంద్రంలో తెలుగు ప్రసంగాల ప్రొడ్యూసర్‌గా చేరి 75–82 మధ్యకాలంలో కడప, విజయవాడలలో పని చేశారు. 1982 అక్టోబరు నుండి ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా (UPSC సెలక్షన్) 85 జనవరి వరకు పని చేశారు. 85-87 మధ్య కాలంలో వాణిజ్య ప్రసార విభాగం అధిపతిగా చేశారు. 1987 ఏప్రిల్ నుండి 88 వరకు ఢిల్లీలోని Staff Training Instituteలో పని చేశారు. 1988లో UPSC ద్వారా డైరక్టర్‌గా సెలక్టయి డైరక్టరేట్ జనరల్ కార్యాలయంలో ప్రసంగాలశాఖ డైరక్టర్‌గా(Diretor of Programmes, Spoken word) గాపనిచేశారు. 88-90 మధ్య ఢిల్లీ స్టాఫ్ ట్రెయినింగ్ ఇనిస్టిట్యూట్ డిప్యూటీ డైరక్టర్‌గా రెండేళ్ళు పని చేశారు. 1990 ఆగష్టు నుండి అనంతపురం ఆకాశవాణి తొలి డైరక్టరుగా మూడేళ్ళు పని చేశారు. సెలక్షన్ గ్రేడ్ డైరక్టరుగా 93-95 మధ్యకాలంలో కడప కేంద్ర డైరక్టర్‌గా పని చేశారు. 1995 మార్చి నుండి విజయవాడ కేంద్ర డైరక్టర్‌గా వ్యవహరిస్తున్నారు. ఆకాశవాణి కొత్తగూడెం కేంద్రం ప్రారంభ సమయంలో 1989 మార్చిలో ఆయన తొలి డైరక్టరు.

కవి, నవలా రచయిత, వ్యాఖ్యాకర్తగా పద్మనాభరావు ప్రసిద్ధులు. వి. వి. గిరి, ప్రకాశం, రాయలసీమ రత్నాలు వంటి జీవిత చరిత్రలు రచించారు. రుద్రకవి, ప్రకృతికాంత, భక్తి సాహిత్యం విమర్శనా గ్రంథాలు. హరివంశం ధారావాహికంగా రేడియోలో ప్రసారమై ప్రచురితమైంది.

కేంద్ర సాహిత్య అకాడమీ వారికి "ప్రభాతవదనం" తెలుగులోకి అనువదించారు. ముల్క్‌రాజ్ ఆనంద్ "Morning Face"కు అది తెలుగు అనువాదం.

ఈ గ్రంథం 1993లో తెలుగు విశ్వ విద్యాలయం వారిచే ఉత్తమ అనువాద కని బహుమతి తెచ్చిపెట్టింది. ఛాయారేఖలు, ఆంధ్రమణిహారం, రామాయణంలో స్త్రీ పాత్రలు, యశోద, నీరు, భక్తి సాహిత్యం, భయంవేస్తోందా భారతి, ఇతర రచనలు. వీరి మారనినాదం, సంజ వెలుగు, వక్రించిన సరళరేఖ నవలలపై శ్రీకృష్ణ దేవరాయ విశ్వ విద్యాలయంలో శ్యాంప్రసాద్ పరిశోధన చేసి M. Phil. పట్టా పొందారు. జర్మనీ రేడియోవారి ఆహ్వానం మేరకు 1996 ఆగస్టు నెలలో ప్రసార మాధ్యమాలపై జర్మనీలోని "కొలోన్"లో జరిగిన అంతర్జాతీయ సదస్సులో పద్మ నాభరావు భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. 12 దేశాల ప్రతినిధులు యిందులో పాల్గొనడం విశేషం.

## ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురంలో శ్రీకాంతశర్మ 29-5-44లో జన్మిం చారు. సుప్రసిద్ధకవి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి వీరి తండ్రి. ఎం. ఏ. పట్టభద్రులై ఆంధ్రజ్యోతి వారపత్రికలో (విజయవాడ) సబ్-ఎడిటర్‌గా 1969-76 మధ్య పని చేశారు. అభ్యుదయ కవిగా శర్మ ప్రసిద్ధులు.

1976లో ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో అసిస్టెంట్ ఎడిటర్ (Scripts)గా శర్మ చేరారు. తెలుగు ప్రసంగాల శాఖకు ఉషశ్రీకి సహాయకులుగా సంస్కృత కార్యక్రమాలు నిర్వహించారు. శర్మ చక్కని రూపకాలు రచించారు. వీరు రచించిన అమరారామం రూపకం 1981 లో జాతీయ స్థాయిలో బహుమతి పొందింది. 1986లో 'వర్షానందిని' 'నేను కాని నేను' బహుమతులుజాతీయస్థాయిలో అందుకోవడం విశేషం. 1994లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా నిజామాబాద్ కేంద్రంలో చేరారు. 1995లో స్వచ్ఛంద పదవీ విరమణచేసి ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక సంపాదకులుగా చేరారు.

కవిగా రచయితగా శ్రీకాంతశర్మ లబ్ధప్రతిష్ఠులు. వీరి రచనలు అలనాటి నాటకాలు శిలామురళి, పొగడపూలు, ఆలోచన, గాధావాహిని, సాహిత్య పరిచయం ప్రసిద్ధాలు. రూపక రచయితగా, గేయ రచయితగా శ్రీకాంతశర్మ శ్రోతలకు పరిచితులు. కొన్ని సినీ గీతాలు కూడా శర్మ వ్రాశారు. శర్మ స్నేహశీలి. వీరికి నూతలపాటి గంగాధరం సాహితీ పురస్కారం, ఫ్రీవర్స్ ఫ్రంట్ అవార్డు లభించాయి.

## సుత్తి వీరభద్రరావు :

ఆకాశవాణినుండి ఎందరో కళాకారులు సినీ రంగానికి వెళ్ళి ధృవతార లయ్యారు. అలాంటివారిలో వీరభద్రరావు ఒకరు. ఆయనకు 'సుత్తి' పదం పేరులో భాగమైంది. సినీరంగంలో చేరి 50కి పైగా చిత్రాలలో నటించి ఎనలేని కీర్తి సంపాదించారు. ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ప్రొడక్షన్ అసిస్టెంట్‌గా చేరి రెండు దశాబ్దులు పనిచేసి 1980లో చిత్రపరిశ్రమలో చేరారు. 1988 జూన్ 30న వీరభద్రరావు మదరాసులో కన్నుమూశారు. విజయవాడ కేంద్రంలో ఆయన నాటక విభాగములో చాలాకాలం పనిచేశారు. మంచి నటుడు, ప్రయోక్త.

నాటక రంగాన్ని పరిపుష్టం చేసిన మరికొందరిని స్మరించాలి. వేమవరపు శ్రీధరరావు నటుడుగా ప్రసిద్ధి గడించారు. అలానే కూచిమంచి కుటుంబరావు, వెంపటి రాధాకృష్ణ, సి. రామమోహనరావు, నండూరి సుబ్బారావు, నాగరత్నమ్మ, వి.బి. కనకదుర్గ, A.B ఆనంద్, కమలకుమారి, నాటక విభాగంలో విశేష కృషి చేశారు. విజయవాడ నాటకాలంటే శ్రోతలు అప్పటికీ యిప్పటికీ చెవులు కోసుకొంటారు. శ్రీ S. A. పద్మనాభరావు ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా 1978లో చేరి ప్రజా సంబంధాలు పటిష్ఠం చేశారు. 1991లో PEX అయ్యారు.

జె. వరలక్ష్మి, జె. శ్యామసుందరి హైదరాబాదు, విజయవాడ కేంద్రాలలో కొద్ది కాలం పని చేశారు రాజ్యసభ సెక్రటరీ జనరల్‌గా పనిచేస్తున్న శ్రీమతి V.S. రమాదేవి కొంతకాలం హైదరాబాదు కేంద్ర మహిళా విభాగం వ్యాఖ్యాతగా పని చేశారు.

మోతీ వేదకుమారి విజయవాడ సంగీత విభాగంలో కొంతకాలం పనిచేసి పదవీ విరమణ చేసి ఏలూరు నియోజకవర్గ కాంగ్రెసు అభ్యర్థిగా లోక్‌సభ సభ్యురాలుగా 1957 లో ఎన్నికయ్యారు. ఇదొక విశేషం. అలానే హైదరాబాద్‌లో అనౌన్సర్‌గా పనిచేసిన సాదత్ అలీఖాన్ ప్రధానమంత్రి నెహ్రూకు విదేశాంగ కార్యదర్శిగా పనిచేసి పార్లమెంటు సభ్యులు కావడం విశేషం.

వార్తా విభాగంలో 15 సంవత్సరాలుగా పనిచేస్తూ విజయవాడ కేంద్రానికి ఖ్యాతి తెచ్చిన వ్యక్తులలో శ్రీ ప్రయాగ రామకృష్ణ, శ్రీ కొవ్వలి సుబ్బారావు ముఖ్యులు. రామకృష్ణ అనౌన్సర్‌గా విజయవాడ కేంద్రంలో చేరి 1979లో న్యూస్ రీడర్ అయారు. చిన్నపిల్లలకు అనేక గ్రంథాలు వ్రాశారు వ్యాఖ్యాతగా మంచిపేరు తెచ్చుకొన్నారు. ఆధ్యాత్మిక విషయ సంపన్నుడు రామకృష్ణ. కొవ్వలి సుబ్బారావు 1976లో ప్రొడక్షన్ విభాగంలో చేరి 1980లో న్యూస్‌రీడర్‌గా మారారు. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో విశేషంగా దళితులకై కృషి చేస్తున్నారు. దక్షిణ మధ్య రైల్వే సలహా సంఘ సభ్యులుగా పనిచేశారు.

## నండూరి మదన గోపాల రామకృష్ణ :

## (N M G రామకృష్ణ)

మధ్యవయసులో విధి కాటు వేసిన వ్యక్తులలో రామకృష్ణ ఒకరు. 1941 మార్చి 27 న వైష్ణవ కుటుంబంలో జన్మించిన రామకృష్ణ ఎం. ఏ. పట్టభద్రు లయ్యారు. 963 లో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా ఆకాశవాణిలో చేరి వివిధ కేంద్రాలలో PEXగా పనిచేశారు. విజయవాడలో చాలాకాలం (1975-80ల మధ్య) పనిచేశారు. డెప్యుటేషన్‌పై వార్తా విభాగములో కరస్పాండెంట్‌గా కొంతకాలం (సంవత్సరంన్నర) విజయవాడలో పనిశారు. అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్ ప్రమోషన్ వదలుకొని విజయవాడలోనే ఉండిపోయారు. 1981 లో ASDగా రత్నగిరి (మహారాష్ట్ర) వెళ్ళారు. అక్కడనుంచి అదిలాబాదు వెళ్ళారు. 1988లో కొత్తగూడెం కేంద్రానికి తొలిస్టేషన్ డైరక్టర్‌గా వెళ్ళారు. 1991లో హఠాన్మరణం పొందారు. కొత్తగూడెం కేంద్రంలో వీరు రూపొందించిన కిన్నెరసాని రూపకానికి జాతీయస్థాయిలో బహుమతి లభించింది. రామకృష్ణ మంచి రచయిత. వీరి శ్రీమతి విజయవాడ యస్.ఆర్.ఆర్. కళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తున్నారు.

**వండూరి సుబ్బారావు :**

విజయవాడ కేంద్రం నాటక విభాగంలో డ్రామా వాయిస్‌గా మూడు దశాబ్దాలు పనిచేసిన సుప్రసిద్ధులు వండూరి సుబ్బారావు. ఆయన బందా కనక లింగేశ్వర రావు హయాంలో ఆకాశవాణిలో చేరి ఎన్నో నాటకాలు నాటికలు వ్రాశారు. స్వయంగా రచయిత, నవలా కారుడు. వీరిగణపతి పాత్ర పోషణ, సక్కుబాయిలో కాశీపతి పాత్ర, వరవిక్రయం శ్రోతల్ని అలరిస్తూ వుంటాయి.

1933 జూలై 7న కృష్ణాజిల్లా ఆరుగొలనులో జన్మించిన సుబ్బారావు బందా వారి సౌజన్యంతో 1960 ఆగస్టులో రేడియోరంగ ప్రవేశం చేశారు. 1961 జనవరి నుండి Drama Voiceగా ఉద్యోగ బాధ్యతలు స్వీకరించి 1990 ఆగస్టు 31 న రిటైరయ్యారు.

20 నవలలు, రెండు రేడియో నాటక సంపుటాలు ప్రచురించారు. వీరి నవలల్లో ఆటబొమ్మ, దీపంజ్యోతి, అతకని బ్రతుకులు, విరిగిన కెరటాలు, వెన్నెల విలువెంత ? మన శీనయ్య సంసారం, రాగరంజిత ప్రముఖాలు. పిల్లల నాటికల సంపుటి గూడా ప్రచురితమైంది. వీరు విశ్రాంత జీవితాన్ని విజయవాడలో గడుపుతున్నారు.

విక్రాంతగిరి శిఖరం, భగవాన్ రమణ మహర్షిరూపకాలలో వీరు శ్రీ గోపాల్‌తో కలిసి ప్రొడక్షన్ టీమ్‌లో పనిచేసి జాతీయస్థాయి ఆకాశవాణి బహుమతులందుకొన్నారు.

## సంగీత కళాకారులు

**శ్రీరంగం గోపాలరత్నం :**

తనదైన మధుర కంఠస్వరంతో భక్తిరంజని ద్వారా శ్రోతల హృదయాలలో స్థానం సంపాదించుకున్న కుమారి శ్రీరంగం గోపాలరత్నం విజయవాడ కేంద్రంలో దాదాపు 20 సంవత్సరాలు స్టాఫ్ ఆర్టిస్టుగా పనిచేశారు. ఆ తర్వాత పదవీ విరమణ చేసి సికిందరాబాదు సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. 1994 లో వీరు అనారోగ్యంతో మరణించారు. కర్ణాటక శాస్త్రీయ సంగీత సభల ద్వారా, భక్తిరంజని ద్వారా, రేడియో నాటకాల ద్వారా వీరు ఆంధ్రలోకానికి పరిచితులు,

## సంధ్యావందనం శ్రీనివాసరావు :

అనంతపురానికి చెందిన శ్రీ శ్రీనివాసరావు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో తొలినాళ్ళలో పనిచేశారు. చక్కటి కర్ణాటక బాణీలో గానం చేయగల వీరు అనేక భక్తిరంజని కార్యక్రమాలు రూపొందించారు. 1994లో వీరు మరణించారు. తమిళ నాడు, కర్ణాటక, ఆంధ్రలో వీరు చక్కటి పేరు సంపాదించారు. మదరాసులో మ్యూజిక్ సూపర్‌వైజర్‌గా చేరారు వాద్యగోష్ఠులు నిర్వహించేవారు. విజయవాడలో అసిస్టెంట్ ప్రొడ్యూసర్‌గా పనిచేశారు. సంగీత శిక్షణాలయం (training) మదరాసు ప్రిన్సిపాల్‌గా చేశారు.

## సుందరపల్లి సూర్యనారాయణమూర్తి :

క్లారినెట్ విద్వాంసులుగా ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో మూడు దశాబ్దులు పనిచేసి పదవీ విరమణ చేశారు. యావద్భారత దేశంలో క్లారినెట్ వాద్యసభలద్వారా రసజ్ఞుల మన్ననకు పాత్రులయ్యారు.

సూర్యనారాయణమూర్తి 1931 అక్టోబరు 21న విశాఖపట్టణం జిల్లా చోడ వరంలో జన్మించారు. తండ్రి నాగన్న వద్ద క్లారినెట్ నేర్చుకున్నారు. 1957 నవంబరు నుండి 1991 అక్టోబరు వరకు విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో క్లారినెట్ కళాకారులుగా వ్యవహరించారు. 1983లో రాష్ట్రసంగీత నాటక అకాడమీ వారు కళాప్రవీణ బిరుదంతో సత్కరించారు.

## దత్తాడ పాండురంగరాజు :

పాండురంగరాజుగారు వయొలిన్ విద్వాంసులుగా విజయవాడ కేంద్రంలో పని చేసిన వారిలో ప్రసిద్ధులు. వయొలిన్ వాయిస్తూ వారి స్వగృహంలో కాలధర్మం చెందారు.

## N.C.V. జగన్నాథాచార్యులు :

నల్లాన్ చక్రవర్తుల వారి వంశంలో ఎందరో సంగీత విద్య నభ్యసించి ప్రసిద్ధులయ్యారు. అందులో జగన్నాథాచార్యులు గాత్రం ద్వారా బహుళ ప్రశస్తి పొందారు. లలిత సంగీతం ద్వారా, భక్తిరంజని కార్యక్రమాల ద్వారా ఆయన శ్రోత లకు పరిచితులు. వారు హఠాన్మరణం పొందారు. వారి స్మారక సంగీత పోటీలు వారి మిత్రులు ఏటా నిర్వహిస్తున్నారు. వారి సోదరులు నరసింహాచార్యులు ప్రస్తుతం అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా ఢిల్లీ కేంద్రంలో పనిచేస్తున్నారు ప్రముఖ రచయిత శ్రీ విరించి వీరి అన్నయ్య.

ఆకాశవాణి నిలయ కళాకారులుగా కొందరు ఉద్యోగ నిర్వహణ బాధ్యతలు స్వీకరించగా మరి ఎందరో ఆకాశవాణి ద్వారా తమ కళా నైపుణ్యాన్ని ప్రదర్శించి శ్రోతల మన్ననలు అందుకొంటున్నారు.

మల్లాది సూరిబాబు కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో చక్కటి పేరు గడించారు. వీరి కుమారులు మల్లాది సోదరుల పేర గాత్రకచేరీలు నిర్వహిస్తున్నారు. సూరిబాబు రేడియో అనౌన్సర్‌గా రెండున్నర దశాబ్దాలుగా పనిచేస్తున్నారు. శ్రీరామప్రసాద్, రవికుమార్ వీరి కుమారులు. కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో ఆరితేరినవారుగా వేదుమూరి కృష్ణమూర్తిగారి వద్ద విద్య నభ్యసించారు.

కుమారి కౌతా ప్రియంవద స్వరకర్తగా మంచిపేరు తెచ్చుకొన్నారు. సుప్రసిద్ధ చిత్రకారులు కౌతా రామమోహన్ శాస్త్రిగారి పుత్రిక. వీరు విజయవాడ, కడప కేంద్రాలలో పనిచేసి పదవీ విరమణ చేశారు. కర్ణాటక లలిత సంగీతాలలో అందె వేసిన చేయి. విష్ణుభొట్ల సోదరులు కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో ప్రావీణ్యం సంపాదించారు. విష్ణుభొట్ల ముకుంద శర్మ విశాఖపట్టణ కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేస్తున్నారు. రెండవ సోదరుడు ఉదయశంకర్ మృదంగ విద్యాప్రవీణుడు. వీరి సోదరీమణులు కృష్ణవేణి, సరస్వతి సంగీత విదుషీమణులు కావడం విశేషం. సరస్వతి భర్త B.V.S. ప్రసాద్ విజయవాడ కేంద్రంలో పనిచేస్తున్నారు. మోదుమూడి సుధాకర్, మంగళగిరి ఆదిత్య ప్రసాద్, శిష్టా శారద, సద్గురు చరణ్, బి.వి.యస్. ప్రసాద్, సతీష్ విజయవాడ కేంద్ర నిలయ కళాకారులుగా విశేష సేవ చేస్తున్నారు. సుధాకర్ స్వరకర్తగా మంచి పేరు తెచ్చుకొన్నారు. వీరి సతీమణి అంజని గాత్ర విదుషీమణి.

ఆకాశవాణి దశాబ్దాలుగా కళారంగానికి ఎందరో మహనీయులను అందించి కర్ణాటక సంగీతానికి ఎనలేని సేవ చేస్తోంది. భారతదేశంలోని సుప్రసిద్ధ విద్వాంసులు ఆకాశవాణిలో పని చేయడం విశేషం. డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, యం.యస్. సుబ్బలక్ష్మి(ఎమిరిటస్ ప్రొడ్యూసర్) మంచాళ జగన్నాధరావు, వింజమూరి వరదరాజ అయ్యంగార్, N. S శ్రీనివాసన్, వింజమూరి సీతాదేవి, ఓలేటి వెంకటేశ్వర్లు, సంధ్యావందనం శ్రీనివాసరావు, బాలాంత్రపు రజనీకాంతరావు, మల్లిక్ యిలా ఎందరో ఆకాశవాణి కొత్త పుంతలు తొక్కడానికి మార్గదర్శకులయ్యారు.

ఏల్చూరి విజయరాఘవరావు :

వేణుగానలోలురైన ప్రపంచ ప్రఖ్యాతిగన్న వ్యక్తి ఏల్చూరి విజయరాఘవ రావు. నయాగరా కవులలో ఒకరైన ఏల్చూరి సుబ్రహ్మణ్యం వీరి అగ్రజులు. ఆయన సోవియట్ లాండ్ కార్యాలయంలో సంపాదకులుగా పనిచేశారు. నరసరావు పేటలో జన్మించిన రాఘవరావు యింతింతై వటుడింతయై అన్నట్లు జాతీయస్థాయిలో గుర్తింపు పొందారు. బొంబాయిలోని ఫిల్మ్స్ డివిజన్ కార్యాలయంలో పనిచేస్తూ ఎన్నో డాక్యుమెంటరీలు తీశారు. సంగీత దర్శకత్వం వహించారు. స్వయంగా నటులు. ఉదయశంకర్‌తో కలిసి పనిచేశారు. ఎన్నో సినిమాలకు సంగీతాన్ని సమ కూర్చారు. భారత ప్రభుత్వం వీరిని పద్మశ్రీ బిరుదంతో సత్కరించింది.

ఏల్చూరి సుబ్రహ్మణ్యం గారి కుమారులు మురళీధర్ ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో 1978-81 మధ్య డ్యూటీ ఆఫీసర్‌గా పనిచేశారు. చక్కని పద్యరచన చేయగల సమర్థులు. ఆకాశవాణి పదవికి రాజీనామా చేసి కొత్త ఢిల్లీలోని వెంకటేశ్వర కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పని చేస్తున్నారు. పరిశోధన చేసి Ph.D. డిగ్రీ పొందారు. పురాణాలకు వ్యాఖ్యానం వ్రాసిన దిట్ట.

వింజమూరి లక్ష్మి :

గానకోకిలకు ప్రతిరూపం వింజమూరి లక్ష్మి స్టాఫ్ ఆర్టిస్టుగా విజయవాడలో చేరి తర్వాత ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అయ్యారు. ఆకాశవాణిలో ప్రోగ్రాం ఎగ్జి క్యూటివ్‌గా విజయవాడ, మదరాసు కేంద్రాలలో 20 ఏళ్లు పనిచేసి స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. మదరాసులో స్థిరపడ్డారు, కర్ణాటక, లలిత సంగీతాలలో ప్రావీణ్యం పొందారు,

ద్వారం మంగతాయారు, పెమ్మరాజు సూర్యారావు, M.V. రమణమూర్తి, సంగీత విభాగంలో పనిచేసిన మరికొందరు ప్రముఖులు. కుటుంబయ్యగారు, తంబురా కళాకారులే అయినా వ్యవసాయ విభాగంలో 'మార్కెట్ రేట్లు' రెండు దశాబ్దాలకు పైగా చదివారు. మిమిక్రీ కళాకారులు వీరిని అనుకరించడం కద్దు.

## ఆమంచర్ల గోపాలరావు (1907-69) :

నెల్లూరు జిల్లా కావలిలో 1907 సెప్టెంబరు 26న ఆమంచర్ల గోపాలరావు జన్మించారు. చిన్ననాటి నుండి స్వాతంత్రోద్యమంలో విరివిగా పాల్గొన్నారు. సహాయ నిరాకరణోద్యమంలో వాలంటీరుగా పనిచేశారు. జాతీయోద్యమంలో భాగంగా 1930వ సంవత్సరంలో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. ప్రముఖ రాజకీయ నాయకులు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికి వీరు జిల్లా కాంగ్రెసు రాజకీయాలలో సమకాలికులు. గుంటూరులో యూత్‌లీగ్ నాయకత్వ బాధ్యతలు స్వీకరించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని కొంతకాలం తెరవెనుక ఉండి పోవలసి వచ్చింది. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రి ఉద్యమంలో 1952 లో వీరు పని చేశారు.

గోపాలరావు చక్కని రచయిత. వీరి రచనలలో విశ్వంతర, హిరణ్య కశిపుడు ప్రముఖ నాటకాలు. మాట పట్టింపు, మల్లమ్మ ఉసురు, అపరాధి నాటికలు, చలనచిత్రరంగంలో గోపాలరావు కృషి శ్లాఘనీయం. తెలుగు చలన చిత్రాలలోనే గాక హిందీ చలన చిత్రాలలో గూడ సహాయ దర్శకులుగా పనిచేశారు. 'కాలచక్రం', 'ఒకరోజు రాజు' తెలుగు చిత్రాల దర్శకత్వ బాధ్యతలు చేపట్టారు. మరికొన్ని చిత్రాలకు ఆర్ట్ డైరక్టరుగా పనిచేశారు.

చిత్రకారుడుగా గోపాలరావు ప్రకృతి దృశ్యం చిత్రీకరణపట్ల ఆకర్షితు లయ్యారు. చిత్రకళపై ఆయన అనేక వ్యాసాలు వ్రాశారు. అనంతపురం జిల్లాలోని లేపాక్షి కుడ్య శిల్పాల సౌందర్యాన్ని గూర్చి ఇంగ్లీషులో చక్కని గ్రంథం వ్రాశారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన ఆమంచర్లవారు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో కొంతకాలం అసిస్టెంట్ ప్రొడ్యూసర్‌గా కార్మికుల కార్యక్రమాలు రూపొందించారు.

గోపాలరావు 1969 ఫిబ్రవరి 7న తనువు చాలించారు

## కందుకూరి రామభద్రరావు :

అమలాపురం తాలూకా రాజోలుకు చెందిన విద్యావినయసంపన్నులైన రామభద్రరావు విద్యావిభాగం ప్రొడ్యూసర్‌గా విజయవాడ కేంద్రంలో పని చేశారు. వీరి కాలంలో విద్యాప్రసార రంగంలో కొత్త పోకడలు సృష్టించారు. స్వయంగా దేశభక్తి గేయాలు, ప్రణయ గీతాలు వ్రాశారు. కృష్ణశాస్త్రి భావకవితోద్యమ స్ఫూర్తిని పొందారు. స్వయంగా కొంతకాలం అధ్యాపకులుగా పని చేశారు. దూరదర్శన్‌లో పనిచేసే ఓలేటి పార్వతీశంగారికి మాతామహులు. వీరి కుమారులు కందుకూరి సూర్యనారాయణ రెండున్నర దశాబ్దాలపాటు ఢిల్లీ తెలుగు వార్తా విభాగంలో 'న్యూస్ రీడర్'గా పనిచేసి 1996 లో రిటైరయ్యారు. వీరి సతీమణి వెంకటలక్ష్మి రచయిత్రి.

## వేమవరపు శ్రీధరరావు :

ఆకాశవాణి విజయవాడ కేంద్రం పరిపాలనా విభాగంలో రెండు దశాబ్దులు పనిచేసిన శ్రీధరరావు చక్కని నటులు. భీమ పాత్రధారిగా ఆయన యావదాంధ్ర దేశానికి పరిచితులు. చక్కని గాత్ర, వాచికాభినయం గల శ్రీధరరావు పౌరాణిక నాటకాల ద్వారా ఆకాశవాణి కార్యక్రమాలలో పాల్గొన్నారు.

## మరికొందరు :

రేడియోలో కొద్దిరోజులు పనిచేసి వివిధ రంగాలలోకి వెళ్ళినవారు ఎందరో ఉన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో నాటక విభాగానికి ఆచార్యులుగా పని చేసి హైదరాబాదు కేంద్ర విశ్వ విద్యాలయంలో పనిచేసిన ఆచార్య మొదలి నాగభూషణశర్మ [illegible] రోజుల్లో రెండేళ్ళపాటు ఆకాశవాణి పూనా కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. అలానే మచిలీపట్టణంలో జాతీయ కళాశాలలో ఆంగ్లశాఖ రీడర్‌గా పనిచేస్తున్న శ్రీ P.V.G. కృష్ణశర్మగారు భోపాల్ కేంద్రంలో రెండేళ్ళు ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. 'మల్లిక్'గా కథా, నవలా రచయితగా వారపత్రికల ద్వారా పరిచితులైన 'మల్లిక్' హైదరాబాద్ వివిధభారతి కేంద్రంలో కొద్దికాలం పనిచేసి రాజీనామా చేశారు. ప్రస్తుతం విశాఖపట్టణంలో పోలీసు కమీషనర్‌గా పనిచేస్తున్న శ్రీ R.P. మీనా కొంతకాలంపాటు రాజస్థాన్‌లోని ఆకాశవాణి కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. ఇలా ఇంకెందరో !

# కడప కేంద్రం

ఆకాశవాణి కడప కేంద్రం రాయలసీమ ప్రాంత ప్రజల సాంస్కృతిక వాణిగా 1963 జూన్ 17న రిలే కేంద్రంగా ప్రారంభమైంది. అప్పట్లో కేంద్ర సమాచార ప్రసార శాఖామాత్యులు డా. బెజవాడ గోపాలరెడ్డి ఈ రిలే కేంద్రం ప్రారంభించారు. కొప్పర్తిలో రిలే స్టేషన్ నిర్మించి సాయంప్రసారాలు హైదరాబాదునుండి 20 కిలోవాట్ల ప్రసార శక్తితో ప్రారంభమయ్యాయి. 1975 జూన్‌లో స్వతంత్ర కేంద్రంగా ప్రసారాలు ప్రారంభమయిన సభకు రాష్ట్రమంత్రి యం. లక్ష్మీదేవి ముఖ్య అతిధి. బెంగుళూరుకు చెందిన టి. ఆర్. రెడ్డి తొలి అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరు. తర్వాత డైరక్టరుగా మంగుళూరు బదలీ అయ్యారు. వీరు బెంగుళూరు కేంద్రం డైరక్టరుగా 1986 జూన్‌లో రిటైరయ్యారు. బెంగుళూరులో స్థిరపడ్డారు.

1974 నవంబరు 2 నుండి పూర్తి ప్రసారాలు కడప కేంద్రం నుండి ప్రారంభమై, నిలయకళాకారులు, కార్యక్రమ నిర్వాహకులు చేరారు. కార్యక్రమ రూపశిల్పులలో శ్రీ బి. ఆర్. పంతులు, ఆర్. విశ్వనాథం, కె. రాజభూషణరావు, శ్రీ గోపాల్, డా ఆర్. అనంతపద్మనాభరావు, గొల్లపూడి మారుతీరావు. అరవీటి శ్రీనివాసులు. దేవళ్ళ బాలకృష్ణ, డి.కె. మరార్, శ్రీపి.ఆర్. రెడ్డి, వై. గంగిరెడ్డి, డా. టి. మాచిరెడ్డి, సుమన్, కౌతా ప్రియంవద వంటి వారు ప్రముఖులు. ఈ కేంద్రం రాయలసీమ వాసుల చిరకాల వాంఛలకు ప్రతీకగా ఎందరో కళాకారులను తీర్చిదిద్దింది.

బి. రామన్నపంతులు తొలినాళ్ళలో కార్యక్రమ ప్రణాళికను తీర్చిదిద్దడంలో కృషి చేశారు. 1939 మార్చి 21న తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురంలో జన్మించిన పంతులు 1960లో బెనారస్ హిందూవిశ్వవిద్యాలయం నుండి ఎకనామిక్స్‌లో ఎం.ఎ. చేశారు. 1963లో సెలక్షన్ ద్వారా ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరారు. విజయవాడ, ధార్వాడ, హైదరాబాదు కేంద్రంలో 1975 వరకు పనిచేశారు. 1975లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా కడప, పోర్ట్‌బ్లయర్, పాండిచేరి, మదరాసుల్లో పని చేశారు 1988లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా మదరాసులో చేరారు. 1988లో డైరక్టరుగాఢిల్లీలోని డైరక్టర్ జనరల్ కార్యాలయంవెళ్లారు. 1993-

96 మధ్యకాలంలో సంగీత విభాగం డైరక్టరుగా పచేశారు. వీరిసోదరులు గిరిజా శంకరరావు హైదరాబాదు కేంద్రం అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా పనిచేశారు.

రాళ్ళపల్లి విశ్వనాథం 1937 జనవరి13న శ్రీకాకుళంజిల్లాలో జన్మించారు. విశ్వనాధం ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా 23-7-63 నుండి మదరాసు. బెంగుళూరు విశాఖపట్టణం కేంద్రాలలో పనిచేసి ఒరిస్సాలోని సంబల్‌పూర్ బదలీ అయ్యారు. వీరు 1963లో ఆంధ్రవిశ్వవిద్యాలయం నుండి ఎం ఏ. పట్టా పొందారు. కొంత కాలం మదరాసు ఆంధ్రపత్రిక దినపత్రిక కార్యాలయంలో పనిచేశారు. 1975 జులైలో కడపకేంద్రానికి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా బదలీ అయ్యారు. అక్కడ నుండి విజయవాడ, అదిలాబాద్, హైదరాబాదు, వరంగల్ కేంద్రాలలో పనిచేశారు. 1986లో ASD అయి 90 నుండి స్టేషన్ డైరక్టర్‌గా C.B.S. హైదరాబాదులో పనిచేశారు. 1996 జనవరి 31న రిటైరయ్యారు. కార్యక్రమ రూపకల్పన పట్ల చక్కని అవగాహన గల విశ్వనాథం స్నేహశీలి.

భూషణరావుగా ప్రసిద్ధులైన కె.రాజభూషణరావు ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా కడప, విశాఖపట్టణ కేంద్రాలలో రెండు దశాబ్దాలు పనిచేసి 1994లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా పదవీ విరమణ చేసి భీమ్లిలో స్థిరపడ్డారు.

డా.తక్కోలు మాచిరెడ్డి హిందీలో పి.హెచ్‌డి. చేసిట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. ఆ తర్వాత U P S C ద్వారా 1975లో P E X గా చేరారు. జగదల్‌పూర్, కడప, రాంపూరు, స్టేషన్లలో పనిచేశారు. 1994లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా మడికెర (మైసూర్) బదలీ అయి తర్వాత అనంతపురం కేంద్రానికి వచ్చారు. సాహిత్యంలో చక్కటి అవగాహనగల మాచిరెడ్డి అభ్యుదయ భావాలుగల వ్యక్తి.

కడపజిల్లా ప్రొద్దుటూరులో జన్మించిన శ్రీనివాసులు చక్కటి గాయకుడు. ఆరవీటి శ్రీనివాసులు జానపద సంగీతవిభాగ ప్రయోక్తగాచక్కటికార్యక్రమాలు

నిర్వహించారు. ఎం.ఏ. పట్టభద్రుడైన శ్రీనివాసులు కడప కేంద్రంలో 75 లో అనౌన్సర్‌గా చేరి 1980లో ప్రొడ్యూసర్ అయ్యాడు. కడప, మదరాసు కేంద్రాలలో పనిచేసి 1994లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా అనంతపురం బదలీ అయ్యాడు. తర్వాత కడపకేంద్రం వచ్చాడు. మిమిక్రీ కళాకారుడుగా జానపద ప్రయోక్తగా శ్రీనివాసులు భావుకుడు. కొంతకాలం ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి సభ్యులు.

స్నేహసౌహార్ద్రాలకు ప్రతీక వై. గంగిరెడ్డి హైదరాబాదు కేంద్రంలో ఫారంరేడియో రిపోర్టర్‌గా చేరి 1978లో విశాఖపట్టణానికి F R O గా వెళ్ళారు. అక్కడ దశాబ్దికిపైగా పనిచేసి తిరుపతి బదలీ అయ్యారు. 1993లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా కడప బదలీ అయ్యారు బి.యస్‌సి (అగ్రికల్చర్) పూర్తిచేసిన గంగిరెడ్డి చిత్తూరు జిల్లాలో జన్మించారు. స్వయంగా రైతుకుటుంబంలో నుండి వచ్చారు గాన రైతుకార్యక్రమాలపట్ల చక్కని అవగాహన.

పి. వెంకటేశ్వరరావు అనబడే సుమన్ హిందీలో ఎం.ఎ. బి.యిడి. పూర్తి చేసి విజయవాడ కేంద్రంలో అసిస్టెంట్ ఎడిటర్ (స్క్రిప్ట్)గా చేరారు. 1979లో విద్యా ప్రసారాల విభాగం ప్రొడ్యూసర్‌గా రిక్రూట్ అయ్యారు. విజయవాడ, ఆదిలాబాద్ కేంద్రాలలో పనిచేశారు. సుమన్ 1994లో కడపకేంద్రం అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా బదలీ అయ్యారు. చక్కటి కథా రచయిత సుమన్ కార్యక్రమ రూపకల్పనలో అందవేసిన చేయి. సుమన్ 1996 జూన్ నుండి విజయవాడలో పనిచేస్తున్నారు.

కడప కేంద్రంలో మూడు దశాబ్దాలకు పైగా అనౌన్సర్లుగా శ్రీయుతులు గాదిచర్ల శ్రీనివాసమూర్తి, గుర్రం కోటేశ్వరరావు పనిచేశారు.

# విశాఖపట్టణం

ఆకాశవాణి విశాఖపట్టణ కేంద్రం 1963 జూన్‌లో రిలే కేంద్రంగా డా. బెజవాడ గోపాలరెడ్డి పవిత్రహస్తాలమీదుగా ప్రారంభమైంది. బాల్యారిష్టాలు దాటుకొని 1974లో మూడు ప్రసారాలు ప్రారంభించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం వంటి ప్రముఖ విద్యా సంస్థ ఈ కేంద్రానికి ఊపిరి. తొలినాళ్ళలో A.S.N.మూర్తి, N. రమణమ్మ డైరక్టర్లుగా పనిచేశారు.

ఉత్తరప్రదేశ్‌కు చెందిన రతన్‌సింగ్, నోరీన్‌నక్వీ ఈ కేంద్రం డైరక్టర్లుగా పనిచేసిన ఔత్తరాహులు. శ్రీమతి విజయలక్ష్మి సౌందరరాజన్, దేవళ్ళ బాలకృష్ణ, దుర్గాభాస్కర్ ఈ కేంద్రం అభివృద్ధికి కృషి చేశారు. డి. ప్రసాదరావు 1994లో కేంద్రనిర్దేశకులయ్యారు.

ఇక్కడ ప్రవచనశాఖ ప్రయోక్తగా ఒక దశాబ్ది పనిచేసిన పి. విజయ భూషణశర్మ సంస్కృతాంధ్రాలలో నిష్ణాతులు. కాటూరి వెంకటేశ్వరరావు కుమారులు విజయసారధి యిక్కడే అకౌంటెంట్‌గా పని చేశారు. ఆయన చక్కని రచయిత. ఆయన 1996 నవంబరులో పరమపదించారు.

ఇక్కడ ఒకదశాబ్దికాలం కె.ఆర్.భూషణరావు ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పని చేశారు. సూర్యనారాయణ నాటక ప్రయోక్తగా జాతీయ స్థాయిలో బహుమతులందు కొన్నారు.

వందకిలోవాట్ల ప్రసారశక్తితో శ్రీకాకుళం మొదలు రాజమండ్రి వరకు ఈ కేంద్ర ప్రసారాలు శ్రోతల్ని అలరిస్తున్నాయి. నేదునూరి కృష్ణమూర్తి, అరుంధతి సర్కార్ వంటి సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు ఈ కేంద్రం నుండి సంగీత కార్యక్రమాలు అందిస్తున్నారు. ఇవటూరి విజయేశ్వరరావు ఈ కేంద్రంలో సంగీత విభాగంలో పనిచేశారు.

వ్యవసాయ కార్యక్రమాలను సుసంపన్నం చేసిన వ్యక్తులలో Y. గంగిరెడ్డి ప్రముఖంగా చెప్పుకోదగినవారు.

విశాఖపట్టణ కేంద్రంలో రెండు దశాబ్దాలు పైగా కార్యక్రమనిర్వహణలో సామర్థ్యం చూపిన వ్యక్తి నలాది కనకారావు. కార్యక్రమ నిర్వాహకులుగా ఈయన పేరు తెచ్చుకొన్నారు. విజయవాడ కేంద్రంలో అతిచిన్న పదవిలో చేరి కార్యక్రమ

నిర్వాహకుడుగా 1994లో పదవీ విరమణ చేశాడు. కార్మికులకార్యక్రమ నిర్వాహకులుగా ఈయన పేరు గడించారు. వీరిని అమెరికాలో సన్మానించారు. కవి, రచయిత అయిన వలాది విశాఖపట్టణంలలో స్థిరపడ్డారు. 'ఆరవి'గా పేరు పొందిన ఆచంట సూర్యనారాయణమూర్తిగా ఈ కేంద్ర డైరక్టరుగా చక్కటి కార్యక్రమాల రూప కల్పనకు నాందీ ప్రవచనం చేశారు.

ఆచంట సూర్యనారాయణమూర్తిగారు ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా హైదరాబాదులో పనిచేసి అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా విశాఖపట్టణం వెళ్ళారు. అక్కడే డైరక్టరుగా పనిచేశారు. తర్వాత హైదరాబాదు వాణిజ్య ప్రసార కేంద్రం డైరక్టరుగా పనిచేసి పదవీ విరమణ చేశారు. ప్రస్తుతం హైదరాబాదులోని థియోసాఫికల్ సొసైటీ సంస్థ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొంటున్నారు. వీరు చక్కని రచయిత.

విశాఖపట్టణం కేంద్ర సంగీత విభాగంలో మృదంగ విద్వాంసులు శ్రీ వంకాయల నరసింహం, కొమండూరి కృష్ణమాచార్యులు, శ్రీమతి ఇందిరాకామేశ్వరరావు ప్రసిద్ధులు.

## మదరాసు కేంద్రం

1927 జూలై 23న బొంబాయిలో అప్పటి వైస్రాయి లార్డ్ ఇర్విన్ ఇండియన్ బ్రాడ్ కాస్టింగ్ కంపెనీకి చెందిన తొలి రేడియో కేంద్రాన్ని ప్రారంభించారు. గత 70 సంవత్సరాలలో రేడియోప్రసారాలు విరాట్ స్వరూపాన్ని పొందాయి. 1936లో ఇండియన్ బ్రాడ్ కాస్టింగ్ కంపెనీ 'ఆల్ ఇండియా రేడియో'గా నామాంతరం పొందింది. మైసూరులో రేడియో ప్రసారాలు 'ఆకాశవాణి'గా పేర్కొనబడేవి ఆదే పేరు 'ఆల్ యిండియా రేడియో' స్వీకరించింది.

ఆకాశవాణి నుండి తొలితెలుగు ప్రసారాలు మదరాసు కేంద్రం నుండి 1938 జూన్ 1 నుండి ఆరంభమయ్యాయి. తొలి తెలుగు అనౌన్సర్ మల్లంపల్లి ఉమామహేశ్వరరావు. ఆయన సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖర శర్మ సోదరులు. మదరాసు కేంద్రం సాంస్కృతిక వారధిగా వ్యవహరించేది. అప్పట్లో సుప్రసిద్ధులెందరో కార్యక్రమ నిర్వాహకులుగా పనిచేశారు. సర్వశ్రీ సూరినారాయణమూర్తి, డా. అయ్యగారి వీరభద్రరావు, ఆచంట జానకీరాం, డా. బాలాంత్రపు రజనీకాంతారావు, బుచ్చిబాబు, ప్రయాగ, జలరుక్, జాషువా మొ॥

"వాణి" పక్షపత్రిక మదరాసునుండి రెండు దశాబ్దాలపైగా కార్యక్రమ వివరాల పత్రికగా వెలువడింది. ఆ తరువాత 1972లో విజయవాడ కేంద్రానికి 'రజని'గారి హయాంలో తరలించబడింది. 1985 ప్రాంతాలలో పక్షపత్రిక'వాణి' లాభదాయకం కాదనే కారణంతో మంత్రిత్వశాఖ మూసివేసింది. అది లేని లోటు తీరనిది.

మదరాసు 'బి' కేంద్రంనుండి తెలుగు కార్యక్రమాలు యిప్పటికీ ప్రసార మవుతున్నాయి. 1948 డిసెంబరులో, విజయవాడ కేంద్రం ప్రారంభమయ్యేవరకు తెలుగు ప్రసారాలు మదరాసు నుండే ఒక దశాబ్ది వరకు కొనసాగాయి. అప్పట్లో 'LIVE' కార్యక్రమాలు ఎక్కువ ఉండేవి. నాటకాలు, సంగీత కార్యక్రమాలు అన్నీ యధాతథంగా ప్రసారమయ్యేవి. ఆ తర్వాత గ్రామఫోను రికార్డులు 'కట్' చేసేవారు. అది శ్రమతో కూడినపని. 'స్పూల్ టేప్‌లు' వాడకం మొదలైన తర్వాత రికార్డింగులో సౌలభ్యం సమకూరింది. కార్యక్రమ నిర్వాహకులు ఆర్టిస్టులకు బాగా రిహార్సల్సు యిచ్చి కార్యక్రమాన్ని రూపొందించి 'ప్రొడ్యూస్' చేయడానికి శ్రమ పడేవారు. అవిభక్త మదరాసు రాష్ట్రంలో ఆంధ్రదేశంలో చాలా భాగం వుండటం వల్ల ప్రసారాలు చాలామంది వినేవారు. 1942-45 మధ్య కాలంలో ఢిల్లీనుండి తమిళ తెలుగు కార్యక్రమాలు దక్షిణప్రాంత వాసులకు ప్రసారమయ్యేవి.

మదరాసు కేంద్రంలో యిటీవలి దశాబ్దిలో పని చేసిన ప్రముఖులలో సర్వశ్రీ యస్. వేణుగోపాలరెడ్డి, యస్. శంకర్‌నారాయణ, వి. చంద్రమౌళి, దుర్గాభాస్కర్, వింజమూరి లక్ష్మి, గొల్లపూడి మారుతీరావు, యిలా ఎందరో చెప్పుకోదగినవారు.

S. వేణుగోపాలరెడ్డి 15-2-40న శ్రీకాళహస్తి తాలూకాలో జన్మించారు. 1963లో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా ఆకాశవాణిలో చేరి ధార్వాడ్, మదరాసు కేంద్రాలలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా, అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా వ్యవహరించారు. 23-1-85న స్టేషన్ డైరక్టర్‌గా తిరుచురాపల్లి బదలీ అయ్యారు. 1992–93 మధ్యకాలంలో మదరాసు కేంద్ర స్టేషన్ డైరక్టర్‌గా వ్యవహరించారు. ఆ తర్వాత పాండిచేరి వెళ్ళారు. అక్కడినుండి బొంబాయి కేంద్రం డైరక్టర్ అయ్యారు.

S శంకరనారాయణ 20-2-37న జన్మించారు. సుప్రసిద్ధ చిత్రకారులు, సంగీత దర్శకులు 'బాపు' వీరి సోదరులు. శంకర నారాయణ ట్రాన్స్‌మిషన్ ఎగ్జి

క్యూటివ్‌గా 1963 జనవరిలో విశాఖపట్టణం, మదరాసు కేంద్రాలలో పని చేశారు. 1981 నుండి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా వివిధ కేంద్రాలలో పని చేశారు. అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా, గుల్బర్గా కేంద్రంలో పనిచేసి 1993 నుండి మదరాసు వాణిజ్య ప్రసార కేంద్రం డైరక్టర్‌గా పనిచేసి 1995 ఫిబ్రవరిలో రిటైరయ్యారు. శంకర నారాయణ చక్కటి చిత్రకారులు, సౌమ్యులు.

వి. చంద్రమౌళి 1931 ఆగస్టు 28న జన్మించారు. 1964లో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా ఆకాశవాణిలో చేరి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్, అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరు, డైరక్టరుగా వివిధ కేంద్రాలలో పని చేశారు. మదరాసు వాణిజ్య ప్రసార కేంద్రండైరక్టరుగా పనిచేసి పాండిచ్చేరి స్టేషన్ డైరక్టర్‌గా 1989లో రిటైరయ్యారు.

మదరాసు కేంద్రంలో పని చేసిన మరో అధికారి కె. ఆంజనేయులు. వీరు 1934 జూన్ 3న జన్మించారు. 1954లో ఆకాశవాణిలో చేరి 1986లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా నాగర్‌కోయిల్ లోకల్ కేంద్రం బదిలీ అయ్యారు. 1992లో ఆంజనేయులు రిటైరయ్యారు. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా మదరాసు నుండి తెలుగు ప్రసారాల ప్రయోక్తగా ఆంజనేయులు సుపరిచితులు. వింజమూరి లక్ష్మి, కె. కలి వేలు, రామమోహనరావు, విజయసారథి, పద్మజా నిర్మల ఇలా ఎందరో కార్య క్రమ నిర్వాహకులు తెలుగు కార్యక్రమాలు రూపొందించారు.

శ్రీమతి దుర్గాభాస్కర్ 1945 ఫిబ్రవరి నాలుగున ఏలూరులో సుప్రసిద్ధ గాయకులు ఈదర నాగరాజాగారికి జన్మించారు. దుర్గారాణిగా 1963 అక్టోబరులో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరారు. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా మదరాసు కేంద్రంలో పని చేశారు. 1984లో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా అహమ్మదాబాద్ వాణిజ్య ప్రసార విభాగంలో పని చేశారు. అక్కడ నుండి విశాఖపట్టణం, మదరాసు కేంద్రాలలో పని చేశారు. 1993 ఏప్రిల్ నుండి విజయవాడ కేంద్రం తొలి మహిళా డైరక్టరుగా పనిచేశారు. 1995 మార్చిలో మదరాసు కేంద్రం డిప్యూటీ డైరక్టరుగా బదిలీఅయ్యారు. లలిత సంగీతంలో దుర్గా భాస్కర్ చక్కటి గాయని.

పాత తరానికి చెందిన వారిలో జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, ప్రయాగ నర సింహశాస్త్రి, న్యాయపతి రాఘవరావు, కామేశ్వరి దంపతులు తెలుగు ప్రసారాల బావుటాను నిను వీధుల్లో ఎగుర వేశారు. సినీ ప్రముఖులు ఎందరో యిక్కడి

నాటక విభాగం నుండి పాల్గొంటున్నారు. నాటక రచయితగా, నటులుగా వారు ఆకాశవాణి ప్రసారాలకు దోహదం చేస్తున్నారు.

గొల్లపూడి మారుతీరావు ఈ కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పని చేశారు. అలానే M. S. శ్రీరాం దూరదర్శన్ మదరాసు కేంద్రంలో అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా వ్యవహరించారు. శ్రీటి.వి.రాఘవాచార్యులు తమిళనాడులో అనేక కేంద్రాలలో పని చేశారు. నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాళెంలో 1938 డిసెంబరు 24న జన్మించిన రాఘవాచార్యులు 1963 జనవరిలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరారు. వివిధ కేంద్రాలలో పనిచేసి (తిరుచి, మదరాసు) అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా,డిప్యూటీ డైరక్టరుగా దూరదర్శన్ హైదరాబాదు కేంద్రంలో ఆరు సంవత్సరాలు (1987-95) మధ్య పని చేశారు. 95 నుండి భోపాల్ దూరదర్శన్‌లో డిప్యూటీ డైరక్టరుగా పనిచేస్తున్నారు. రాఘవాచారి రచయిత. కాంచీపుర క్షేత్రాలను గూర్చి ఒక గ్రంథం వ్రాశారు. ఆధ్యాత్మిక భావసంపత్తి గల రాఘవాచారి కంచి కామకోటి పీఠానికి బాగా సన్నిహితులు.

కుమారి S.లీల 1939 నవంబర్ 22న జన్మించారు. M.G. రామచంద్రన్ సరసన సినిమాలలో నటించారు. 1963లో మదరాసులో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరి 1981లో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అయ్యారు. 1989లో స్టేషన్ డైరక్టర్‌గా పదోన్నతి పొంది కొద్దిరోజులు డైరక్టరేట్‌లో పనిచేసి ఆ తర్వాత మధురై కేంద్రం డైరక్టర్‌గా చేరారు.

## డా॥ డి. ఆంజనేయులు

ఆకాశవాణి వార్తా విభాగంలో పని చేసిన ఎందరో ఆంధ్ర ప్రముఖులు జర్నలిస్టులుగా పేరు తెచ్చుకొన్నారు. ధూళిపూడి ఆంజనేయులు గుంటూరు జిల్లా ఎలవర్రులో 1924 జనవరి 10న జన్మించారు. మదరాసు క్రిస్టియన్ కళాశాలలో ఎం. ఏ. పట్టభద్రులయ్యారు. ఆ తర్వాత లా పట్టా పుచ్చుకున్నారు. ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో 1948–53 వరకు పనిచేసి '53-58 మధ్యకాలంలో 'హిందూ'పత్రికలో పని చేశారు.

"వాణి" పత్రిక సంపాదక బాధ్యతలను 1959లో మదరాసులో చేపట్టడంతో ఆధున ఆకాశవాణి సంబంధం ప్రారంభమైంది. ప్రెస్ ఇన్ఫర్మేషన్ బ్యూరో హైద

రాజాదు విభాగం అధికారిగా 1971-75 మధ్యకాలంలో పని చేశారు. 1977 నుండి ఆకాశవాణి వార్తా విభాగంలోను ఆ తర్వాత దూరదర్శన్ న్యూస్ ఎడిటర్‌గా పని చేసి 1981లో పదవీ విరమణ చేశారు.

రచయితగా, గ్రంథకర్తగా, గ్రంథ సమీక్షకులుగా ఆంజనేయులు మదరాసులో పేరు తెచ్చుకొన్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ వారికి సి. ఆర్. రెడ్డి జీవిత చరిత్రను, కందుకూరి వీరేశలింగం జీవిత చరిత్రను వ్రాశారు. సోవియట్ యూనియన్, ఐరోపా దేశాల పర్యటన వివరాలతో "Window to the West" అనే గ్రంథం వ్రాశారు. ఆధునిక తెలుగు కవులు దేవులపల్లి, శ్రీశ్రీ కవితల్ని ఆంగ్లంలోకి అనువదించారు. హిందూ పత్రికలో "Between you and me" శీర్షిక ఒక దశాబ్దిపాటు నిర్వహించారు. మూడేళ్ళు మదరాసు ప్రెస్‌క్లబ్ అధ్యక్షులుగా వ్యవహరించారు. తెలుగువారు గర్వించదగిన ఆంగ్ల జర్నలిస్టు. దక్షిణ భారతంలో షష్టి ఆంగ్ల రచయితగా ప్రఖ్యాతి తెచ్చుకొన్న కొద్దిమంది రచయితల్లో ఆంజనేయులు ప్రముఖులు. హిందూ పత్రికతో వీరిని సన్నిహిత సంబంధం వుంది. వీరి సమీక్షలు సాహితీ విమర్శకు నికషోపలాలు. ఆంజనేయులు మదరాసు నగరంలో స్థిరపడ్డారు.

## గుర్రం జాషువా 1895-1971 :

గుర్రం జాషువా గుంటూరు జిల్లా వినుకొండలో 1895 సెప్టెంబరు 28న జన్మించారు. నవయుగ కవి చక్రవర్తిగా కీర్తి గడించారు. 1910 నుండి 15 వ సం॥వరకు టీచరు వృత్తిని చేపట్టి పేరు తెచ్చుకొన్నారు. 1919 నుండి గుంటూరు ట్రైనింగ్ స్కూలులో టీచర్‌గా 10 ఏళ్ళు పనిచేశారు. 1929 నుండి ఉభయభాషా ప్రవీణ పండితులుగా జిల్లాబోర్డు పాఠశాలల్లో పనిచేశారు. కవి కోకిల, కవిదిగ్గజ, మధుర శ్రీనాథ బిరుదులతో పాటు కనకాభిషేక గజారోహణాలు పొందారు.

ఆకాశవాణి మదరాసు కేంద్రంలో తెలుగు ప్రసంగాల ప్రొడ్యూసర్‌గా 1956లో చేరారు. (1956-59) నాలుగేళ్ళ పాటు విధి నిర్వహణ చేశారు. ఆయన కవితా కంఠం విలక్షణమైంది. తెలుగుజాతి నుడికారం ఆయన కొల్లగొట్టారు. వీరేశలింగం గారిని రాజమహేంద్రవరంలో కలుసుకోగా వారు చిలకమర్తిని పరిచయం చేశారు.

క్రీస్తు చరిత్ర, బాపూజీ, నేతాజీ, గబ్బిలం, ఫిరదౌసి, స్వప్నకథ, స్వయం వరం, కాందిశీకుడు, ముసాఫిరులు, తారాబాయి, మీరాబాయి ప్రసిద్ధ ఖండకావ్యాలు. ఎన్నో నవలలు, నాటకాలు వ్రాశారు.

1910 లో వీరికి వివాహం జరిగింది. అంటరాని తనం పనికి రాదని ఆక్రోశించిన కవి ఆయన. దీపాల పిచ్చయ్యశాస్త్రి, జాషువా జంట కవులుగా పద్య రచనకు పూనుకొన్నారు. 'పిచ్చి జాషువా' 'జాషువాపిచ్చులు' అనే జంటనామం కుదరక మళ్ళీ విడివిడిగా రచనలు చేశారు హరిశ్చంద్ర నాటకంలో 'కాటిసీమ' పద్యాలు జాషువా గారివే యిప్పటికీ నటులు ప్రదర్శించడం విశేషం. 1915-16 మధ్య కాలంలో మూకీకథా చిత్రాలకు వాచకుడుగా పనిచేశారు. కొంత కాలం నాటక కర్తగా 'చింతామణి నాటకమండలి' వారికి సహకరించారు. 1964లో ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యులుగా గవర్నరు నామినేట్ చేశారు ఆ పదవిలో కొంతకాలం పనిచేశారు. 1970లో ఆంధ్ర విశ్వ కళా పరిషత్ కళాప్రపూర్ణతో, భారత ప్రభుత్వం పద్మభూషణతో సత్కరించాయి. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు స్వయంగా గండపెండేరం జాషువా కాలికి తొడిగారు. 1964లో కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. జాషువా మహాకవి 1971 జులై 24న మరణించారు.

జాషువాగారి కుమార్తె హేమలతా లవణం. వీరు జాషువా శతజయంతి వైభవంగా జరిపి జ్ఞానపీఠ స్థాయిలో ఏటా ఒక లక్ష రూపాయలతో ఒక కవిని సన్మానించే సంప్రదాయం మొదలుపెట్టారు.

**ఆచంట జానకీరామ్ :**

1938 జూన్ 16న మదరాసులో సీనియర్ ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా ఆచంట జానకిరామ్ పనిచేశారు. సుప్రసిద్ధ సంఘసేవకురాలు, అవిభక్త మదరాసు రాష్ట్రంలో ఆరోగ్యశాఖామంత్రిణి డా॥ ఆచంట రుక్మిణమ్మ, లక్ష్మీపతి కుమారులు. జానకీరామ్ 1903 జూన్ 16న జన్మించారు. తొలిడైరక్టర్ జనరల్ లైనిల్‌ఫీల్డెన్

నియమించిన తొలి తరం వారిలో అచంట ఒకరు. సున్నితమైన మనస్సు, తెల్లని దుస్తులు ధరించి కార్యక్రమ రూపకల్పనలో మేటి అనిపించుకున్నారు జానకిరాం.

మదరాసు కేంద్రం నుండి తొలి తెలుగు నాటకం 'అనార్కలి' జానకిరాం ప్రయోక్తగా వెలువడింది. వాణి ఎడిటర్‌గా మదరాసు కేంద్రంలో ఒక దశాబ్దిగా పని చేసి పదవీ విరమణ చేశారు. వీరి సతీమణి అచంట శారదాదేవి పద్మావతీ మహిళా కళాశాల తెలుగు శాఖ అధ్యక్షురాలిగా పనిచేశారు. జానకిరాం తిరుపతిలో 1961 నుండి విశ్రాంత జీవనం గడిపి 1994లో తనువు చాలించారు. అప్పటి వయస్సు 88సం॥.

స్మృతి పథాలు, సాగుతున్న యాత్ర వీరి రచనల్లో ప్రముఖాలు. జానకిరాం సున్నితమైన ఆధునిక చిత్రకళలో ప్రావీణ్యం సంపాదించారు. 170కి పైగా స్వీయ చిత్రాలను ఆంధ్ర మహిళా సభకు బహూకరించారు.

అడయార్‌లో బి.యస్‌సి. ఆనర్సు చదివారు. అప్పుడు రవీంద్రనాథ ఠాగూర్ దాని ఛాన్సలర్. రవీంద్రనాధ్, అనిబిసెంటు, జేమ్స్‌కజిన్స్ వీరిని ప్రోత్స హించారు.

కొంతకాలం ఢిల్లీలో దక్షిణ భారత ప్రసారాల విభాగంలో పనిచేశారు. తర్వాత తిరుచురాపల్లి కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసి మదరాసు చేరారు. 120 పైగా తమిళ నాటకాలు మిత్రుల సాయంతో ప్రసారం చేశారు. ఆంధ్ర దేశం నలుమూలలనుండి పండితులను పిలిపించి తెలుగు ప్రసంగాలు ఏర్పాటు చేశారు. 21 సం॥లు ఆకాశవాణిలో ప్రముఖ పదవులు నిర్వహించారు.

వాణి పత్రిక సహాయ సంపాదకులుగా పనిచేశారు. ఢిల్లీ విదేశ ప్రసారాల విభాగంలో పనిచేసి 1959లో మదరాసు కేంద్రంలో ASDగా పదవీ విరమణ చేశారు. 1960 లో టాగూరు శతజయంతి సంఘ కార్యదర్శిగా పనిచేశారు. స్వర్ణపీఠ వీరి కావ్యం. చలం ఆ కావ్యం చదివి సంతోషించారు. వీరి జన్మ దిన సందర్భంగా 1971లో ఆంధ్రమహిళా సభవారు Glimpses of Telugu Literature అనే వీరి రచనను ప్రచురించారు.

జానకిరాం కోమల హృదయుడు.

**జనమంచి రామకృష్ణ :**

తొలి తరం ప్రసార ప్రముఖులలో జనమంచి రామకృష్ణ ప్రముఖులు. మదరాసు కేంద్రంలో స్టాఫ్ ఆర్టిస్టుగా 1948లో చేరి చాలాకాలం అక్కడే పనిచేశారు. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా సెలక్టు అయి హైదరాబాదు చేరుకొన్నారు. వీరి ఆధ్వర్యంలో నాటకాలు బహుళ జనామోదం పొందాయి. స్వయంగా రచయిత. కొంత కాలం ఢిల్లీ నుండి తెలుగు వార్తలు చదివారు. 1980లలో హైదరాబాదు కేంద్రంలో పదవీ విరమణ చేసి కొంత కాలం తర్వాత తనువు చాలించారు. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ శ్రీ రమేష్ పాత్రో వీరి సన్నిహిత బంధువులు.

M. S. శ్రీరాం ;

శ్రీరాం సంగీత దర్శకుడుగా చలనచిత్రరంగంలో లబ్ధ ప్రతిష్ఠులు. మంచి రోజు, పెళ్ళి రోజు చిత్రాలకు జమున నాయికగా వీరి దర్శకత్వంలో వెలువడ్డాయి. 1977లో UPSC ద్వారా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా నియమితులై విజయవాడ కేంద్రంలో చేరారు. రెండేళ్ళ తర్వాత కడప బదలీ అయ్యారు. అక్కడ నుండి మదరాసు దూరదర్శన్ కేంద్రానికి బదలీ అయ్యారు. అక్కడే అసిస్టెంట్ డైరక్టర్‌గా పదోన్నతి పొందారు. అక్కడ పని చేస్తుండగా హఠాన్మరణం పొందారు. ఈమని శంకరశాస్త్రిగారు వీరికి మేనమామ.

చక్కటి సంగీత కార్యక్రమాల రూపకల్పనచేసిన శ్రీరాం ప్రసార రంగంలో చెప్పుకోదగిన ప్రముఖులు.

## ఢిల్లీ తెలుగు వార్తలు

'తెలుగులో వార్తలు-చదువుతోంది కొంగర జగ్గయ్య' అని తన సుమధుర గళంతో వార్తలు వినిపించారు జగ్గయ్య. అది స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్ళు. ఢిల్లీనుండి తెలుగులో వార్తలు రెండో ప్రపంచ యుద్ధానికి ముందు నుండి ప్రసారమౌతున్నాయి శ్రీశ్రీ వంటి సుప్రసిద్ధులు తెలుగు వార్తలు తొలిరోజుల్లో చదివారు. జగ్గయ్య ఆ తర్వాత సినీరంగం ప్రవేశించి హీరోగా పేరు తెచ్చుకొన్నారు. కొంత కాలం ఒంగోలు పార్లమెంటు సభ్యులుగా (కాంగ్రెసు) వ్యవహరించారు. కపిల కాశీపతి, శ్రీ వాత్సవ, కొత్తపల్లి సుబ్రహ్మణ్యం, పన్యాల రంగనాథరావు, వనమాలి ప్రసాద్, జోళిపాళ మంగమ్మ, కందుకూరి సూర్యనారాయణ, తిరుమలశెట్టి

శ్రీరాములు, అద్దంకి మన్నార్, వావిలాల రాజ్యలక్ష్మి, దుగ్గిరాల పూర్ణయ్య, ఏడిద గోపాలరావు-మావిళ్ళపల్లి రాజ్యలక్ష్మి వార్తలు చదవడంతో తెలుగువారి హృదయాలకు సన్నిహితులయ్యారు.

ప్రస్తుతం వార్తలు ఢిల్లీ నుండి సమ్మెట నాగ మల్లేశ్వరరావు, గద్దె దుర్గారావు, యంత్రపాటి మాధవీలత, వడ్లమూడి రాజేశ్వరి చదువుతున్నారు. వీరుగాక క్యాజువల్‌గా మరికొందరు వార్తలు చదువుతున్నారు. నరసింగరావు, న్యూస్ రీడర్‌గా కొంతకాలం పనిచేసి వ్యాధిగ్రస్తులై మరణించారు. సూర్యదేవర ప్రసన్న కుమార్ వార్తలు చదువుతున్నారు.

వనమాలి ప్రసాద్ డైరక్టర్, వార్తా విభాగంగా ఢిల్లీలో పనిచేశారు.

ఏడిద గోపాలరావు 1996 సెప్టెంబరు 30 న ఢిల్లీ వార్తా విభాగంలో న్యూస్ రీడర్‌గా పదవీ విరమణ చేయడంతో ఒక పాత శకం అంతరించింది. రంగస్థల నటుడుగా, దర్శకుడుగా, కార్యకర్తగా ఆయనకు మంచిపేరు. ఢిల్లీలో 'నరన నవరస' అనే నాటక, సాంస్కృతిక సంస్థను స్థాపించి రెండు దశాబ్దాలు పోషించారు. వందకు పైగా నాటకాలు ఆ సంస్థ ద్వారా ప్రదర్శించారు. ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ గౌరవ సభ్యులుగా కొంతకాలం పనిచేశారు. 'థియేటర్ ఆర్ట్స్'లో డిప్లొమా పొందారు. ఉత్తరాదిలో దక్షిణాది ప్రముఖుల పేర వివిధ పత్రికలలో వ్యాసాలు ప్రచురించారు. మాస్కో రేడియోలో 1982-86 మధ్యకాలంలో పనిచేశారు. అక్కడ వారికి పత్నీ వియోగం కలిగింది. ప్రముఖ సినీ నిర్మాత ఏడిద నాగేశ్వరరావు వీరి సోదరులు. 1996 సెప్టెంబరులో వీరు పదవీ విరమణ చేశారు.

## శ్రీశ్రీ (1910-1983) :

1910 జనవరి 2న విశాఖ పట్టణంలో జన్మించిన శ్రీరంగం శ్రీనివాసరావు ఆధునికాంధ్ర కవిత్వంలో విశిష్టకవి. ప్రకృతి శాస్త్రంలో మదరాసు విశ్వవిద్యాలయం నుండి పట్టభద్రులైన తర్వాత కొన్నాళ్ళు పత్రికలలో ఉపసంపాదకులుగా పనిచేశారు. ఆ తర్వాత 1950లో చలన చిత్రరంగంలో చేరి విశిష్ట స్థానం సంపాదించారు. మాటలు, పాటలు వ్రాసి ప్రేక్షకుల ఆదరం సంపాదించారు. ఆకాశవాణి ఢిల్లీ కేంద్రం నుండి తెలుగు వార్తలు కొంతకాలం చదివేవారు.

శ్రీశ్రీ మొదటి కవితా సంపుటి ప్రభవ 1928లో ప్రచురితమైంది. మహాప్రస్థానం, ఖడ్గసృష్టి. మూడు యాభైల కవితా సంపుటాలు. 1+1, చతురస్రం

ప్రయోగ నాటికలు, వ్యాసాలు, ప్రసంగాలు, నాటకాలు ఆకాశవాణి ద్వారా ప్రసారిత మయ్యాయి. ఆకాశవాణి ఉగాది కవి సమ్మేళనాలలో ఆయన పాల్గొనడం ఒక హైలైట్. 1979 లో వారికి రాజాలక్ష్మి ఫౌండేషన్ అవార్డు లభించింది. 1973 లో ఆంధ్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రకటించారు.

1971 లో శ్రీశ్రీ షష్టిపూర్తి సంఘం శ్రీశ్రీ సాహిత్య సంపుటాలను ప్రచు రించింది. 'విరసం' ఆవిర్భావానికి ఆయన కారకులు. తొలి అధ్యక్షులు. 1966 లో సోవియట్ భూమి నెహ్రూ అవార్డు పొంది సోవియట్ యూనియన్‌లో పర్యటిం చారు. 'గర్జించు రష్యా', 'గాండ్రించు రష్యా', 'అన్నవీరి కవిత ప్రసిద్ధం. 1930-0 మధ్య వ్రాసిన కవితలు మహాప్రస్థానంగా ప్రకటించారు. అభ్యుదయ సాహిత్యో ద్యమానికి రథసారధి అరుద్రతో బాంధవ్యం వుంది. తన 74వ ఏట (15-6-83) శ్రీశ్రీ కాలధర్మం చెందారు.

అవిభక్త మదరాసు రాష్ట్ర శాసనమండలిలో సభ్యులుగా శ్రీశ్రీ వ్యవహ రించారు. ఆంధ్రంలోను, ఆంగ్లంలోను సమానంగా సామర్థ్యం చూపగల దిట్ట. 1946లో 'వారం వారం' అనే వచన రచనల సంకలనం, 1956లో మరో ప్రపంచం అనే రేడియో నాటికల సంపుటి, 1957లో చరమరాత్రి కథల సంపుటి ప్రచురించారు. ప్రాసక్రీడల పేరుతో కార్టూన్ కవిత్వానికి నాంది పలికింది శ్రీశ్రీ. 'లిమరుక్కులు' అనే హాస్యధోరణిలో కవితలు వ్రాశారు. 1943లో అభ్యుదయ రచయితల సంఘ అధ్యక్షులయ్యారు. సాహిత్యోద్యమాలతో నిరంతరం అనుబంధం పెంచుకున్న వ్యక్తి శ్రీశ్రీ. ఇరవై శతాబ్ది తెలుగు సాహిత్యంలో విలక్షణ కవితాయుగ ప్రవర్తకుడు శ్రీశ్రీ.

## కొంగర జగ్గయ్య :

కంచు కంఠంతో ఆంధ్ర సినీ ప్రేక్షకులను మూడు దశాబ్దాలు అలరించిన కొంగర జగ్గయ్య రేడియోలో వార్తలు చదివారంటే ఈ తరానికి తెలియదు. ఢిల్లీ కేంద్రం నుండి ప్రసారమయ్యే తెలుగు వార్తలను ఒక సంవత్సరంపాటు 1947 ప్రాంతాలలో చదివారు జగ్గయ్య. జగ్గయ్య దుగ్గిరాల (గుంటూరు జిల్లా)లో 1920 దశకంలో జన్మించారు. బి. ఏ. పూర్తిచేసి రేడియోలో పనిచేస్తున్న కాలంలో పిపీ

దర్శకుల దృష్టిలో పడ్డారు. వందలాది చలన చిత్రాలలో పనిచేశారు. చాలా సినిమా లలో డబ్బింగ్ వాయిస్ ఇచ్చారు. స్వయంగా చిత్రాలు నిర్మించారు.

1971 లో పార్లమెంటుకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు పక్షాన నిలబడి ఒంగోలు లోక్‌సభ స్థానానికి ఎంపికయ్యారు. లోక్‌సభలో సాంస్కృతిక విషయా లను ప్రస్తావించి సభ్యుల దృష్టిని ఆకర్షించారు.

స్వయంగా రచయిత అయిన జగ్గయ్య రవీంద్ర గీతావళిని తెలుగులోకి అనువ దించి ప్రచురించారు. చక్కటి పద్యరచన చేయగల సమర్థులు జగ్గయ్య. ఆత్రేయగారి మీద అభిమానంతో 'మనస్విని' ప్రచురణలు వెలువరించారు. జగ్గయ్య మదరాసులో స్థిరపడ్డారు.

## విదేశీ తెలుగు కార్యక్రమాలు

రేడియో మాస్కో నుండి 1968 నుండి తెలుగులో అరగంట కార్యక్రమాలు ఆసియా దేశాలకు ప్రసారమయ్యేవి. కమ్యూనిస్టు రష్యా విడిపోయి ముక్కలైన తర్వాత ఈ ప్రసారాలు నిలిచిపోయాయి. ఢిల్లీ వార్తల విభాగం నుండి ఎందరో మాస్కోకి డెప్యుటేషన్‌మీద రెండేళ్ళపాటు వెళ్ళి అక్కడ ఒకరిద్దరు ఉద్యోగుల సహకారంతో తెలుగు కార్యక్రమాలు రూపొందించారు.

వారిలో శ్రీయుతులు తిరుమలశెట్టి శ్రీరాములు, కందుకూరి సూర్యనారా యణ, అద్దంకి మన్నార్, ఏడిద గోపాలరావు, భండారు శ్రీనివాసరావు (హైదరా బాదు) చెప్పుకోదగినవారు. వారు ఆ దేశీయుల ప్రేమాదరాలకు పాత్రులయ్యారు.

ఆకాశవాణి విదేశీ ప్రసార విభాగం ఓవర్‌సీస్ ప్రసారాలలో తెలుగు ప్రసారాలను 1990 ఉగాది నుండి ప్రారంభించింది. అప్పట్లో కేంద్ర ప్రసారశాఖా మంత్రిగా పర్వతనేని ఉపేంద్రఉండేవారు ఉదయం 4-30 ని.ల ప్రాంతంలో 30నిము షాలు ఈ ప్రసారాలు ఢిల్లీ నుండి జరిగేవి. 1995 నుండి ఈ విదేశీ ప్రసారాలు హైదరాబాదు కేంద్రం నుండి ప్రసారమవుతున్నాయి. South East Asia దేశాల

సులకు ఈ ప్రసారాలు ఉద్దేశించబడ్డాయి. సా॥ 5-45 నుండి అరగంటపాటు ఈ ర్యక్రమాలు ప్రసారమవుతాయి. అలానే శ్రీలంక నుండి సిలోన్ బ్రాడ్ కాస్టింగ్ ర్పొరేషన్ వాణిజ్య ప్రసార విభాగం తెలుగు సినిమా పాటలతో చాలా పాపులర్ యింది. శ్రోతలు కోరిన పాటలు, వారి పేర్లు ప్రసారం చేస్తూ ఎందరినో ఆక చింది. ప్రకటనలు బాగా లభించేవి. 'బినాకా గీతామాలిక' వంటి ప్రముఖ ర్యక్రమాలు శ్రోతల్ని బాగా ఆకర్షించాయి. వాణిజ్య ప్రకటనలకు వ్యాపార ర్తలు సిలోన్ రేడియోను ఆశ్రయించేవారు.

ఇటీవల వివిధ భారతి వాణిజ్య ప్రసారాలు ప్రముఖమైన తర్వాత ఈ ణిజ్య ప్రసార విభాగంవారు సిలోన్ నుండి ప్రసారాలు తగ్గించారు.

ఇటీవల విశ్వవాణి, సువార్తవాణి పేర తెలుగులో క్రైస్తవ మత ప్రచార సారాలు జరుగుతున్నాయి. విశ్వవాణి మీడియంవేవ్‌పై చాలా శక్తివంతంగా ) KHZ మీద ప్రసారాలు చేస్తూ అదే మీటర్లపై పనిచేసే కేంద్రాల కంటె క్తివంతంగా ఉండేది. దాన్ని అధిగమించడానికి కడప, విశాఖపట్టణం, విజయ డ కేంద్రాల ప్రసారశక్తిని 100 KW స్థాయికి పెంచాల్సి వచ్చింది.

## ర్తా విభాగం :

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ప్రాంతీయ వార్తా విభాగం ఎందరో వసిద్ధుల్ని తయారు చేసింది. వార్తలు చదవడంలో తమదైన ప్రత్యేకతను చాటు న్న వారెందరో వున్నారు.

శ్రీ తురగా కృష్ణమోహన్. వీరు ప్రత్యేక బాణీలో వార్తలు చదివే వారు. గోల్కొండ ఎక్స్‌ప్రెస్ ప్రథమ ప్రయాణం కవర్ చేయడానికి ర్యాటీ మీద వెళ్ళారు. దురదృష్టవశాత్తు రైలు వెళ్ళిపోయింది. దాన్ని కాజీ పటలో అందుకోందామని పాత్రికేయ బృందం వాహనంలో వెళ్తూ రోడ్డు ప్రమాదంలో దుర్మరణం చెందారు. వీరి సతీమణి తురగా జానకీరాణి రచయిత్రి. రు ఆకాశవాణిలో మహిళా కార్యక్రమాల ప్రొడ్యూసర్‌గా రెండు దశాబ్దాలు పని సి అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా రిటైరయ్యారు. పన్యాల రంగనాధరావు తమ

గాత్ర గాంభీర్యంతో శ్రోతల్ని అలరించేవారు. పదవీ విరమణ తర్వాత 'సమయం' పత్రికా సంపాదకులుగా పనిచేసి హైదరాబాదులో మృతి చెందారు. గోళ్ళమూడి నళినీమోహన్ హైదరాబాదులో వార్తలు చదివేవారు. పిదప తర్వాత ఢిల్లీ జనరల్ న్యూస్ రూమ్‌లో ఎడిటర్‌గా పదవీ విరమణ చేశారు.

న్యూస్ రూంలో అసిస్టెంట్ ఎడిటర్లుగా ఎందరో పని చేశారు. వారిలో వజ్రాపూకు సుబ్బారావు, మల్లాది రామారావు, J. B. రాజు, R రామచంద్రరావు, కొత్తపల్లి సుబ్రమణ్యం, R. V. R. కృష్ణారావు, అకిరి రామకృష్ణారావు, సుజాత అలీ, అశోక్‌రావు మల్లాది రామారావు హైదరాబాదు నుండి ఢిల్లీకి రిపోర్టరుగా బదిలీ అయ్యారు. 1994లో ఉత్తమ రిపోర్టర్‌గా జాతీయస్థాయిలో బహుమతి పొందారు ఆయన తన పదవికి రాజీనామా చేసి ఆంగ్ల దినపత్రికలో రిపోర్టరుగా చేరారు.

వార్తా విభాగంలో వార్తలు చదివే వారిలో డి. వెంకట్రామయ్య, జ్యోత్స్న ప్రముఖులు. వీరుగాక క్యాజువల్‌గా వార్తలు చదవడానికి వచ్చిన వారిలో పత్రికా సంపాదకులు పొత్తూరి వెంకటేశ్వరరావు, సురమౌళి, గుడిపూడి శ్రీహరి, పార్వతీ ప్రసాద్ ప్రముఖులు. డివి వెంకట్రామయ్య కథా రచయితగా మంచిపేరు సంపాదించారు. చక్కటి కంఠం గల వీరు సమర్థులైన వ్యక్తులు.

హైదరాబాదు కేంద్రం నుండి ఉర్దూ వార్తలు కూడా ప్రసారమవుతాయి. న్యూస్ ఎడిటర్ ఆంగ్లంలో జనరల్ పూల్ కాపీ తయారు చేస్తారు. దానిని తెలుగు, ఉర్దూలలో తర్జుమా చేసుకొని ఆయా విభాగాల న్యూస్ రీడర్లు చదువుతారు. ప్రాంతీయ వార్తలు ఉర్దూలో చదవడంలో వసీం అక్తర్ చాలా ప్రసిద్ధులు. ఆయన పదవీ విరమణ చేశారు. ఉర్దూ వార్తలు సా॥ 5-50 ని॥లకు హైదరాబాదు నుండి ప్రసారమవుతాయి. కడప కేంద్రం కూడా రిలే చేస్తుంది. ప్రాంతీయ వార్తలు తెలుగులో హైదరాబాదు నుండి సా॥ 6-15 ని॥లకు ప్రసారమై అన్ని ఆంధ్ర కేంద్రాలు రిలే చేస్తాయి. అలానే మధ్యాహ్నం 1-10 ని॥లకు హైదరాబాదు

ప్రాంతీయ వార్తలు కడప కేంద్రం రిలే చేస్తుంది. ఉదయం 6-45 ని॥లకు విజయవాడ కేంద్రం నుండి వచ్చే ప్రాంతీయ వార్తలు, హైదరాబాదు, కడప, విశాఖపట్టణం కేంద్రాలు రిలే చేస్తాయి. మ॥ 1-20 ని॥లకు విజయవాడ ప్రాంతీయ వార్తలు విశాఖపట్టణం రిలే చేస్తుంది.

హైదరాబాదు వార్తా విభాగం బుధ, శనివారాలలో ఆంధ్ర దేశంలో జరిగే వార్తలతో "రేడియో న్యూస్ రీల్" రాత్రి 7-45 ని॥లకు ప్రసారం చేస్తుంది. అన్ని కేంద్రాలు రిలే చేస్తాయి. అలానే అసెంబ్లీ సమావేశాలు జరిగే రోజుల్లో ప్రతిరోజూ శాసనసభ సమీక్ష పాత్రికేయులు చేస్తారు. అన్ని కేంద్రాలు రిలే చేస్తాయి. అలానే వార్తా వ్యాఖ్య పేర తాజా విషయాలపై వ్యాఖ్యలు ప్రసారం చేస్తూంది.

ఎన్నికల సమయాలలో రాత్రింబగళ్ళు ప్రత్యేక వార్తాప్రసారాలు చేయుడం ఆనవాయితీ. రేడియో మాధ్యమం త్వరగా వార్తలు చేరవేయడంలో తన ప్రత్యేకతను చాటుతుంది. ఉదాహరణకు ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ N. T. రామారావు మరణ వార్తను ఉ॥ 6 గం॥లకు ఢిల్లీ కేంద్రం నుండి వచ్చే ఆంగ్లవార్తల్లో ప్రసారం చేశారు. అర్ధరాత్రి దాటిన తర్వాత చనిపోవడంతో పత్రికలు ఆ వార్తను ప్రచురించలేకపోయాయి. జాతికి ఆ వార్తను తొలిసారిగా రేడియో త్వరితంగా అందించగలిగింది.

1995 మార్చి ఆఖరు నాటికి ఆంధ్రప్రదేశ్‌లో 98 లక్షల రేడియో సెట్లున్నట్లు ఒక అంచనా.

# దూరదర్శన్ కేంద్రం

హైదరాబాద్ దూరదర్శన్ కేంద్రం తెలుగువారి ఆశాజ్యోతిగా SITE కార్యక్రమాలతో ప్రారంభమైంది. తొలినాళ్ళలో ఆడియన్స్ రిసెర్చి ఆఫీసర్ శ్రీ బి.యస్.యన్. రావు ఈ కార్యక్రమంలో పనిచేశారు. ఆంధ్ర, కర్ణాటక రాష్ట్రాలలో కొంత భాగానికి ఈ ప్రసారాలు పరిమితం. Sattelite Instruction Television Experiment పేర ఈ కార్యక్రమాలు ప్రసారమయ్యాయి. పాఠశాల విద్యార్థుల కుద్దేశించిన ఈ ప్రసారాలు కొంతవరకు ప్రయోజనాన్ని సాధించాయి.

దూరదర్శన్ తెలుగు ప్రసారాలు ప్రారంభం కావడంతో తెలుగువారి సాంస్కృతిక వికాసానికి మరింత అవకాశం లభించింది. హైదరాబాదులోని రాజ భవన్ రోడ్‌లో అద్దె బంగళాలో ఈ ప్రసారాలు ప్రారంభమయ్యాయి. తొలినాళ్ళలో నండూరి విఠల్ డైరక్టర్‌గా కార్యక్రమాల రూపకల్పన చేశారు. నండూరి విఠల్ అద్భుతగాత్ర గాంభీర్యం గలవ్యక్తి. నాటకాలలో చక్కటి అనుభవం గల శ్రావ్య, మైనకంఠం.ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా జీవనం ప్రారంభించి స్టేషన్‌డైరక్టర్‌గా అనారోగ్య కారణాలతో 1986 ప్రాంతాలలో స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. అస్వస్థులుగా వుండి '93 ప్రాంతాలలో కాలం చేశారు. ప్రస్తుతం హైదరాబాదు కేంద్రం డైరెక్టర్.

వేదగిరి శర్మ, శ్రీ గోపాల్ దూరదర్శన్‌లో కార్యక్రమ నిర్వాహకులుగా పనిచేశారు. ఇద్దరూ అకాలమరణం చెందడం విధి విలాసం. వడ్డాది అప్పారావు దూరదర్శన్ అసిస్టెంట్ డైరక్టర్‌గా పనిచేశారు. 1940 జూలై 14వ జన్మించిన అప్పారావు దూరదర్శన్‌లో ప్రొడ్యూసర్‌గా 1963 లో చేరారు. ఆ తర్వాత ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్, అసిస్టెంట్ డైరక్టర్, డైరక్టరు హోదాలు నిర్వహించారు. దూరదర్శన్ డైరక్టరేట్ జనరల్ కార్యాలయంలో పనిచేశారు.

దూరదర్శన్ డైరక్టర్ జనరల్ కార్యాలయంలో పని చేసిన ఆంధ్రులలో దేవళ్ళ బాలకృష్ణ, హెచ్ యన్. పాత్రో, వి. వి. కృష్ణశాస్త్రి, విమలామిట్టల్ వి. అప్పారావు ప్రముఖులు.

హెచ్.యన్.పాత్రో ప్రవాసాంధ్రులు. 1933 జనవరి 13 న జన్మించిన పాత్రో వివిధ హోదాలలో ఆకాశవాణిలో హైదరాబాదు, జయపూర్ (ఒరిస్సా),

కేంద్రాలలో పనిచేశారు. 1982లో డైరక్టరు అయి, 87లో అహమ్మదాబాద్ దూర దర్శన్ కేంద్ర డైరక్టర్ అయ్యారు. 1991లో పదవీ విరమణ చేశారు.

దేవళ్ళబాలకృష్ణ 1933 సెప్టెంబర్ 6న జన్మించారు. లాపట్టా పుచ్చుకున్నారు. ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరి 1977 జనవరిలో అసిస్టెంట్ స్టేషన్ డైర క్టర్‌గా కడప వెళ్ళారు. 1980 జులైలో డైరక్టర్‌గా విశాఖపట్టణం బదిలీఅయ్యారు. గ్యాంగ్‌టాక్, విశాఖపట్టణం కేంద్రాలలో పనిచేసి, దూరదర్శన్‌లో డైరక్టరేట్‌లో కంట్రోలర్‌గా వెళ్ళారు. 1991 సెప్టెంబరులో హైదరాబాద్ దూరదర్శన్ డైర క్టర్‌గా రిటైరయ్యారు. విశాఖపట్టణంలో స్థిరపడ్డారు.

C. రామానుజాచార్యులు 1937 సెప్టెంబరులో జన్మించారు. ఆడియన్స్ రిసెర్చి ఆఫీసర్‌గా చేరి అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరుగా UPSC ద్వారా ఎంపి కయ్యారు. వివిధ కేంద్రాలలో పనిచేసి 1995 సెప్టెంబరులో గుల్బర్గా దూరదర్శన్ కేంద్రంలో డైరక్టర్‌గా రిటైరయ్యారు. టి. వి. రాఘవాచార్యులు దూర దర్శన్‌లో వివిధ కేంద్రాలలో పనిచేసి భోపాల్ దూరదర్శన్ కేంద్రంలో డిప్యూటీ డైరక్టర్‌గా పనిచేస్తున్నారు. R R.K. శ్రీ డిప్యూటీ డైరక్టర్‌గా దూరదర్శన్‌లో పనిచేస్తున్నారు.

R. వెంకటేశ్వర్లు మరో ఉన్నతాధికారి. 1954 జులై 1 జన్మించిన వెంక టేశ్వర్లు ఫీల్డ్‌పబ్లిసిటీ ఆఫీసర్‌గా గుంటూరులో ఒక దశాబ్ది పనిచేశారు. అంతకు ముందు ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా హైదరాబాద్‌లో పనిచేశారు.1988లోUPSC ద్వారా స్టేషన్ డైరక్టర్‌గా ఎంపికైన యువకుల్లో వెంకటేశ్వర్లు ఒకరు. మొట్ట మొదటిసారి తిరునల్వేలి స్టేషన్‌డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించారు. అక్కడి నుండి వరంగల్ స్థానిక రేడియో డైరక్టర్‌గా చక్కటి సేవలు అందించారు. 1994 నుండి దూరదర్శన్ హైదరాబాదు కేంద్రం డిప్యూటీ డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించారు. 1996లో కంట్రోలర్‌గా హైదరాబాదు దూరదర్శన్ కేంద్ర పదవీ బాధ్యతలు స్వీకరించారు.

దూరదర్శన్‌లో పనిచేసిన మరో ఉన్నతాధికారి సి. గురునాధ్. 1937 మే 28 న జన్మించిన గురునాధ్ ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా ఆకాశవాణిలో చేరారు. 1985 లో UPSC ద్వారా స్టేషన్ డైరక్టర్‌గా సెలక్టు అయ్యారు. బొంబాయి

దూరదర్శన్ కేంద్రం డైరక్టర్‌గా ఐదేళ్ళపాటు చక్కటి సేవలు అందించారు. బెంగుళూరు దూరదర్శన్ డైరక్టర్‌గా 85-89 మధ్యకాలములో పనిచేశారు. 1995లో స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు.

**భద్రవ్రత :**

కృష్ణాజిల్లాకు చెందిన భద్రవ్రత ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా ఆకాశవాణిలో చేరి విజయవాడ, హైదరాబాదు కేంద్రాలలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసి అసిస్టెంట్ డైరక్టర్‌గా రీజనల్ ట్రైనింగ్ సెంటర్ హైదరాబాదులో శిక్షణా బాధ్యతలు నిర్వహించారు. దూరదర్శన్ హైదరాబాదు డైరక్టరుగా 1982-84 సంవత్సరాలలో వ్యవహరించారు. 1984లో రిటైరై రాష్ట్ర ప్రభుత్వం SITE డైరక్టర్‌గా 1 సం॥ పనిచేశారు.

దూరదర్శన్ వార్తా విభాగం ప్రారంభమైన తర్వాత వార్తలు చదివే వ్యక్తిగా శాంతి స్వరూప్ ఎంపికయ్యారు తన ప్రత్యేక బాణీలో వార్తలు చదివి తెలుగు ప్రేక్షకులకు పరిచితులయ్యారు. కార్యక్రమ నిర్వాహకులుగా పనిచేసి దూరదర్శన్ ప్రేక్షకుల మన్ననలు పొందిన వ్యక్తులు ఎందరో.

ఓలేటి పార్వతీశం ప్రముఖులు. ఆకాశవాణి కడప కేంద్రంలో 1978 లో చేరి దూరదర్శన్‌కు బదలీ మీద 81 లో వెళ్ళారు. అక్కడే ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా 88 లో UPSC ద్వారా ఎంపికయ్యారు. వీరిది పండిత కుటుంబం. వెంకట పార్వతీశ కవులు జంటకవులుగా ప్రసిద్ధులు. వోలేటి పార్వతీశంగారి కుమారులు శశాంక. వారి కుమారులు పార్వతీశం. పాండిత్యంతో పాటు ప్రెజంటేషన్‌లో తన ప్రత్యేకతను పార్వతీశం చాటుకొన్నారు. సాహిత్య కార్యక్రమాల రూపకల్పనలో ఆయన మేటి.

వేదుల కృష్ణశాస్త్రి 1938 మార్చి15న పండిత కుటుంబంలో జన్మించారు. ప్రముఖ కవి వేదుల సత్యనారాయణశాస్త్రి కుమారులు. ఎం.ఏ. పట్టభద్రులై ఆంగ్లంలో లెక్చరర్‌గా పూనాలోని మిలటరీ శిక్షణా కళాశాలలో పదేళ్ళు పనిచేశారు. 1982 లో UPSC ద్వారా అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా సెలక్టు అయి 1985 ఫిబ్రవరిలో డైరక్టర్‌గా ప్రమోషన్ పొంది ఢిల్లీ వెళ్ళారు. దూరదర్శన్ హైదరాబాదు కేంద్రంలో

అసిస్టెంట్ డైరక్టర్‌గా పనిచేశారు. ఢిల్లీ, లక్నో కేంద్రాలలో పనిచేసి డైరక్టర్ జనరల్ కార్యాలయంలో కంట్రోలర్‌గా పనిచేస్తున్నారు.

విమలా మిట్టల్ మరొక ప్రముఖురాలు. ఈమె 1940 మార్చి 25వ జన్మించారు. రాష్ట్రేతరులను వివాహమాడారు. మిట్టల్ స్టేషన్ యింజనీర్‌గా ఆకాశవాణి, దూరదర్శన్‌లో పనిచేస్తున్నారు. 1967 డిసెంబరులో ఆకాశవాణిలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా చేరి అసిస్టెంట్ డైరక్టర్, కంట్రోలర్‌గా పనిచేశారు. ప్రవాసాంధ్రులలో ఈమె ప్రముఖురాలు.

# ఆంధ్రలో వివిధ కేంద్రాలు

ఆకాశవాణి హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం కేంద్రాలు చిరకాలంగా పనిచేస్తుండగా ఆరవ పంచవర్ష ప్రణాళికలో జిల్లా స్థాయి రేడియో కేంద్రాలు స్థాపించాలనే నిర్ణయానుసారం ఐదు కేంద్రాలు ప్రారంభించారు. తమిళనాడులోని నాగర్ కోయిల్‌లో 1984 అక్టోబరులోను, ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిలాబాద్‌లో 84 లోను, మహారాష్ట్రలోని షోలాపూర్‌లో, రాజస్థాన్‌లోని కోటలో, ఒరిస్సాలోని జేన్‌జర్‌లో ఐదు కేంద్రాలు ప్రారంభించారు. అభివృద్ధి కార్యక్రమాల ప్రసారం ఈ కేంద్రాల లక్ష్యం. జనజీవన స్రవంతిలో ప్రసార కేంద్రం ఒక భాగం కావాలని ప్రభుత్వ లక్ష్యం.

**ఆదిలాబాదు :**

హైదరాబాదు కేంద్ర ప్రసారాలు మారుమూల తెలంగాణా ప్రాంతమైన ఆదిలాబాద్ జిల్లాలో వినిపించడం లేదనే కారణంతో ఆదిలాబాద్‌లో 1 కిలోవాట్ ప్రసారశక్తి గల మీడియంవేవ్ కేంద్రాన్ని సాయంకాలం ప్రసారాలతో ప్రారంభం చేశారు. సి. రాజగోపాల్ తొలి అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా ఈ కేంద్రం హంగామా లేకుండా 12-10-1986లో ప్రారంభమైంది. ఆదిలాబాద్ ప్రాంతం జానపద సంగీతానికి ప్రసిద్ధి. యన్.యమ్.జి. రామకృష్ణ, కె.బి. గోపాలం (డైరక్టర్) అక్కడ పనిచేశారు. సుదూర ప్రాంతం కావడం, కనీస వసతులు లేకపోవడం వల్ల ఈ కేంద్రాన్ని 'difficult station' గా ఆకాశవాణి ప్రకటించింది. ఈ కేంద్రం మూడు గంటల స్వతంత్ర కార్యక్రమాలను ప్రసారం చేస్తోంది. జిల్లా వరకే ఈ కార్యక్రమాలు పరిమితమైనా ఆదిలాబాద్ జిల్లా సువిశాలమైన జిల్లా కావడంవల్ల జిల్లా మొత్తంమీద శ్రోతలు ఈ కార్యక్రమాలు వినిపించడం లేదు. గత దశాబ్ది కాలంలో ఈ కేంద్రం గణనీయమైన ప్రగతి సాధించలేదు.

**యఫ్. యం. కేంద్రాలు :**

మీడియం వేవ్ కేంద్రాల బ్యాండుపై వందకుపైగా ప్రసార కేంద్రాలు రావడ తో 'జామ్' అయిపోయే క్లిష్ట పరిస్థితి ఏర్పడింది. దాన్ని అధిగమించడానికీ, అంతర్జాతీయ ఫ్రీక్వెన్సీ సంస్థ వారిచ్చిన రెండు వందల ఫ్రీక్వెన్సీలు వాడుకోవలసి రావడం వల్ల భారత ప్రభుత్వం ఏడవ పంచవర్ష ప్రణాళికలో జిల్లా స్థాయి యఫ్.యం. కేంద్రాలను విశేషంగా ప్రారంభించారు.

కొత్తగూడెం :

భారతదేశంలోనే మొట్టమొదటి స్వతంత్ర F.M. కేంద్రాన్ని కొత్తగూడెంలో ప్రారంభించారు. సింగరేణి కాలరీస్ వారి సౌజన్యంతో భూ సేకరణచేసి రెండేళ్ళు కష్టపడి స్వతంత్ర భవనాలు, స్టూడియోలు రామవరం ప్రాంతంలో నిర్మించారు. కేంద్ర ప్రారంభోత్సవం వైభవంగా జరిగింది. ఢిల్లీనుండి తొలి డైరక్టర్‌గా డా॥ ఆర్. అనంతపద్మనాభరావు ప్రారంభోత్సవానికి రంగం సిద్ధం చేశారు. అప్పట్లో కేంద్ర పరిశ్రమల శాఖామాత్యులు శ్రీ జలగం వెంగళరావు చొరవతో ఖమ్మం జిల్లా శ్రోతల కలలపంటగా ఈ కేంద్రం ప్రారంభమైంది.

1989 మార్చి 24న కొత్తగూడెం మహిళా కళాశాలలో జరిగిన సభలో వెంగళరావు ఈ కేంద్రాన్ని లాంఛనంగా ప్రారంభించారు. 6 కిలోవాట్ల ప్రసార శక్తితో ఈ కేంద్రంప్రసారాలు జరుపుతోంది. రాష్ట్ర సమాచార శాఖామంత్రి శ్రీ కారుపాటి వివేకానంద ముఖ్య అతిధిగా విచ్చేశారు. చీఫ్ యింజనీర్లు కె పి. రామస్వామి, యం. జె. విశ్వనాథం, డిప్యూటీ డైరక్టర్ జనరల్ టి. ఆర్. మాలాకర్ కార్యక్రమంలో పాల్గొన్నారు. స్వతంత్ర కేంద్రంగా కేవలం సాయంకాలం మూడున్నర గంటల ప్రసారాలతో తొలుత ప్రారంభమైంది. ఆ తర్వాత ఉదయ ప్రసారాలు కూడా ఆరంభమయ్యాయి. శ్రీ యస్. పి. గోవర్ధన్, A.S.D., శ్రీ యస్. యం. జి. రామకృష్ణ, కబీర్ అహమ్మద్ డైరక్టర్లుగా ఈ కేంద్రం ముందుకు సాగింది. శ్రీ వై. రాఘవులు ఈ కేంద్రం బాధ్యతలు '93లో స్వీకరించారు. ఈ కేంద్రం సమర్పించిన 'కిన్నెరసాని' రూపకానికి జాతీయ స్థాయి బహుమతి లభించింది. ఇతర జిల్లా కేంద్రాలవలె కాక ఇది Non-local స్టేషన్. ఇందులో కడప, విశాఖపట్టణం కేంద్రాలవలె సంగీత కార్యక్రమాలు, ఇతర కార్యక్రమాలు సజావుగా సాగుతాయి.

నిజామాబాద్ :

తెలంగాణా జిల్లాలలో నిజామాబాద్‌లో ప్రసార కేంద్రాన్ని అప్పట్లో కేంద్ర ప్రసార సమాచార శాఖామంత్రి శ్రీ పర్వతనేని ఉపేంద్ర ప్రారంభించారు. 1990 సెప్టెంబరు 9న ఈ కేంద్రం ప్రారంభించారు. శ్రీ యం. నిత్యానందరావు

డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించారు. సాయం ప్రసారాలు మాత్రమే ఈ F. M. కేంద్రాల ద్వారా ప్రసారమవుతున్నాయి. శ్రీ ప్రహరాజు పాండురంగారావు అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా పని చేశారు. 1996 ఆగస్టు నుండి ప్రయాగ వేద పతి అసిస్టెంట్ డైరక్టర్‌గా పని చేస్తున్నారు.

వరంగల్ :

కాకతీయ సామ్రాజ్య ప్రాచీన వైభవాలకు నెలవైన ఓరుగల్లు అనబడే వరంగల్లులో F M రేడియో కేంద్రం ప్రారంభమైంది. అభివృద్ధి కార్యక్రమాలకు ప్రాచుర్యం కల్పించడం ఈ కేంద్ర లక్ష్యం. కాకతీయ విశ్వ విద్యాలయానికి ప్రధాన కేంద్రమైన వరంగల్‌లో రేడియో కేంద్రాన్ని అప్పట్లో కేంద్ర ప్రసార సమాచార శాఖ మంత్రి శ్రీ ఉపేంద్ర 17 ఫిబ్రవరి 1990న ప్రారంభించారు.

P. R. రెడ్డి, ఆర్. వెంకటేశ్వర్లు ఈ కేంద్రం డైరక్టర్లుగా ప్రసారాల ప్రమాణం మెరుగుపరచడానికి విశేష కృషి చేశారు. డా॥ పి. మధుసూదనరావు 1994 నుండి అసిస్టెంట్ స్టేషన్ డైరక్టర్‌గా ఈ కేంద్రం బాధ్యతలు స్వీకరించారు. తెలంగాణా జిల్లాలలో ఇది నాలుగో కేంద్రం. (అదిలాబాదు, నిజామాబాద్, కొత్త గూడెం, వరంగల్)

రాయలసీమ కేంద్రాలు :

అనంతపురం :

అనంతపురం ఆకాశవాణి F. M. కేంద్రం 1991 మే 29న లాంఛనంగా ప్రారంభమైంది. తొలి డైరక్టర్‌గా డా॥ ఆర్. అనంతపద్మనాభరావు ఆ కేంద్ర అభివృద్ధికి విశేష కృషి చేశారు. పాత్రికేయులు కాశీపతి మాటల్లో చెప్పాలంటే క్షణక్షణాభివృద్ధికి యత్నించారు. R. V. రమణమూర్తి, కళా కృష్ణమూర్తి, విద్యాలంకార్ తొలినాళ్ళలో కార్యక్రమ నిర్వాహకులు. U.V.S.R ఆంజనేయులు కేంద్రం ఇన్‌స్టలేషన్ ఆఫీసర్‌గా కేంద్రాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. K. S. శాస్త్రి తొలి స్టేషన్ ఇంజనీర్. ఈ కేంద్రం అసిస్టెంట్ డైరక్టర్లుగా ఆరవీటి శ్రీనివాసులు, డా॥ టి. మాచిరెడ్డి పని చేశారు. అనంతపుర సాంస్కృతిక వికాసానికి ఈ కేంద్రం కృషి చేస్తోంది. కృష్ణదేవరాయ విశ్వ విద్యాలయం

యిక్కడే వుండటం ఈ కేంద్రానికి ఆయువుపట్టు. ఇక్కడ పనిచేసిన నాగసూరి వేణుగోపాల్ చక్కని రచయిత. సైన్సు విషయాలపై కృషి చేస్తున్నారు. ప్రస్తుతం విజయవాడ బదిలీ అయ్యారు.

**తిరుపతి :**

శ్రీ వేంకటేశ్వరునికి నెలవైన తిరుపతిలో 1991 ఫిబ్రవరి 1న F. M. కేంద్రాన్ని అప్పటి ప్రసారమంత్రి సుబోధ్ కాంత్ సహాయ్ ప్రారంభించారు. తొలి డైరక్టర్‌గా యు. రాసయ్య, ఆ తర్వాత శ్రీమతి విజయలక్ష్మి సౌందర రాజన్ పనిచేశారు. ఆ తర్వాత పి. రాజారావు అసిస్టెంట్ డైరక్టర్‌గా వ్యవహరిస్తున్నారు. 1995 లో తిరుమలలో జరిగే సుప్రభాత సేవను ఉదయం 2.30 గం॥ల నుండి ప్రత్యక్ష ప్రసారం చేస్తున్నారు. తిరుమలలో జరిగే అనేక సాంస్కృతిక కార్యక్రమాలకు ఈ కేంద్రం ప్రసార మాధ్యమం.

**కర్నూలు :**

1992 మే 1న అప్పటి కేంద్రన్యాయ శాఖామాత్యులు శ్రీకోట్ల విజయభాస్కర రెడ్డి ఈ కేంద్రం ప్రారంభించారు. శ్రీ యస్. పి. గోవర్ధన్ ఈ కేంద్రం తొలి డైరక్టరు. శ్రీశైలంలో జరిగే కార్యక్రమాల ప్రసారాలకు ఈ కేంద్రం ప్రాధాన్యత నిస్తున్నది. ఇది F.M. కేంద్రం.

**మార్కాపురం :**

ఒంగోలు జిల్లాలోని మార్కాపురంలో 1993 లో ఆగస్టు 9 వ F. M. కేంద్రాన్ని అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డి ప్రారంభించారు. తొలి అసిస్టెంట్ డైరక్టరు Y. హనుమంతరావు. వీరి తర్వాత కె. వి. హనుమంతరావు రెండేళ్ళు ఆ బాధ్యతలు స్వీకరించారు. ఈ కేంద్రం స్థాపనతో ఆంధ్రప్రదేశ్‌లో 12 రేడియో కేంద్రాలు పనిచేస్తున్నాయి. గుంటూరు జిల్లా మాచెర్లలో మరో F. M. కేంద్ర స్థాపనకు స్థలసేకరణ పూర్తి అయింది.

# స్వర సుధాకరులు

సినిమారంగంలో తెరమీద కనిపించే నటులకున్న ప్రాధాన్యం తెరవెనుక వున్న కళాకారులకు ప్రేక్షకుల్లో వుండదు. ఆకాశవాణిలో కూడా నిత్యం తమ కంఠ స్వరాన్ని వినిపించే అనౌన్సర్లకున్న ప్రాముఖ్యం శ్రోతలలో మిగతా కార్యక్రమ నిర్వాహకులకుండదు. ఒక్కొక్కసారి కొందరు అడుగుతుంటారు. 'స్టేషన్ డైరక్టర్‌కు అనౌన్సరు ప్రమోషన్ రావాలంటే ఎన్నేళ్లు పడుతుందని?' వాళ్ళ దృష్టిలో అనౌన్సరు చాలా ప్రధాన వ్యక్తి.

నిజానికి ప్రసార సమయంలో అనౌన్సరు అష్టావధానిలా ప్రవర్తించాలి. సమయస్ఫూర్తి మరీ అవసరం. పొరబాట్లను కప్పిపుచ్చగలడు, సృష్టించగలడు. కుంభవృష్టి కురుస్తున్నా, తుఫాను బీభత్సం సంభవించినా రాత్రింబవళ్ళు డ్యూటీలు చేసే ప్రధాన పాత్రధారి అనౌన్సరు. శ్రోతలు కోరిన పాటలు మొదలు అనేక కార్య క్రమాల ద్వారా శ్రోతలకు చిరపరిచితుడు.

మదరాసు కేంద్రంలో తొట్ట తొలి తెలుగు అనౌన్సరు మల్లంపల్లి ఉమామహేశ్వరరావు. 'ఉమ' పేరుతో కార్యక్రమాలలో పాల్గొనేవారు. ఆయన ప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారి సోదరులు. మదరాసు కేంద్ర అనౌన్సర్లలో భానుమతి (సినీ భానుమతికాదు) ప్రసిద్ధులు. ప్రసిద్ధ రచయిత్రి మాలతి చందూర్‌గారు కూడా మదరాసు కేంద్రంతో అనుబంధం ఉన్నవారే. ఆకాశ వాణి హైదరాబాదు కేంద్రం మహిళా విభాగంలో కార్యక్రమ రూపకల్పనలో పాల్గొన్న యువతీమణులలో శ్రీమతి V. S. రమాదేవి పేర్కొనదగినవారు. వీరు 1964లో కేంద్ర న్యాయ సర్వీసులో చేరి 1985-92 మధ్య కాలంలో కేంద్ర లా సెక్రటరీగా వ్యవహరించారు. కొంతకాలం ప్రధాన ఎన్నికల అధికారిగా పనిచేసి 1993 జులై నుండి రాజ్యసభ సెక్రటరీ జనరల్‌గా పనిచేస్తున్నారు. రేడియోతో తమ అనుబంధాల్ని గొప్పగా చెప్పుకొనే వ్యక్తులలో వీరొకరు. వీరు అనేక గ్రంథాలు వ్రాశారు. పంకజం, దారితప్పిన మానవుడు, అందరూ మనుషులే వీరు వ్రాసిన నవలలు. నా కరిగిపోయే కలలు వీరి మ్యూజింగ్స్ రచన.

హైదరాబాదు కేంద్రం 1950 లో డెక్కన్ రేడియోతో విలీనమైంది. తెలుగు కార్యక్రమాల ప్రకటనకు అనౌన్సర్లు రిక్రూట్ అయ్యారు. రతన్‌ప్రసాద్, పట్టం సత్యనారాయణ మూడు దశాబ్దాలపాటు అనౌన్సర్లుగా పనిచేసి తమ ముద్ర వేశారు.

కార్మికుల కార్యక్రమంలో Family Serialలో వీరు ప్రధాన పాత్రలు పోషించారు. భువనేశ్వరి, ఇందిరాదేవి, నిర్మలావసంత్, ఇలియాస్ అహమ్మద్, M.N. శాస్త్రి, జ్యోత్స్న, శేషారత్నం, పండా శమంతకమణి తమ సుమధుర కంఠాల ద్వారా శ్రోతలకు చిరపరిచితులు. జ్యోత్స్న అనౌన్సర్ నుండి తెలుగు న్యూస్ రీడర్‌గా విజయవాడలో పనిచేసి ప్రస్తుతం హైదరాబాదు వార్తా విభాగంలో ఉన్నారు. అలానే దివి వెంకట్రామయ్య చక్కని రచయిత. నవలలు, కథలు వ్రాశారు. పండా శమంతకమణి తెలుగులో వ్రాసిన రామకథకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి లభించింది. శ్రీమతి M. G. శ్యామలాదేవి రేడియో నాటక విభాగంలో మూడు దశాబ్దాలు పనిచేసి పదవీ విరమణ చేశారు. E. కపర్ది సౌజన్యంగల వ్యక్తి. మల్లాది చంద్రశేఖర్, సాధన చక్కటి నైపుణ్యం గల వ్యక్తులు.

హైదరాబాదు వివిధభారతి, వాణిజ్య ప్రసార విభాగంలో అనౌన్సర్లుగా పని చేస్తున్నవారు బహుముఖ ప్రతిభావంతులు, సర్వశ్రీ ఉమాపతి బాలాంజనేయశర్మ, ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి, సీత, ఇందిరా బెనర్జీ, మట్టపల్లి రావు, రాజగోపాల్, రూప్‌లాల్ ఆ యా రంగాలలో కృషి చేశారు. ఆకెళ్ళ దంపతులలో సత్యనారాయణమూర్తి అనారోగ్యంతో కాలధర్మం చెందారు. ఆయన చాలా టి.వి. నాటకాలలో నటించారు. బాలాంజనేయశర్మ వాక్శుద్ధిగల పండితుడు. మట్టపల్లి రావు రూపొందించిన రూపకాలకు జాతీయస్థాయిలో ఆకాశవాణి బహుమతులు లభించాయి. ఇందిరా బెనర్జి సంపన్న కుటుంబంలో జన్మించి ఆకాశవాణి పట్ల అభిమానంతో పని చేస్తున్నారు. పుష్పలత అనే అనౌన్సరు ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా UPSC ద్వారా సెలక్టు అయి కొంతకాలం దూరదర్శన్‌లో పనిచేసి రాజీనామా చేశారు.

విజయవాడ కేంద్రంలో పనిచేసి పదవీ విరమణ చేసిన అనౌన్సర్లు లబ్ధప్రతిష్ఠులు. సర్వశ్రీ కూచిమంచి కుటుంబరావు, శ్యామసుందరి, లత, కమలకుమారి, A.B. ఆనంద్, పేరి కామేశ్వరరావు, కోకా సంజీవరావు, A. లింగరాజు శర్మ, వెంపటి రాధాకృష్ణ కేవలం అనౌన్సర్లుగానే గాక ఇతర కార్యక్రమాల ద్వారా ప్రసిద్ధి పొందారు. కుటుంబరావు చక్కటి కంఠస్వరం గల వ్యక్తి. వీరు నటించిన నాటిక నేడు నాటకం రసవత్తరంగా సాగింది. లత రచయిత్రిగా పేరు తెచ్చుకొన్నారు. డ్రామా వాయిస్‌లుగా సర్వశ్రీ సి. రామమోహనరావు, నండూరి సుబ్బారావు, వి.బి. కనకదుర్గ, సీతారత్నమ్మ ప్రముఖులు.

ఈ తరం అనౌన్సర్లలో సర్వశ్రీ M. వాసుదేవమూర్తి, పన్నాల సుబ్రహ్మణ్యభట్, S.B. శ్రీరామమూర్తి, D.S.R. ఆంజనేయులు ప్రముఖులు. వాసుదేవమూర్తి సెలక్షన్ గ్రేడ్ అనౌన్సరుగా పనిచేస్తున్నారు. ఈయన రూపొందించిన రైలు ప్రయాణం నాటకం ఆకాశవాణి వార్షిక పోటీలలో జాతీయస్థాయి బహుమతి పొందింది. పన్నాల సుబ్రహ్మణ్యభట్ కొంతకాలం మహిళా శిశువిభాగం ప్రొడ్యూసర్‌గా పనిచేశారు. చెణుకులు కార్యక్రమం ద్వారా శ్రోతలకు పరిచితులు, చక్కని రచయిత, విమర్శకులు. రేడియో ప్రసారాలపై ప్రసార తరంగిణి ప్రచురించారు. జాతీయ స్థాయిలో బహుమతులు పొందారు. మంచి చిత్రకారుడు. శ్రీరామం నిశ్శబ్ద గమ్యం, మెట్లు, మహావిశ్వ రూపొందించి జాతీయ స్థాయిలో బహుమతులు పొందారు.

మల్లాది సూరిబాబు గాత్ర సంగీతంలో ప్రావీణ్యం సంపాదించారు. వీరి కుమారులు మల్లాది శ్రీరాం ప్రసాద్ చక్కని గాత్రం గల వ్యక్తి. విజయవాడ కేంద్రంలో తంబురా కళాకారుడుగా ఎన్నికయ్యారు. యువతరం అనౌన్సర్లలో సర్వశ్రీ విజయకుమారి, E. V. కృష్ణశాస్త్రి, శారద జయప్రకాష్, కామేశ్వరి, S. శారద, మాడుగుల రామకృష్ణ గణనీయమైన సేవ చేస్తున్నారు.

కడప కేంద్రం 1963లో ప్రారంభమైనపుడు అనౌన్సర్లుగా సర్వశ్రీ గాడిచర్ల శ్రీనివాసమూర్తి, గుర్రం కోటేశ్వరరావు నియుక్తులయ్యారు శ్రీనివాసమూర్తి ప్రముఖ స్వాతంత్రోద్యమ నాయకులు గాడిచర్ల హరిసర్వోత్తమరావు కుటుంబానికి చెందినవారు. కోటేశ్వరరావు న్యాయవాద పట్టా పుచ్చుకొన్నారు. ఇద్దరూ మూడు దశాబ్దాలు పనిచేసి రిటైరయ్యారు. అరవీటి శ్రీనివాసులు కొంతకాలం అనౌన్సరుగా పనిచేసి తర్వాత జానపద విభాగం ప్రొడ్యూసరయ్యారు. తర్వాత అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరయ్యారు. గోపి, రమణమోహన్, వనజారెడ్డి, మంజుల సుమనోహర్ కంఠ స్వరం గల యువతీయువకులు.

విశాఖపట్టణం కేంద్రంలో అనౌన్సర్లుగా శ్రీ A V.S. రామారావు, కుమారి కామాక్షమ్మ, శ్రీమతి కుమారి ప్రముఖంగా చెప్పుకోదగినవారు. రామారావు మంచి నటులు, ప్రయోక్త.

అద్దంకి మన్నార్ అనౌన్సర్‌గా విజయవాడలో పనిచేస్తూ ఢిల్లీ తెలుగు విభాగం న్యూస్ రీడర్‌గా వెళ్ళారు. నండూరి విఠల్ అనౌన్సర్‌గా విజయవాడలో పనిచేసి తర్వాత ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అయి దూరదర్శన్ కేంద్ర డైరక్టరయ్యారు. శారదా శ్రీనివాసన్ అనౌన్సరుగా తొలుత జీవనం ప్రారంభించి తర్వాత డ్రామా వాయిస్‌గా హైదరాబాదులో రెండున్నర దశాబ్దాలు పనిచేసి పదవీ విరమణ చేశారు.

ఇతర కేంద్రాలలో వర్థిష్ణులైన అనౌన్సర్లు పనిచేస్తున్నారు. నిర్దుష్టమైన ఉచ్చారణ, సమయోచిత మార్పులు గమనించగల సామర్థ్యం అనౌన్సర్ల కవసరం. దాదాపు 80 మంది దాకా ఆంధ్ర దేశంలో అనౌన్సర్లు పనిచేస్తున్నారు. వీరిలో ప్రతిభావంతులు ఉన్నత విద్యావంతులు అనౌన్సర్లుగా చేరడం విశేషం. అనంతపురం కేంద్రంలో డా॥ వి. పోతన, కె. పుష్పరాజ్ పనిచేస్తున్నారు. పోతన తెలుగులో పిహెచ్.డి. చేశారు. పుష్పరాజ్ బి.ఏ.బి.యల్. పట్టభద్రులు. తిరుపతిలో పని చేస్తున్న P. అమృత, కొత్తగూడెంలో పనిచేస్తున్న రాజబాబు- యిలా ఎందరో ప్రతిభావంతులు. ఆకాశవాణి భవిష్యత్తు వీరి కృషిపై ఆధారపడి వుంది. అకుంఠిత దీక్ష, ఉద్యోగంపట్ల గౌరవం ప్రధాన లక్ష్యంగా పని చేయాలి.

## ప్రసార దంపతులు

సినీ దంపతులుగా కృష్ణ-విజయనిర్మల, అంజలి-ఆదినారాయణరావు, రాజసులోచన-సి.యస్. రావు, నాగార్జున-అమల ఇలా ఎన్నో జంటలు. అలానే ప్రసార రంగంలో కొన్ని జంటలు నిర్విరామ కృషిద్వారా శ్రోతల్ని ఆకట్టుకొన్నారు. రేడియో అన్నయ్య, అక్కయ్యలుగా పేరుగాంచిన న్యాపతి రాఘవరావు కామేశ్వరి అగ్రశేణి ప్రసార దంపతులు.

తొలి తరానికి చెందిన శ్రీనివాసన్ దంపతులు. సుభద్రా శ్రీనివాసన్, శ్రీనివాసన్ దంపతులు విజయవాడ, కొహిమాలలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌లుగా పనిచేశారు. సుభద్రగారు కొహిమాలో అనారోగ్యంతో మరణించారు హైదరాబాదులో మరో శ్రీనివాసన్ దంపతులు పనిచేశారు. N. S. శ్రీనివాసన్ వేణుగానలోలురు. సంగీత విభాగం ప్రొడ్యూసర్‌గా పదవీ విరమణ చేశారు. వీరి సతీమణి శారదా శ్రీనివాసన్ నాటక విభాగంలో పనిచేసి పదవీ విరమణ చేశారు. హైదరాబాదులో

అనౌన్సర్ల జంటలు రెండున్నాయి. ఇలియాస్ అహమ్మద్, జ్యోత్స్న అనౌన్సర్లుగా నవలా రచయితలుగా పేర్లు తెచ్చుకొన్నారు.

అలానే సత్యనారాయణ, సీత అనౌన్సర్లుగా పేరు తెచ్చుకొన్న మరో జంట. నటుడుగా నాటక రచయితగా పేరున్న సత్యనారాయణ 1988లో అకాల మరణం పొందారు. హైదరాబాదులో పనిచేస్తున్న సుధామ, ఉషారాణి దంపతులు కార్యక్రమ నిర్వాహకులుగా పేరు గడించారు. సుధామ మంచి రచయిత; కవి.

విజయవాడ కేంద్రంలో మంజులూరి కృష్ణకుమారి దంపతులు మరో జంట. కృష్ణకుమారి కార్యక్రమ నిర్వాహకురాలిగా UPSC ద్వారా ఎంపికయ్యారు. విజయవాడ, విశాఖపట్టణ కేంద్రాలలో 10 సం॥లుగా పనిచేస్తున్నారు. కృష్ణకుమారి చక్కని రచయిత్రి. ఈమె వ్రాసిన అముద్రిత రచనకు NCERT వారి జాతీయ బహుమతి లభించింది. పన్నాల సుబ్రహ్మణ్యభట్, కృష్ణకుమారి ఆదర్శ దంపతులు. భట్ మంచి విమర్శకుడు, రచయిత, ప్రసార మాధ్యమంలో పట్టువున్న వ్యక్తి. చెణుకుల ద్వారా శ్రోతల్ని ఆకట్టుకుంటారు. కార్టూనిస్టుగా పేరు తెచ్చుకొన్నారు. తెలుగు ప్రసారాలను గూర్చి ధారావాహికంగా ప్రసారం చేసి 'ప్రసార తరంగిణి' పుస్తకం ప్రచురించారు. 1996లో నేపథ్యంపేర 20 వారాలు ధారావాహికంగా ఆధునిక నాటకంపై ప్రామాణిక గ్రంథం వెలువరించారు. నాదబంధం (1983), మార్గబంధం (1988) రూపకాలకు భట్ జాతీయస్థాయి బహుమతులు పొందారు.

N బాబూరావు దంపతులు విజయవాడలో ట్రాన్స్మిషన్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. యూన్సీ కె.వి. కుమారి కవయిత్రి. వచన కవితా సంపుటాలు వెలువరించారు. వీరిద్దరు ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌లుగా నాలుగేళ్ళుగా నిజామాబాద్ కేంద్రంలో పనిచేస్తున్నారు.

మంత్రివాది మహేశ్వర్, వసుమతి దంపతులు మరో జంట. వీరిద్దరు ప్రస్తుతము అనంతపురం కేంద్రంలో కార్యక్రమ నిర్వాహకులు. మహేశ్వర్ చక్కని గాయకుడు. వీరిద్దరు విశాఖ, హైదరాబాదుల్లో వుండగా వివాహం అయింది. విశాఖ, విజయవాడలలో పనిచేసి అనంతపురం బదలీ అయ్యారు.

కలగా కృష్ణమోహన్, పరిమళ దంపతులు విజయవాడలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్‌లుగా వుంటూ వివాహం చేసుకొన్నారు. వీరిద్దరూ ప్రస్తుతం హైదరాబాదు ఆకాశవాణి, దూరదర్శన్‌లలో విడిగా పనిచేస్తున్నారు. కృష్ణమోహన్ రూపొందించిన మాట-మౌనం 1988లో జాతీయస్థాయి బహుమతి పొందింది.

రాఘవరెడ్డి, అమృత దంపతులు ప్రస్తుతం తిరుపతిలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్, అనౌన్సర్లుగా వున్నారు. వీరు తొలుత అనంతపురంలో రిక్రూట్ అయ్యారు. అమృత తండ్రి శ్రీపులికంటి కృష్ణారెడ్డి 1992 అక్టోబరు-95 అక్టోబరు మధ్యకాలంలో మూడేళ్ళు ఆకాశవాణి గౌరవసలహాదారుగా వ్యవహరించారు. రెడ్డి కవి, కథకుడు, మంచి భావుకుడు. చక్రపాణి మిత్రుడు.

వీరేగాక కలిసిమెలిసి పనిచేయడంవల్ల పరస్పరాకర్షితులై దంపతులై కన్నా మిన్నగా ప్రవర్తించిన వారెందరో ఆ యా కేంద్రాలలో వున్నారు. వీరిని ప్రసార ప్రేమికులనవచ్చు, ఇది ఆకాశవాణి ప్రత్యేకత.

—o—

# BROADCASTERS IN TELUGU

The first radio station of the Indian Broadcasting Company was inaugurated by the British viceroy in India-Lord Irwin on July 23, 1927 at Bombay. The Indian Broadcasting Service was named as All India Radio in 1936. It took two more years for the starting of Telugu broadcasts. The first Telugu broadcast went on air from the Madras station of All India Radio on June 1, 1938.

## MADRAS

The first announcer in Telugu was Mallampalli Umamaheswara Rao, brother of Mallampalli Somasekhara Sharma, eminent historian. Prominent programme officials during those days at Madras station were Messrs. S. N. Moorthy, Dr. A. Veerabhadra Rao, Achanta Janakiram, Dr. Balantrapu Rajani Kanta Rao, Buchibabu and Srivatsava. Famous poets Sri Sri and Jashuva were on the staff for sometime.

The present film writer and actor Gollapudi Maruti Rao worked at Madras station. The present Station Director of Bombay S. V. Reddy served as the Station Director, Madras during 1992-93. Between 1942 and '45' additional South Indian Service from Delhi used to broadcast programmes in Tamil and Telugu. Ms. Durga Bhaskar is presently working as the Deputy Director, All India Radio, Madras.

## VIJAYAWADA

All India Radio, Vijayawada station had its birth on December 1, 1948. Vijayawada, the cultural capital of Andhra has its own importance. Dr. Ayyagari Veerabhadra Rao, Station Director during 1950-52 has nourished the organisation.

Eminent personalities on the rolls of Vijayawada AIR, contributed their mite for bringing out qualitative programmes. Among them were Messrs. Rajani, Buchibabu, Banda Kanakalingeswara Rao (Drama), Pingali Lakshmikantham and G. V. Krishna Rao (spoken word), Dr. Mangalampalli Balamurali Krishna and Sandhyavandanam Srinivasa Rao (Music),

Prayaga Narasimha Sastry as rural producer was popular. Ushasri, the best broadcaster in spoken word, was popular through 'Dharma' Sandehalu'. Voleti Venkateswarlu and Mallik popularised music programmes. The Vijayawada station takes the credit of bagging an international award, Japan Radio prize for a musical feature on River Godavari entitled "Konda nunchi kadali daka" written by Rajani.

## HYDERABAD

Started as a private radio station (Deccan Radio) in 1933, Hyderabad station was taken over by the Nizam in 1935. It was named Deccan Radio in 1939. Later on April 1, 1950, it was taken over by All India Radio. Besides the major language Telugu, Hyderabad station broadcasts programmes in Urdu, Hindi, Marathi, Kannada and English.

Popular among the broadcasters were A. V. Rao (Annayya in children's programmes), Messrs. Gopichand (rural producer), Stanam Narasimha Rao (drama), Devulapalli Krishna Sastri, Dr. Dasarathi, Ravuri Bharadwaja (spoken word), Vinjamuri Varadaraja Iyyengar and Manchala Jaganadha Rao (Carnatic music). Children's programmes were popularised by the couple Radio Annayya and Akkayya (Nyapati Raghava Rao and Kameswari). Kesavapanthulu Narasimha Sastry, with his Sanskrit lessons on the air, taught Sanskrit for over a decade. Vinjamuri Sita Devi popularised folk music as folk music producer. Similarly, Palagummi Viswantaham popularised light music. Ramamurthy Renu, Veluri Sahajananda popularised spoken word programmes.

M. V. Rajagopal entered IAS after serving as Station Director, Hyderabad. Yuvavani service was inaugurated on December 20, 1970 over Hyderabad. Commercial broadcasting was started on March 21, 1971. Presently, Mr. V. V. Sastry is the Station Director of the main station while Mr. S. P. Govardhan is the Director of Commercial Broadcasting Service.

## VISAKHAPATNAM and CUDDAPAH

Visakhapatnam and Cuddapah stations had their birth in 1963. Bezawada Gopala Reddy, the then Minister for Information and Broadcasting, inaugurated both the stations Cuddapah (on June 17, 1963 and Visakhapatnam on August 4, 1963). They started as relay centres of Vijayawada and Hyderabad respectively. Visakhapatnam started origination of programmes in 1970 and Cuddapah started origination from November 2, 1974. Adilabad station of All India Radio, a district-level radio centre was commissioned during 1984.

The first independent Frequency Modulation (FM) station was inaugurated in March 24, 1989 by the then Industries Minister J. Vengala Rao. At Warangal, a district-level radio station was started in 1989. Nizamabad went on air in 1990. Mr. P. Upendra, the then Union Minister for information and broadcasting, inaugurated both the stations.

Tirupati and Ananthapur started functioning in 1991. Kurnool station was inauguarated by Mr. K. Vijayabhaskara Reddy. Markapuram station was inaugurated in August 1993 by Mr. Vijayabhaskara Reddy. Totally, there are 12 stations in Andhra Pradesh at present.

News in Telugu started from All India Radio, Delhi before the World War II, produced eminent newsreaders - Messrs, Kongara Jaggaiah (who later became a film stars MP), Kapila Kasipati, Srivatsava, Sri Sri (famous poet), Kothapalli Subrahmanyam and Panyala Ranganadha Rao. Regional news unit at Hyderabad started its regional news bulletins after the State formation. News unit at Vijayawada was started in 1980s. Hyderabad and Vijayawada stations started commercial services from March 21, 1971.

Programme officials who worked at the Directorate General of All India Radio, after serving the stations of Andhra Pradesh won laurels. Mention of P. V. R. Rao, Deputy Director General, should be made as he was the brain behind the

preparation of AIR manual which is like "Manu Smruti" for broadcasting. He was the Accountant General.

Others like R. C. Rajasekhar (son of Rayaprolu Subba Rao) S. N. Moorthy, B. K. Rao, Rajani, Pullela Venkateswarlu and Satyam Sankaramanchi are popular. Gunturu Raghuram, B. R. Chalapathi Rao, Prapancham Sitaram, B. R. Pantulu, R. A. Padmanabha Rao worked as Directors of programmes at the Directorate. Among the Chief Engineers, V. A. D. Rayulu (son of Viswantha Satyanarayana), N. V. Lu, M. I. Suryanarayana, V. V. Rao and T. N.G. Dass, Chief Engineer, Eastern Circle, R. Seshaiah (South Zone) have made their mark.

Programmes in Telugu were being broadcast from Radio Moscow since 1968 have recently been withdrawn. Prominent among the newsreaders from Delhi who had gone there were Messrs. Kandukuri Suryanarayana, T. Sriramulu, Addanki Mannar, Edida Gopala Rao and Bandaru Srinivasa Rao. External Services Division of All India Radio had started overseas broadcasts in Telugu from April 1990 (Ugadi). Radio Ceylon broadcasts Telugu programmes over its commercial channel regularly.

*(Pub. in Deccan Chronicle)*

# డా॥ ఆర్. అనంత పద్మనాభరావు రచనలు

| | | |
|---|---|---|
| 1. | రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరి | జీవితచరిత్ర |
| 2. | మారని నాణెం (రెండు ముద్రణలు) | నవల |
| 3. | శ్రీమల్యాద్రి వైభవం | పరిష్కరణ |
| 4. | విరంకుశోపాఖ్యానం | ,, |
| 5. | కందుకూరి రుద్రకవి | Ph D. పరిశోధన |
| 6. | ప్రకృతికాంత | ,, |
| 7. | వక్రించిన సరళరేఖలు | నవల |
| 8. | సంజ వెలుగు | ,, |
| 9. | హరివంశం (రెంషు ముద్రణలు) | ధారావాహిక |
| 10. | సుగ్రీవ విజయం | పరిష్కరణ |
| 11. | రాయలసీమ రత్నాలు | సంకలనం |
| 12. | రామాయణములో స్త్రీ పాత్రలు | (ఆంగ్లానువాదం) |
| 13. | శారద మంజీరాలు | సంకలనం |
| 14. | Literary Heritage | ఆంగ్ల గ్రంథం |
| 15. | ఆంధ్రకేసరి | వ్యాసాలు |
| 16. | భక్తి సాహిత్యం | ,, |
| 17. | భయంవేస్తోందా భారతీ ! | కవితా సంపుటి |
| 18. | ముత్తుస్వామి దీక్షితులు | బాలసాహిత్యం |
| 19. | మన ప్రకాశం | జీవితచరిత్ర |
| 20. | రాయలసీమరత్నాలు | రెండోభాగం |
| 21. | ప్రభాత వదనం | Mulk Raj Anand (Morning Face అనువాదం) |
| 22. | ఛాయారేఖలు | (Amitar Ghosh Shadow Lines అనువాదం) |
| 23. | నీరు | (RAMA-WATER అనువాదం) |
| 24. | ఆంధ్రమణిహారాలు | పబ్లికేషన్ డివిజన్ ప్రచురణ |
| 25. | స్వగతాలు | నవలిక |
| 26. | ఆకాశవాణి ప్రసారాలు-తీరుతెన్నులు | |
| 27. | ప్రసార ప్రముఖులు | |



# డా. ఆర్. అనంతపద్మనాభరావు

జననం : 1947 జనవరి 29

డిగ్రీలు : ఎం. ఏ. పిహెచ్. డి.

అవార్డులు : కవిత్రయ అవార్డు
యస్. ఆంజనేయులు అవార్డు
ఉత్తమ అనువాదక బహుమతి
(తెలుగు విశ్వవిద్యాలయం 1993)

ఉద్యోగం : ప్రభుత్వ కళాశాల అధ్యాపకత్వం (1967-75)
ఆకాశవాణిలో వివిధ హోదాలు (1975 నుండి)

రచనలు : 35 గ్రంథాలు

అనువాదాలు : Mulk Raj Anand-Morning Face
(ప్రభాత వదనం)
Amitav Ghosh-Shadow Lines
(ఛాయారేఖలు)
Dr. I. Panduranga Rao-Women in Valmiki
(రామాయణంలో స్త్రీ పాత్రలు)
Water - (నీరు) Rama
Literary Heritage ఆంగ్ల గ్రంథం

విదేశీ పర్యటన : 1996 ఆగస్టులో జర్మనీలో ప్రసార మాధ్యమాల
అంతర్జాతీయ సదస్సుకు హాజరు